అపరాధ పరిశోధన అనుబంధం—22

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## వ్రేలి ముద్రల ఫోర్జరీ
రచన : సుజనశ్రీ

## పారిపోయిన సిపాయి!
రచన : ముద్దా సురేష్

## నిధి?
రచన : వసుంధర

3

## గంధం దొంగలు!!
రచన : శ్యాంబాబు

"ఖైదీ" సీరియల్ - 17 వ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—22

అక్టోబర్, 1975
వెల : 3-00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-36959

ముద్రణ : క్రాంతి ప్రెస్, మద్రాసు-1

గెడా రంగారావు

# వ్రేలి ముద్రల ఫోర్జరి

సుజనశ్రీ

స్ప్రింగ్ డోర్ నెట్టుకొని ఇన్‌స్పెక్టర్ రాజేంద్ర లోపలకు అడుగు పెట్టాడు, "సారథి & రామ్మూర్తి" డిటెక్టివ్ ఏజన్సీలోకి.

"హలో ఇన్‌స్పెక్టర్! చెప్పా చెయ్యకుండా ఇలా ప్రత్యక్షమయ్యారేం? అంత అర్జంటు అయితే మేమే వచ్చే వాళ్ళంకదా!" సారథి ఆశ్చర్యంతో అన్నాడు.

"అవును సార్! కాకితో కబురంపితే, రెక్కలు కట్టుకొని వచ్చే వాళ్ళం కదా! అలా కుర్చీలో కూర్చోండి సార్! బోర్నవిటా కావాలా, కూల్ డ్రింక్ కావాలా?" రామ్మూర్తి వంత పాడాడు.

వాళ్ళిద్దరి ఆదరణనూ లక్ష్య పెట్టనట్టుగా గంభీరంగా

ఉండి పోయాడు రాజేంద్ర.

"ఇంతకీ ఏం జరిగింది సార్? ఏదైనా హత్యా?" సారథి అసలు విషయంలోకి దిగాడు.

"అవును మిస్టర్ సారథి! హత్యే జరిగింది. హతుడి తల వెనుక భాగం పచ్చడి పచ్చడి అయి పోయింది! అంతే గాదు. హతుడి రక్తంలో తడిసిన వ్రేలి ముద్రలు గోడలనిండా, హత్యాయుధం మీద దొరికినయ్!"

"అవి ఎవరివో తెలిసినయ్యా?"

"తెలిసినయ్. అవి ఎవరివంటే, మిస్టర్ సారథి అనే వ్యక్తివి!"

"ఏమిటి సార్? ప్రొద్దున్నే మీరేదో జోక్ చేస్తూన్నట్టున్నారు?" రామూర్తి నవ్వాడు.

"అలా నవ్వకు! నేను సీరియస్‌గా మాట్లాడుతున్నాను! నిజానికి మరొకరు మరొకర్నయితే, ఈ పాటికి బేడీలు వేసి లాకప్‌లో వేసి ఉంచును! సారథి ఈ హత్య చేశాడని నేనూ నమ్మలేకుండా ఉన్నాను! అందుకే క్రితం రాత్రి మీరెక్కడ తిరిగారు, ఏంచేశారో చెప్పండి సారథీ!"

"ఏమిటిసార్! ఈ దారుణం! నేరాల్ని పరిశోధించి, హంతకుల్ని నేరస్థుల్ని న్యాయానికి అందించే ఒక డిటెక్టివ్ హత్య చేయటమా? అందులోనూ మోటుగా, కసిగా తల చితక్కొట్టి చంపటం! నిజానికి మా ఇద్దరిలో ఎవరికైనా హత్యచేసే అవసరమే కలిగితే పిస్టల్‌తో కాల్చి చంపుతాం కానీ యిలా కోల్డ్‌బ్లడడ్ హత్య ఛస్తే చేయలేం! ఏమంటారు గురూగారూ?" రామ్మూర్తి, సారథి వంక చూశాడు.

## 5

సారథి బల్లమీద పేపర్ వెయిట్‌ని అటూ ఇటూ త్రిప్పుతూ, మౌనంగా ఉండి పోయాడు.

"మిస్టర్ సారథీ? ఇంతకీ మీరు నోరు విప్పనే లేదు!" రాజేంద్ర అతడి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అన్నాడు.

"అదే ఆలోచిస్తున్నాను ఇన్‌స్పెక్టర్! నా మీద పగబట్టిన వ్యక్తు లెవరో ఈ పని చేసి ఉండాలి! ఎవరయి ఉంటారా అని?"

"అంటే?"

"అంటే— నేను జైలుకు పంపిన నేరస్తు లెవరో ఈ మధ్యన విడుదలై ఉంటారు. అతడే ఈ హత్య చేశాడు. నేరాన్ని నా మీదకు నెట్టాడు. దాంతో అతడి శత్రువు ఒకడు చనిపోయాడు. మరొకడు ఆ నేరానికి ఉరికంబం ఎక్కుతాడు."

ఇన్‌స్పెక్టర్ రాజేంద్ర టోపీ తీసి బల్లమీద పెట్టాడు. "అదీ సంభవం కావచ్చు! కానీ నా పని నేను నెరవేర్చాలి కదా? నిన్న రాత్రి 9-30, పది గంటల మధ్య ఈ హత్య జరిగి ఉండవచ్చు. ఆ వేళలో మీరెక్కడున్నారు?"

"ఆ విషయం చెప్పబోయే ముందు మీ దృష్టికి మరో ముఖ్యమైన సమాచారం చెప్పాలి! వారం రోజుల క్రితం ఒక వ్యక్తి నా దగ్గరకు వచ్చాడు. తన పేరు లక్ష్మణరావు అని చెప్పుకున్నాడు. తనను ఎవరో హత్య చేయటానికి ప్రయత్నిస్తున్నారనీ, తనను రక్షించాలనీ చెప్పాడు.

"అతడు మాట్లాడుతూ తన జేబులోంచి సిగరెట్ కేస్ తీశాడు. తను సిగరెట్ వెలిగించి, నా ముందరకు

నెట్టాడు సిగరెట్ కేస్‌ని! నేను కేస్ అందుకుని, దాన్ని తెరచి సిగరెట్ తీసుకుని, కేస్ మూసేసి తిరిగీ అతడి కిచ్చేశాను! అతడు నాకు సిగరెట్ కేసుని అందించ టంలో గల అంతరార్థం ఇప్పుడిప్పుడే అర్థమవు తోంది!''

''ఏమిటది?''

''నా వేలి ముద్రలు సంగ్రహించటానికి వేసిన ఎత్తు గడ ఇది!''

''అర్థం లేని మాటలు! సిగరెట్ కేస్ మీద నుంచి మీ వేలి ముద్రలు హతుడి ఇంట్లోని గోడల మీదకూ, హత్యాయుధం మీదకూ ప్రాకినయ్ అంటారు?''

''అవును సార్! సరిగ్గా అంతే జరిగింది!''

''మీ కట్టు కథలు ఆపండి! నిన్నరాత్రి మీ కార్య క్రమం గురించి చెప్పండి ఇకనైనా?'' అని అరిచాడు ఇన్‌స్పెక్టర్ రాజేంద్ర.

# 2

సారథి సిగరెట్ వెలిగించాడు. ఇన్‌స్పెక్టర్‌కి మరో సిగరెట్ ఆఫర్ చేశాడు. ఇద్దరూ నాలుగు దమ్ములు లాగాక ఇద్దరిలోనూ టెన్షన్ కొంత తగ్గింది.

''ప్రఖ్యాత రాజకీయనాయకుడు, యం. యల్. ఏ. అయిన గుప్తాగారింట్లో రాత్రి పార్టీ జరిగింది. బహుశా మీకు ఆహ్వానం వచ్చి ఉండాలే!'' సారథి నింపాదిగా చెప్పాడు. అతడిలో ఏ విధమైన ఉద్వేగమూ లేదు.

''అవును! నాకూ ఆహ్వానం వచ్చింది. కానీ మా బంధువు లింట్లో వివాహానికి హాజరు కావాల్సి ఉండటం మూలాన, నేను పార్టీకి రాలేక పోయాను'' ఇన్‌స్పెక్టర్ రాజేంద్ర తలూపాడు.

"రాత్రి తొమ్మిదిన్నరకు కాబోలు మేం పార్టీకి వెళ్ళే సన్నాహంలో ఉండగా, మాకు ఫోన్ కాల్ వచ్చింది. మాకు కొత్త క్లయింట్ ఒకాయన తగిలాడులె వారం రోజుల క్రితం. అతడు తన నెవరో హత్య చేయటానికి యత్నిస్తున్నారనీ, తనకు రక్షణ కల్పించమనీ కోరాడు. అతగాడికి అనుమానం వేసినప్పుడు మాకు ఫోన్ చేయ మన్నాం!

"అలాగే అతడు రాత్రి, మేం ప్రయాణ సన్నాహంలో ఉండగా ఫోన్ చేశాడు. ఆటో రిక్షాలో మేం బయలు దేరాం, అతడి చిరునామాకు. సగం దోవలో ఒక కారు వేగంగా దూసుకు వచ్చి, మాకు అడ్డంగా ఆగింది. ఎవరో మమ్మల్ని అటకాయించ బోతున్నారని మేం కారులోని వ్యక్తుల్ని ఎదుర్కొ బోయాం.

"కారులోంచి యం. యల్. ఏ. గారి బావ మరిది దిగాడు. పార్టీ మొదలవబోతున్నదనీ, సారథీ, రామ్మూర్తిల్ని దగ్గరుండి తీసుకురమ్మని గుప్తాగారు ప్రత్యేకంగా పంపారనీ చెప్పాడు. మేము మరో అరగంటలో వస్తా మన్నా వినలేదు అతగాడు. చేసేది లేక కారులో ఎక్కాం."

"అంటే 9-30 నుంచీ పార్టీ అయి పోయేదాకా మీరు గుప్తాగారింట్లో నుంచి బయటకు రాలేదా?"

"లేదు! పార్టీ అయిపోయేక మళ్ళీ కారులో మా ఇంటి దగ్గర గుప్తాగారి బావమరిది దిగబెట్టి వెళ్ళాడు. అప్పటికి టయిమ్ ఒంటి గంట కావస్తున్నది."

"గుప్తాగారినీ, ఇతర అతిథుల్నీ ప్రశ్నించి ఆ విష యం తెలుసుకుంటాం! కానీ మీ వ్రేలి ముద్రలు హతుడి

ఇంట్లో గోడల మీదా, హత్యాయుధం మీదా ఎలా వచ్చినయ్ !"

"అవి ఎలా వచ్చినయ్యో నాకు తెలుసు! కానీ మీరు నా మాటల్ని నమ్మక పోవచ్చు!"

"అంటే ? ఏమిటి మీర నేది?"

"వ్రేలి ముద్రలు ఫోర్జరీ చేయబడ్డయ్!"

"అద్భుతం! అత్యద్భుతం సారథీ! సంతకాలు ఫోర్జరీ చేయటం గురించే నాకు తెలుసుగానీ, వ్రేలి ముద్రల ఫోర్జరీ బహుశా మీరు సృష్టించి ఉంటారనుకుంటాను! నాతో పరాచికాలాడటానికి ఇప్పుడే సమయం దొరికిందా మీకు ?" ఇన్ స్పెక్టర్ రాజేంద్ర చిరాకుగా అన్నాడు.

"లేదు ఇన్ స్పెక్టర్! నేను చెప్పేది నిజం! కావాలంటే చూడండి!" అంటూ సొరుగులో పుస్తకాలు వెదికి, వాటి మధ్యలోంచి అమెరికన్ జర్నల్ ని ఒకదాన్ని తీసి ఇన్ స్పెక్టర్ ముందు పడేశాడు సారథి.

ఇన్ స్పెక్టర్ రాజేంద్ర అందులో పేజీలు తిరగేశాడు. "నమ్మశక్యం గాకుండా ఉందే! ఇంతకీ వ్రేలి ముద్రల్ని ఫోర్జరీ ఎలా చేస్తారంటారు ?" జర్నల్ లో వ్యాసం చదివే ఓపికా, విరామమూ లేని ఇన్ స్పెక్టర్ అడిగాడు.

"చాలా సింపుల్ ! సిగరెట్ కేస్ గాని, నీళ్ళగ్లాసు గానీ మనం పట్టుకున్నప్పుడు మనచేతి వ్రేలి ముద్రలు వాటిమీది స్పష్టంగా పడతాయి. వాటిని జాగ్రత్తగా తీసుకు వెళ్ళి, వాటికి సరిపోయేలా మైనం మీద 'మోల్డ్' తయారుచేసి, మైనాన్ని గట్టిపరుస్తారు. గ్రామఫోన్ రికార్డు మీద సన్నని గీతల్ని రికార్డు చేసినట్టే!"

"అయితే హంతకుడెవరో చాలా పకడ్బందీగా, ముందే వేసుకున్న పథకం ప్రకారం హత్య చేశాడు!

సరే! మీరు నాతో రావాలి! గుప్తాగార్ని కలుసుకుని వద్దాం! నా డ్యూటీ ప్రకారం ఎంక్వైరీ పూర్తి చేయాలి కదా?"

"అలాగే సార్! మీతో సహకరించటానికి మేం ఎప్పుడూ సంసిద్ధులమే!" అంటూ సారధి కుర్చీలోంచి లేచాడు.

పోలీసు జీప్ యం. యల్. ఏ. గారింటి ముందు ఆగింది.

"ఓ! ఇన్‌స్పెక్టర్ గారా? నిన్న పార్టీకి రాకుండా తప్పించుకుని ఇప్పుడు వస్తున్నారా?" నిష్ఠూరమాడాడు గుప్తా.

"క్షమించండి! బంధువులింట్లో వివాహం ఉండటం వలన రాలేక పోయాను! పోతే మీనుంచి చిన్న సమాచారం కావాలి సార్! సారధి మీ ఇంటికి పది గంటలకు వచ్చానని చెపుతున్నాడు. అప్పటినించి, పార్టీ అయిపోయేదాకా అతనిక్కడే ఉన్నట్టు రూఢిగా చెప్పగలరా?"

"ఖచ్చితంగా చెప్పగలను. 9-15 దాకా సారధి రాకపోయేసరికి నేనే మా బావమరిదిని పంపాను కారిచ్చి, వాళ్ళను తీసుకువచ్చేందుకు. క్రితం ఏడాది మా ఇంట్లో జరిగిన దొంగతనం కేసులో సారధి పరిశోధించి దొంగని పట్టుకున్నాడు. పోయిన డబ్బు చాలా భాగం దొరికింది. అప్పట్నుంచి ఆయనా, ఆయన అసిస్టెంటూ మా ఆప్తుల్లో వారయారు!"

"పార్టీ జరిగినంత సేపూ అతడు మీ కళ్లెదుటే ఉన్నాడా?"

"మీ పోలీసులకు ప్రతిదీ అనుమానమే సార్! అతడు నా ప్రక్కనే ఉన్నాడు. నేను స్వాగతం చెప్పిన అతిధులతో ఖుషీగా మాట్లాడుతూ వాళ్ళను ఉల్లాస పరిచాడు కూడాను!"

"మీ ఇంట్లో పార్టీకి హాజరయిన ఒకరిద్దరు ముఖ్య అతిధుల్ని పేర్కొనగలరా?"

గుప్తా వారిలో మూడు నాలుగు పేర్లు సూచించాడు. ఇన్ స్పెక్టర్ రాజేంద్ర నోట్ బుక్ లో వాటిని రాసుకున్నాడు.

పోలీస్ జీప్ మళ్ళీ బయలుదేరింది.

"మీ వద్దకు ఈ మధ్యనే ఎవరో వ్యక్తి వచ్చాడన్నారే? అతడి సమాచారం చెప్పండి సారధి!"

"అతడి పేరు లక్ష్మణరావు. స్టాక్ బ్రోకర్ నని చెప్పుకున్నాడు. అతడు నివశించేది నుంగంబాకంలో. డాక్టర్ మురళీధర్ ఇంట్లోని గ్యారేజీ అతడి నివాసం అట!"

"నిజంగా! అతడి పేరు లక్ష్మణరావు కాదు! రామారావు. అతడే ఇప్పుడు హత్య చేయబడింది!" ఇన్ స్పెక్టర్ ఆశ్చర్యంతో అరిచాడు.

"అయితే అతడు నాతో మారుపేరు చెప్పి ఉండవచ్చు! అతడ్ని చంపుతానని బెదిరిస్తూ ఒక జాబు వచ్చిందట! దాన్ని నాకూ చూపించాడు; అతడి ఇంటి వద్ద రెండు మూడు రోజులు నిఘా ఏర్పాటు చేశాం! లక్ష్మణరావు ఉదయం ఎనిమిది గంటలకు బయటకు వెళ్ళేవాడు. రాత్రి ప్రొద్దు పోయాక ఇల్లు చేరుకునేవాడు!"

"అతడు స్టాక్ మార్కెట్ లో తీరిక లేకుండా ఉండేవాడనుకుంటాను!" ఇన్స్పెక్టర్ అడిగాడు.

"ఒకరోజు అతడి దినచర్యనూ గమనించాం! అతడు ఎక్కువగా పార్కుల్లోనే గడిపేవాడు. చెట్ల నీడల్లో పడుకుని నిద్రపోయేవాడు. మొదటి షో సినిమాకు విధిగా ప్రతిరోజూ హాజరయేవాడు!"

"మరి అతడి పోషణకు ఆదాయం ఎక్కడ్నుంచి వచ్చేదో?"

"అదే అర్థం కాలేదు! ఒకసారి, మనం అతడి ఇల్లు చూసి వద్దామా సార్!" సారధి అడిగాడు.

"దానికేముంది? అలాగే పోదాం!"

జీప్ మరో దారిన మళ్ళింది.

మార్చ్యురీలో శవాన్ని చూశారు.

"ఇతడే నా వద్దకు వచ్చిన లక్ష్మణరావు!" అన్నాడు సారధి.

"ఇతడి అసలు పేరు రామారావు! మీతో అతడు అబద్ధమాడే ఉండాలి!" రాజేంద్ర నిదానంగా చెప్పాడు.

రామారావు ఉరఫ్ లక్ష్మణరావు ఇంటికి దారితీశారు అందరూ.

విశాలమైన ఆవరణలో మధ్యగా పెద్ద బంగళా ఉంది. అందులోనే డాక్టర్ మురళీధర్ నివసిస్తున్నాడు. ఒక మూలగా గ్యారేజీ ఉంది. దానికి పెద్దరేకు గేటు ఉంది. ఆ గేటు రోడ్డు మీదకే ఉండటం మూలాన, గ్యారేజీ లోకి రాకపోకలు, బంగళాలో వ్యక్తులకు కనబడవు.

గ్యారేజీకి కాపలాకాస్తూన్న కానిస్టేబుల్ ఇన్‌స్పెక్టర్‌కి సెల్యూట్ చేశాడు.

గేటుతెరిచి ఇన్‌స్పెక్టర్ రాజేంద్ర, సారధి, రామ్మూర్తి లోపలకు ప్రవేశించారు. గోడల నిండా సినిమా

తారల క్యాలెండర్లు తగిలించి ఉన్నయ్.

ఒక మడత మంచం, మరో మూల కుర్చీ, టేబుల్ వున్నాయ్. టేబుల్ మీద డిటెక్టివ్ నవలలున్నయ్ చిందర వందరగా.

గ్యారేజీ మధ్యగా చెక్కలతో పార్టీషన్ ఉంది. దాని కవతల స్టవ్వూ, నాలుగైదు స్టీలు గిన్నెలూ, రెండు కూజాలూ ఉన్నాయ్.

"ఇంతకీ ఇక్కడ హత్య జరిగినట్టుగా ఎవరు గమనించారు ముందుగా!"

"రాత్రి బీట్ కానిస్టేబుల్ ఈ ప్రాంతంలో తిరుగుతుండంగా, ఈ గ్యారేజీ లోంచి ప్రేలుడు వినబడిందట. అతగాడు డాక్టర్ గారిని మేలుకొలిపి గ్యారేజీ తెరిపించి చూశాడు. లక్ష్మణరావు నెత్తురు మడుగులో పడి ఉన్నాడట!"

"అంటే హంతకుడే ఆ ప్రేలుడిని ఏర్పాటు చేసి ఉండాలి తను వెళ్ళిపోతూ. అతగాడు వెళ్ళిపోయిన కాసేపటికి ప్రేలుడు సంభవించగానే, చుట్టు ప్రక్కల వాళ్ళు పరుగెత్తి వచ్చి, హత్య జరిగిన విషయం చూడాలని అతడి పథకం!"

సారథి గ్యారేజీలోని డ్రాయరూ, పుస్తకాల అరా వెదుకసాగాడు.

"దేనికోసం మీరు వెదికేది?"

"హతుడి బ్యాంకీ ప్యాస్ పుస్తకం కోసం చూస్తున్నాను!"

లావాటి బైండు పుస్తకంలో దాచిపెట్టబడి ఉన్న ప్యాస్ బుక్‌ని బయటకు లాగాడు సారథి.

ఆంధ్రా బ్యాంకు సేవింగ్స్ ప్యాస్‌బుక్ అది. గత ఆరు నెలలుగా, నెలకు వెయ్యి రూపాయలు చొప్పున జమ కట్టబడి ఉంది. విత్‌డ్రాయల్స్ అసలు లేవు.

పుస్తకాన్ని ఇన్స్‌పెక్టర్ చేతికిచ్చాడు సారధి, తర్వాత గోడ మీది వ్రేలిముద్రల్ని భూతద్దంతో పరీక్షగా చూశాడు చాలాసేపు.

"ఇన్‌స్పెక్టర్! ఈ వ్రేలిముద్రల్లో ఒక పెద్ద లోపం ఉంది. కనిపెట్టారా?"

"నేను వాటిని పరీక్షించలేదు! ఏమిటా లోపం మీరే చెప్పండి!"

"వ్రేలి ముద్రలు ఏవీ పూర్తిగా పడలేదు. ప్రతిముద్ర లోనూ ఏదో మూల విరిగి పోయిన గుర్తులు కనుపిస్తున్నాయి!"

"ఏదీ!నన్ను చూడనివ్వండి!" ఇన్‌స్పెక్టర్ రాజేంద్ర భూతద్దం తీసుకుని పరీక్షగా చూశాడు. సారధి చెప్పింది నిజమేనని ఒప్పుకున్నాడు.

ఆ బంగళా ఓనర్ డాక్టర్ మురళీధర్ అప్పుడే లోపలకు వచ్చాడు. "ఓ! ఇన్స్‌పెక్టర్ గారా? హంతకుడి ఆచూకీ ఏమైనా దొరికిందాండీ?"

"ఏదీ ఇంకా కేసు పరిశోధనలోనే ఉందండీ! అన్నట్టు చనిపోయిన రామారావు ప్రవర్తన ఎలాటిదో చెబుతారా?"

"అతడు ఎప్పుడూ ఇంటి పట్టున ఉండే వాడు కాదండీ! ఉదయం ఎనిమిది గంటలకు బయటకు వెళ్ళి పోయేవాడు. రాత్రి పొద్దు పోయాక వచ్చేవాడు. ఈ ఇంటి ఆవరణలో మాత్రం ఏనాడూ అల్లరి చిల్లరి పనులు చేయలేదు." డాక్టర్ మురళీధర్ చెప్పాడు.

"అద్దె క్రమంగా నెలనెలా ఇచ్చేవాడా?" సారథి అడిగాడు.

"చేరిన కొత్తలో, ఆరునెలల అద్దె బకాయి పడ్డాడు. గ్యారేజీ ఖాళీ చెయ్యమన్నాం! ఒక్క నెల గడువివ్వమని ప్రాధేయ పడ్డాడు. అలాగే నెల తిరిగే లోపల ఆరునెలల అద్దె చెల్లించేశాడు. తర్వాత నుంచీ ఏనెల అద్దె ఆ నెలే ఇచ్చేశాడు."

సినిమా తారల క్యాలెండర్ల మధ్యగా, పెన్సిల్‌తో ఏదో నెంబరు కనిపించీ కనిపించకుండా వుంది. సారథి దాన్ని నోట్ చేసుకోమని రామ్మూర్తికి సంజ్ఞ చేశాడు.

"మీ పరిశీలన పూర్తి అవుతే, మిమ్మల్ని మీ ఆఫీసు దగ్గర డ్రాప్ చేసి, నేను స్టేషన్‌కి వెళతాను!" రాజేంద్ర ఆ ఇద్దరి వంకా చూస్తూ అన్నాడు.

"మేం రెడీసార్!"

జీప్ వెళ్తూన్నప్పుడు సారథి మళ్ళీ మౌనాన్ని చీలుస్తూ అన్నాడు. "రాజేంద్ర గారూ? రామారావుకి అంత డబ్బు ఎలా వచ్చిందంటారు?"

"బహుశా స్టాక్ ఎక్స్ఛేంజి మీద కమీషన్ సంపాదించాడేమో!"

"అది అంత తేలికైన పని కాదు! రామారావు చేసే వ్యాపారం బ్లాక్ మెయిల్. ఆరునెలల నుంచి అతడు ఎవరో డబ్బున్న వ్యక్తిని బ్లాక్ మెయిల్ చేసి డబ్బు గుంజుతున్నాడు. సగం వాడుకుని సగం బ్యాంకీలో వేసుకున్నాడు!"

"ఆరి వీడిల్లు వాన గురవా?"

"అంతే గాదుసార్! బ్లాక్ మెయిల్ చేయబడుతున్న వ్యక్తి ఇతడ్ని శాశ్వతంగా వదిలించుకునేందుకు మాంఛి

పథకం వేసుకున్నాడు! అతడెవరోగానీ, నాకూ బద్ధ శత్రువు అయి ఉండాలి! అందుకే రామారావుని హత్య చేసి, ఆ నేరాన్ని నామీదకు నెట్టాడు. ఒక దెబ్బకు రెండు పిట్టలు రా!"

"మీమీద అంత విరోధం పెంచుకునే వారెవరబ్బా?"

"వాడెవడో స్మగ్లరో, చీకటిబజారు వ్యాపారస్థుడో అయి ఉంటాడు. వాడెవరయిందీ రేపీ పాటికి ఆరా తీయనూ?" సారధి పెదవిని కొరుకుతూ అన్నాడు.

# 3

ఫ్రిజ్ లోంచి విస్కీ సీసా తీసి గ్లాసులోకి వంచుకున్నాడు రామ్మూర్తి.

సారధి సిగరెట్ త్రాగుతూ అటూ ఇటూ గదిలో పచార్లు చేస్తున్నాడు.

"రామ్మూర్తీ! టెలిఫోన్ డైరక్టరీ వెదుకు. నీవు నోట్ చేసుకు వచ్చిన నెంబరు ఎవరిదో చూడు!"

రామ్మూర్తి ఎగిరి గంతేసి డైరక్టరీ అందుకున్నాడు. దాన్లో పేజీలు తిరగేశాడు. "హరి భగవంతుడా! ఆ నెంబరు ఎవరి దనుకున్నారు గురో? ప్రఖ్యాత బిజినెస్ మాగ్నెట్ లక్షాధికారి రాజారావుది!"

"అంటే బంగారు వ్యాపారం, బియ్యం, అపరాల వర్తకం, టెక్స్టైల్ మిల్ ఉన్న రాజారావేనా?"

"అవునండీ! అతడే! అతడి కెన్ని వ్యాపారాలున్నాయో లెక్క వేయాలంటే అరగంటకు తక్కువ పట్టదు?"

"అతడికీ ఈ రామారావుకీ ఏమిటి సంబంధం?"

"పోనీ ఏదో పాట్లకాయ పారుగులాటి సంబంధం

ఉన్నదే అనుకుందాం? ఈ రాజారావుకీ మనకీ మధ్య శత్రుత్వం ఎందుకు రావాలి?" రామ్మూర్తి మరో ప్రశ్న వేశాడు.

"అన్నట్టు మనం గత ఏడాది నుంచీ చేపట్టిన కేసుల్ని నెమరువెయ్యి! చట్టానికి విరుద్ధంగా ప్రవర్తించి, మన పరిశోధనవల్ల పట్టుబడి జైలు కెళ్ళిన వాళ్ళందర్నీ ఒకసారి గుర్తు తెచ్చుకో!"

రామ్మూర్తి అరగంటసేపు ఫైళ్ళలో కుస్తీ పట్టాడు.

"ఆఁ! దొరికింది సార్! పదినెలల క్రితం విదేశీ సరుకుల్ని చేరవేస్తున్న ఒక వ్యాపారస్తుడ్ని జైలుకు పంపాం గుర్తుందా సార్? అతడి పేరు అహమ్మద్ ఖాన్! అతడితో ఈ రాజారావుకి వాటా ఉందని విన్నాం! కానీ రాజారావు తన పలుకుబడి ఉపయోగించి, తనకతనితో ప్రమేయమే లేదన్నాడు!"

"కరెక్ట్! చూస్తూ చూస్తూ లక్ష రూపాయల సరుకు ప్రభుత్వం స్వాధీనం అయిపోయింది. పైగా అతడికి నమ్మకంగా పనిచేసే అహమ్మద్ ఖాన్ జైలుకు పోయాడు. ఏదో పార్టీలో రాజారావుకి మనల్ని పరిచయం చేశారెవరో! అప్పుడతగాడు మనల్ని కొరకొర చూశాడు."

"అవును సార్! తప్పకుండా ఇది అతడి పనే అయి ఉంటుంది. మనకు దొరికిన నెంబరుకు ఫోన్ చేసి చూద్దాం గురూ?"

"తప్పకుండా చేయి! రాజారావు ఈ క్షణంలో ఎక్కడున్నదీ కనుక్కో!"

రామ్మూర్తి టెలిఫోన్ ముందు కూర్చుని బిజీ అయిపోయాడు.

"రాజారావు ప్రస్తుతం ఊళ్ళో లేడట. కాటన్ మిల్ కి వెళ్ళి రెండు రోజు లయిందట!"

"చూశావా? హత్య జరిగిన సమయంలో తను ఊళ్ళో లేనట్టుగా గట్టి ఎలిబీ సృష్టించుకున్నాడు!" సారథి కనుబొమ్మ లెగరేశాడు.

"ఇవాళ సాయంత్రం మద్రాసు చేరుకుంటాడట! అతగాడి కాటన్ మిల్ మద్రాసు సిటీ లిమిట్స్ దాటాక అదేదో పల్లెలో ఉంది కదూ?"

"అవును! సాయంత్రం రాజారావుని కలవాలి!"

"మీరా? చూస్తూ చూస్తూ ఒంటరిగా వెళ్ళి హంతకుడి కెదురు పడతారా? పులి నోట్లో తల దూర్చటమే!" రామ్మూర్తి ఆదుర్దాగా అడిగాడు.

"పులినోట్లో తల దూర్చేది నేను కాదు రామ్మూర్తీ! నాతో ఎప్పుడు భేటీ వేసుకున్నాడో ఆ క్షణంలోనే రాజారావు పులి నోట్లో తల పెట్టాడు!" సారథి కసిగా అన్నాడు.

# 4

సాయంత్రం అయేసరికి సారథి, రామ్మూర్తి ఇద్దరూ రాజారావు అండుకో ఆఫీసుకు వెళ్ళారు.

"రామ్మూర్తీ! నీవు క్రిందనే ఉండు! నేను మేడ మీదికి వెడతాను! అరగంటలో నేను తిరిగి రాకపోతే నీవూ పైకిరా!"

"అలాగే! బహుశా నీపి పాటికి అరెస్టుకాబడి, జైల్లో ఉండి ఉంటావని కలలు గంటూ ఉంటాడు రాజారావు! నిన్ను చూడంగానే గుండె ఆగి మరణిస్తాడేమో!"

"వాడంత సులభంగా చావడులే! మన చేతికి చిక్కి ఉరికంబానికి ఎక్కద్దూ?" అంటూ సారథి లిఫ్ట్‌లో ఎక్కి మేడలో నాలుగో అంతస్థులోకి వెళ్ళాడు.

గుమాస్తాలూ, టైపిస్టులూ, అకౌంటెంట్లతో క్రిక్కిరిసి ఉన్న మూడు గదుల్ని దాటుకుని వెళ్ళాక మేనేజింగ్ డైరక్టర్ అని ఎయిర్ కండిషన్డ్ గది మీద బోర్డు కనుపించింది. ఆ గది వాకిలికి ప్రక్కగా పర్సనల్ సెక్రటరీ కూర్చుని ఉంది. గాడ్రెజ్ టేబులు, మూడు టెలిఫోన్లూ, ఇంటర్‌కమ్ ఉన్నయ్ ఆమె ముందు.

"చూడు మిస్! నేను రాజారావుగారిని అర్జెంటుగా చూడాలి!"

"మీకు ఇంటర్వ్యూ అనుమతి ఉందా?" సెక్రటరీ కర్కశంగా అడిగింది.

"లేదు! అయినా నేను వచ్చినపని చాలా అర్జెంట్!"

"అదేం లాభం లేదండీ? ముందే అనుమతి పొంది ఉండకపోతే, మీకు ఇంటర్వ్యూ దొరకదు!" నిష్కర్షగా చెప్పేసింది సెక్రటరీ.

బల్లమీది టెలిఫోను మ్రోగడంతో "యస్ ప్లీజ్! రాజారావ్ అండ్ కో!" అంది సెక్రటరీ.

అసలీమెను తను పర్మిషన్ కోసం ఎందుకడిగానా అనుకున్నాడు సారథి. ఆమె ఫోన్‌లో మాట్లాడుతూ తన పట్లశ్రద్ధ చూపడం లేదని గ్రహించాడు అతడు. అతి నిర్లక్ష్యంగా, పెద్ద పెద్ద అంగలతో ఎయిర్ కండిషన్డ్ గది సమీపించి, కన్ను మూసి తెరిచేంతలోగా గది తలుపు నెట్టుకొని, లోపలకు జొరబడ్డాడు సారథి.

"ఏయ్ ఆగు! ఏమిటీ దౌర్జన్యం!" అంటూ వెనుక సెక్రటరీ అరుపులు తలుపు మూయటంతో వినబడకుండా పోయినయ్.

నేలమీద ఎర్రని తివాసీ, గదిలో చల్లదనం, ట్యూబ్

లైట్ల కాంతిలో నిండైన టేబుల్ ముందు రివాల్వింగ్ చైర్‌లో కూర్చుని ఏవో ఫైలు తిరగేస్తున్నాడు రాజారావు.

"ఏయ్! ఏమిటిది? నిన్ను లోపలకు ఎవరు రానిచ్చారు?" సారథిని చూస్తూనే అరిచాడు రాజారావు.

"ఒకళ్ళు రానిచ్చేదేమిటి? నేను రావాలనుకున్నాను! వచ్చాను. అంతే! అన్నట్టు నన్ను పరిచయం చేసుకోలేదు కదూ? నా పేరు సారథి. ప్రైవేట్ డిటెక్టివ్! మనం లోగడ ఒకసారి పార్టీలో కలుసుకున్నాం!"

"అబ్బో! పెద్ద గవర్నర్‌లా దర్పం ఒలకబోస్తున్నావే? ఇంతకీ నాతో ఏమిటి నీకు పని?" అతడి కళ్ళల్లో భయం కొట్టొచ్చినట్టుగా కనిపిస్తోంది.

"అన్నట్టు మీ పార్టనర్ అహమ్మద్ ఖాన్ జైలు నుంచి విడుదల అయ్యాడా? ఇంకా లేదా? మీ కంపెనీల్లో ఏవో అవకతవక లున్నట్టు మాకు అనుమానం తోస్తున్నది సుమా!"

"నోరు మూసుకు బయటకు పోతావా? లేక..."

"నీ కంత శ్రమ అక్కర్లేదు మిస్టర్ రాజారావ్! రెండు నిముషాలు మాట్లాడి వెళ్ళిపోతాను అంతే!"

"అసలు నీవీ పాటికి జైల్లో ఉండాల్సిందే! ఇంకా బయట ఉన్నావెందుకు?" రాజారావు ఆశ్చర్యంగా చూశాడు.

"ఎందుకు? నేనేం నేరం చేశానని?" సారథి అమాయకంగా అడిగాడు.

"ఎందుకా? రామారావు అనే వ్యక్తిని హత్యచేసి నందుకు?" సంతోషంగా అన్నాడు రాజారావు.

దొంగ దొరికాడురా అనుకున్నాడు సారథి!

"అవునూ! రామారావు హత్య గురించి ఇంకా పేపర్లో పడనే లేదు! నీదాకా ఎట్లా వచ్చింది అప్పుడే! అంటే నేను నిన్ను అనుమానించినట్లే జరిగింది. రామారావుని హత్య చేసింది నీవే ముమ్మాటికీ?"

"నీకేమన్నా మతి పోయిందా? లేక తాగొచ్చావా? నేనేమిటి? హత్య చేయడం ఏమిటి? అసలు నీతో నాకేంపని!" అంటూ టేబుల్ మీద కాలింగ్ బెల్ ని రెండుసార్లు నొక్కాడు రాజారావు.

తలుపు తెరుచుకుని ఆజానుబాహువొకడు లోపలకు వచ్చాడు. "రాంసింగ్! ఈ వెధవని ఎత్తి, నాలుగో అంతస్తులోంచి క్రిందికి విసిరెయ్!" అని అరిచాడు రాజారావు.

ఆ వ్యక్తి వంక భయంగా చూశాడు సారధి. అతను తనను సమీపించంగానే, కరాటీ ఉపయోగించి అలవోకగా అతడ్ని చేతుల మీద పైకెత్తి వాకిలి వేపు విసిరేశాడు.

తలుపు తోసుకుని వెళ్ళి ఆ వ్యక్తి అవతలి గదిలో పడ్డాడు.

"మిస్టర్ రాజారావ్! నువ్వొకడివే తెలివిగలవాడివని అనుకోకు! ఇంకా నీ బాడీ గార్డు లెవరన్నా ఉంటే రమ్మను! నా తడాఖా చూపిస్తాను!" అన్నాడు సారధి.

రాజారావు డ్రాయరు బయటకు లాగాడు. అందులోంచి రివాల్వర్ ని తీసి సారధికోసం చూశాడు. అప్పటికే సారధి ఎలివేటర్ లో క్రిందకు చేరుకున్నాడు.

తనకూ, రాజారావుకీ మధ్య జరిగిన సంభాషణ అంతా చెప్పాడు, రామ్మూర్తిని కలుసుకోగానే.

"ఇదివరకు మనం కేవలం ఊహించినది ఇప్పుడు నిజమని తేలిపోయింది. పేపర్లో పడకుండానే, రామారావు హత్య గురించి అతగాడికెలా తెలిసింది? కనుక అతడే హంతకుడు!"

"కానీ నీవంత బాహాటంగా యితడి ఎదుట పడటం అంత మంచిది కాదేమో! ఈ రాజారావు చాలా ప్రమాదకరమయిన వ్యక్తిలా ఉన్నాడు." రామ్మూర్తి విచారంగా అన్నాడు.

"నిజంగానే అతడు చాలా ప్రమాదకరమైన వాడు. కాకపోతే నన్ను ఈ హత్య కేసులో ఇరికించటానికి చూస్తాడా? ఇప్పుడతడు త్వరపడి, ఇంకా కొన్ని పొరబాట్లు చేస్తాడు! అవే మనకు ఆయువుపట్టు!"

"అతడేమన్నా చెయ్యనీ? మనం మాత్రం ఈ క్షణం నుంచీ చాలా జాగ్రత్తగా ఉండకపోతే లాభం లేదు!"

"రాజారావుని ఒక కంట కనిపెట్టి ఉండు! అతడి నీడలా అతడ్ని వెన్నాడు! బహుశా నా ఊహ, రేపో మాపో కాటన్ మిల్ దగ్గరకు వెళ్ళొచ్చు!"

"అంటే నన్నిక్కడే ఉండి, రాజారావుని వాచ్ చెయ్యమంటావా?"

"అదేగదా దానర్థం! ఎందుకంటే, రాజారావు నన్నయితే చూశాడుగానీ, నిన్నెప్పుడూ చూడలేదు. కనుక నీవెవరో అతడికి తెలీదు. కనుక నీవే ఈ పనికి పూనుకోవాలి!"

రామ్మూర్తి అక్కడే మిగిలి పోయాడు.

## 5

మర్నాడుదయానికి రాజారావు కాటన్ మిల్ కి ప్రయాణమైనట్టు వర్తమానం అందించాడు రామ్మూర్తి.

మరో కారు వేసుకుని, సారథీ, రామ్మూర్తి అతడ్ని అనుసరించారు.

మద్రాసు నగరం దాటాక, పదిమైళ్ళ అవతల, ట్రంక్ రోడ్డుమీదే ఉంది రాజా కాటన్ మిల్. దానికి కొద్ది దూరంలో రాజారావు విశ్రాంతి భవనం ఉన్నది.

రాజారావు కారు నేరుగా కాటన్ మిల్ లోకి వెళ్ళింది. అరగంట గడిచాక మళ్ళీ కారు బయలుదేరి, గెస్ట్ హౌస్ చేరుకుంది.

గెస్ట్ హౌస్ చుట్టూ నాలుగయిదు ఎకరాల విస్తీర్ణం ఉంది. చెట్లూ చేమలూ పిచ్చిగా మొలిచినయ్. ఆవరణ చుట్టూ కంచెవేసి ఉంది.

రాజారావుని గెస్ట్ హౌస్ లో దిగ విడిచి, కారు తిరిగి టౌన్ వేపుగా వెళ్ళిపోయింది.

తమకారుని దూరంగా ఆపుచేశాడు సారథి. రామ్మూర్తిని అక్కడే ఉండమని చెప్పి తనొక్కడే కాలినడకన బయలుదేరాడు చుట్టూ తిరిగి వచ్చి బంగళా వెనుక నుంచి ఆవరణలోకి ప్రవేశించాడు. గెస్ట్ హౌస్ దగ్గరకు చేరుకున్నాడు సారథి.

పిల్లిలాగ, కిటికీల క్రిందుగ నడుచుకుంటూ, ఒక్కొక్క కిటికీ కర్టెన్ తొలగించి లోపలకు చూస్తున్నాడు. అలా ఒకప్రక్క ముగించుకుని మరో వైపుకు వచ్చే సరికి, ఆవైపున ఎవరివో మాటలు వినపడుతున్నయ్.

కిటికీ దగ్గరకు చేరి, కర్టెన్ని వ్రేలితో తొలగించి లోపలకు తొంగి చూశాడు సారథి.

లోపల రాజారావు సోఫాలో కూర్చుని ఉన్నాడు. అతడి కెదురుగా గుండ్రని టేబుల్ మీద టెలివిజన్

సెట్టు ఉంది. దానికి ప్రక్కగా కుర్చీలో మరో వ్యక్తి కూర్చుని టెలివిజన్ గురించి వివరిస్తున్నాడు.

"దీన్ని అంతర్జాతీయ ఉత్పత్తులస్థాయిలో తయారు చేశాను. ప్రస్తుతం మన దేశంలో టెలివిజన్‌లు కొత్తగా తయారుచేయబడుతున్నయ్. కొన్నాళ్ళలో రేడియోలకు బదులు అన్ని ఇళ్ళల్లోనూ టెలివిజన్‌లు వస్తాయనేది మీకు తెలుసనుకుంటాను!" ఆ వ్యక్తి ఆగాడు.

"అవునవును! అందుకు సందేహం లేదు! టెలివిజన్ ప్రసారాల్ని నెలకొల్పక ముందే, దేశంలో టెలివిజన్ల ఉత్పత్తికి పోటీ పడుతున్నారు ఉత్పత్తిదారులు!" రాజారావు తలూపాడు.

"అంతేకదా మరి! మార్కెట్‌లో ముందు ఏ బ్రాండ్ పేరు పడితే, వారికే కదా అధిక లాభాలు! కానీ మన దేశంలో ప్రస్తుతం తయారయే టెలివిజన్లన్నీ నలుపూ, తెలుపువే! అందుకే నేను గత రెండు సంవత్సరాలుగా శ్రమించి కలర్ టెలివిజన్ని కనిపెట్టాను. దీని తయారీకి అదనంగా ఖర్చేమీ లేదు!"

"మీ కృషి మెచ్చుకో దగిందే ఛటర్జీగారూ! ఏదీ ఒకసారి టెలివిజన్‌ని ప్రదర్శించి చూపుతారా?"

ఛటర్జీ టెలివిజన్‌ని ఆన్ చేశాడు. ఒక యువతి బొమ్మ, కనబడుతోంది అందులో. ఆమె దుస్తుల వివిధ రంగులూ శరీరచ్ఛాయ వాస్తవంకన్న రమణీయంగా కనబడుతోంది.

"భేష్! భేష్! మీ అఖండ ప్రజ్ఞను నా జోహార్లు మిస్టర్ ఛటర్జీ! గత రెండేళ్ళుగా దీన్ని కనిపెట్టేందుకే మీకు బోలెడంత డబ్బు పెట్టుబడి పెట్టాను. మన కృషి వృథా గాలేదు! అన్నట్టు దీని ఫార్ములా గానీ, లేదా

దీన్ని తయారు చేస్తున్న విషయంగానీ వేరెవరికీ తెలియదు
గదూ?" రాజారావు అనుమానంగా చూశాడు.

"నాకూ మీకూ తప్ప మూడో కంటి వాడికెవరికీ
తెలియదు! ఆఖరుకు నా కుమార్తెకు గూడా తెలీదు!"

"నీవా సైంటిస్టువి! నేనా వ్యాపారస్థుడ్ని. మన మిద్దరం
కలిసి ఈ సరికొత్త వ్యాపారాన్ని మొదలెట్టబోతున్నాం.
ఇరాన్, ఇరాక్, ఆఫ్రికా దేశాలకు గూడ ఈ కొత్త
సెట్స్‌ని ఎగుమతి చేయొచ్చు. కొద్దిలోనే మనం కోటీశ్వ
రులం అయిపోతాం!"

సారథి తను చూడదల్చుకున్నది చూశాడనీ, ఇక
ఆట్టే సేపు అక్కడ మసలటం మంచిది కాదనుకున్నాడు.
టెలివిజన్ రహస్యాన్ని పూర్తిగా తెలుసుకుందామని
కుతూహలం ఉన్నా ఆ కోరిక చంపుకుని అక్కడ్నుంచి
బయటపడ్డాడు.

ఆ టెలివిజన్‌ని తయారు చేసిన సైంటిస్టు యూనివర్సి
టీలో ఫిజిక్స్ ప్రొఫెసర్. అతడ్ని లోగడ ఒకటి రెండు
సార్లు తాము చూడటం తటస్థించింది. అతడి నివాసం
గూడా రామ్మూర్తి చూశాడు.

"పాపం! ఆ సైంటిస్టు ఒట్టి వెర్రిబాగుల వాడిలా
ఉన్నాడు. కాకపోతే, గడ్డిగా రాజారావుని, ఈ మేక
వన్నె పులిని, నమ్మి అతడి చేతిలో పెడతాడా తన కృషి
ఫలితాన్ని? ముందా టెలివిజన్ ఫార్ములాని రిజిస్టర్ చేయిం
చాక, రాజారావుకి తెలియజేయాల్సింది. అతడ్ని ఉపయో
గించుకుని రాజారావు కోట్లకు పడగెత్తుతాడు" అన్నాడు
సారథి.

"ఎందుకయినా మంచిది! రేపుదయం ఛటర్జీ ఇంటికి
వెళ్ళి, రాజారావు నిజ స్వరూపాన్ని తెలుపుదాం! తగు

జాగర్తలో ఉండకపోతే, రాజారావు ఎంతటి దారుణాని కైనా వెనుదీయడని హెచ్చరిద్దాం!" రామ్మూర్తి సూచన చేశాడు.

"కానీ ఛటర్జీ మన మాటల్ని లక్ష్యపెట్టక పోవచ్చు. పైగా తనేమీ టెలివిజన్నే తయారు చేయలేదని మన దగ్గర బుకాయించవచ్చు!"

"అలా అయితే వాడి ఖర్మను వాడే అనుభవించి తీర తాడు!"

## 6

స్నాన పానాదులు ముగించుకుని సారధి, రామ్మూర్తి ఇద్దరూ ఛటర్జీ ఇంటికి బయలుదేరారు.

పెద్ద ఆవరణలో ఒకదాని కొకటి పొంతన లేకుండా, మూడు వాటాలున్నయ్. ఒక వాటా తలుపు మీద యస్. ఛటర్జీ, ఎం. ఎస్ సి. పి. ఎచ్. డి. అని బోర్డు కనబడుతోంది.

రామ్మూర్తి కాలింగ్ బెల్ నొక్కాడు.

ధడాల్ని తలుపు తెరుచుకుంది. ఎర్రగా, ఉబ్బిన కళ్ళతో అందమైన ఇరవయ్ సంవత్సరాల యువతి తలుపు తెరిచింది.

ఆగంతకు లిద్దరివంక భయంగానూ, ఆత్రంగానూ చూసింది. "మీరు ...మీరు మానాన్నగారి గురించేనా వస్తుంట?"

"చూడమ్మాయ్! నీవు ఎందుకంగారు పడుతున్నావో నాకర్థం కావటం లేదు! బహుశా ఛటర్జీగారి కుమార్తె మీరేనా?"

"అవునండీ! నా పేరు సబిత!"

"అన్నట్టు నాన్నగారు ఇంట్లో లేరా?"

"లేరండీ! ఆయన గురించే నేను ఆందోళన పడుతుంట! నిన్న ఉదయం అనంగా ఆయన ఇల్లు వదిలి వెళ్ళారు. రాత్రికి కూడ తిరిగి రాలేదు! వారి గురించిన సమాచారం చెప్పటానికి వచ్చారేమో మీరు అని ఆశపడ్డాను!"

సారథీ, రామ్మూర్తి ఒకళ్ళ ముఖం మరొకరు చూసు కున్నారు.

"సారీ! మిమ్మల్ని వాకిట్లోనే నిలబెట్టి మాట్లాడు తున్నాను. లోపలకు వచ్చి కూర్చోండి!" అంటూ సబిత అడ్డం తొలగింది.

కుర్చీలో కూర్చుంటూ సారథి అడిగాడు, "ఇప్పుడు చెప్పమ్మా మీ నాన్నగారి గురించి?"

రామ్మూర్తి సబిత వంకే గుడ్లప్పగించి చూస్తున్నాడు ఆమెను తినేసేలా!

"మా నాన్నగారు పగలల్లా ఎక్కడ సంచరించినా రాత్రికి తప్పకుండా ఇల్లు చేరుకుంటారు! అటువంటిది రాత్రి ఆయన ఇంటికి రాలేదు. ఆయన ఏమయ్యారో అని భయపడి ఛస్తున్నాను.

"వారు బయటకు వెళ్ళేటప్పుడు ఎక్కడకు వెళ్ళేదీ చెప్పే అలవాటు లేదు. మా ఇంటి వెనుక రూమ్‌లో ఆయన చాలారోజుల్నుంచి దేన్ని గురించో ప్రయోగాలు చేస్తున్నారు. నన్ను ఏనాడూ ఆ రూమ్‌లోకి తొంగి కూడ చూడనిచ్చేవారు కాదు. నిన్న ఆయన ఎవరో ప్రముఖ వ్యక్తిని, అంటే మా నాన్న చేసే ప్రయోగాలకు ధన సహాయం చేస్తూన్న వ్యక్తిని, కలుసుకోవటానికి వెళ్ళి ఉంటారని ఊహించాను. రాత్రి వారు ఇంటికి రాకపోవ

టంతో, వారు దోవలో ఏదైనా ప్రమాదానికి గురైయ్యా రేమో అని భయంగా ఉంది!''

''మీ నాన్నగారి ప్రయోగాల గురించి మీకేం తెలీదంటారు?''

''రూఢిగా తెలీదు. కానీ ఇదివరలో రేడియోలగురించి అనేక ప్రయోగాలు చేశారని మాత్రం తెలుసు! ఈ మధ్యనే ఆయన నాతో సంతోషంగా చెప్పసాగారు 'బేబీ! మనం త్వరలో లక్షాధికారులం అయిపోతాం' అని, అన్నట్టు మా నాన్నగారితో మీకేం పని!''

''మేం ప్రైవేట్ డిటెక్టివ్ లం! నా పేరు సారధి. ఇతగాడి పేరు రామ్మూర్తి. టెలివిజన్ తయారీ గురించే! వారితో మాట్లాడదామని వచ్చాం!

''మీ నాన్నగార్ని కలుసుకునేందుకు మేం మళ్ళీ వస్తాం! ఈలోపల వారిగురించి ఏదైనా సమాచారం తెలిస్తే మాకు తెలియజేయటం మరవ్వద్దు!'' అంటూ తమ అడ్రసు వున్న విజిటింగ్ కార్డుని ఆమె చేతికిచ్చాడు సారధి.

## 7

ఆఫీసులో కూర్చుని కేసు వివరాల్ని సార్ట్ చేసుకుంటూండంగా, సబిత రానే వచ్చింది.

''ఓ! మీరా? రండి! రండి! మీనాన్నగారి ఆచూకీ ఏమైనా తెలిసిందాండీ?'' రామ్మూర్తి ఆమెను ఆహ్వానించాడు.

''వారి జాడ తెలియదండి! కాని వారి కారు సిటీలో ఒక సినిమాహాలు దగ్గర దొరికిందని పోలీసులు ఫోను చేశారు. మనం తక్షణం అక్కడికోసారి వెళ్ళటం మంచిదని నా ఉద్దేశ్యం! అందుకు మీసాయం కోరటానికి వచ్చాను!'' అన్నది సబిత వగరుస్తూ.

"మాడమ్మాయ్! కారుని వదిలేసిన వ్యక్తులెవరో, నిన్నూ మమ్మల్ని తప్పుదారి పట్టించేందుకు వేసిన పన్నాగం ఇది! మీ నాన్న సిటీలో మాత్రం లేరని ఖండితంగా చెప్ప గలను!" సారధి ఆమె వంక నిస్సహాయంగా చూస్తూ అన్నాడు.

"మీ మాటలు నాకు భయాన్ని కల్గిస్తున్నయ్!" సబిత బెరుకుగా అంది.

"మేం సేకరించిన సమాచారం మీకు విచారం కల్గించక తప్పదు. మీ నాన్న ఈ మధ్యనే కలర్ టెలివిజన్‌ని తయారుచేసే ఫార్ములాని కనిపెట్టాడు. ఆయన ప్రయోగాలకు ధనసహాయం చేస్తున్న వ్యక్తి రాజారావు. అతడిని కలుసుకోవటానికి వెళ్ళాడు మీ నాన్న. అతడితో వ్యాపార సరళిలో మాట్లాడుతూ బిజీగా ఉండవచ్చు. లేదా అతడి చేతిలో మీ నాన్న బందీ అయి ఉండాలి" సారధి నిదానంగా చెప్పాడు.

సబిత ఆశ్చర్యంతో, భయంతో నోరు తెరుచుకుని వింటూ ఉండిపోయింది.

"ఇదేదో రేడియోలో సీరియల్ నాటికలా ఉంది! మీరు నాతో పరాచికాలాడటం లేదుకదా?" అంది చివరకు.

"కాకపోతే మరేమిటి? కారు చెక్కు చెదరకుండా, రోడ్డు మీద దొరకటం చూస్తే మీ మటుకు మీకేమని పిస్తున్నది? కారుని రోడ్డుమీద వదిలేసే అవకాశమే గనుక ఉంటే, నీకు ఫోన్ చెయ్యటమో, టెలిగ్రామ్ ఇవ్వటమో చేసి ఉండే వారే గదా?"

"అవునవును! అదీ నిజమే సారధిగారూ! మీరెలాగైనా నాన్నగార్ని విడిపించి, రక్షించాలి! ఇదంతా

చూస్తుంటే, ఆ రాజారావు నాన్నని హత్య చేయటానికైనా వెనకాడడల్లే కనిపిస్తున్నది.''

''నీవు అంతగా అధైర్య పడనవసరంలేదు బేబీ! బంగారు గుడ్లుపెట్టే బాతుని ఎవరూ చూస్తూ చూస్తూ చంపరు!''

''పోనీ ఈ విషయాన్ని పోలీసులకు తెలియజేస్తేనో?''

''లాభం లేదు! తగిన సాక్ష్యాలు లేందే పోలీసులు మన మాటలు విశ్వసించరు. పైగా రాజారావు పోలీసులకు ఆచూకి చిక్కకుండా మీ నాన్నను మాయం చేయగలడు! కనుక వాడ్ని నేనే దొరకబుచ్చుకుంటాను! ఈ లోపల మీ ఇంటిని ఒకసారి సోదా చేయాలి!''

''ఎందుకు? మా ఇంట్లో ఏముంది?''

''మీ నాన్న ప్రయోగం గురించిన ఫార్ములా, లేబరట రీలో తప్పకుండా దొరుకుతయ్యని నా నమ్మకం! అందులో మీ ఇల్లు అడవిలో ఉన్నట్లుగా ఉంది. మిగత వాటాల్లో ఉండే భార్య భర్తలు అందరూ పగటి పూట ఉద్యోగాలకు వెడతారు. కనుక మీరు లేనప్పుడు ఎవరైనా రాజారావు మనుష్యులు ఇంటి వెనుకనుంచి కిటికీ పగుల గొట్టి లోపలకు జొరబడే అవకాశం ఉంది. ఒకసారి మీ నాన్నగారి లేబరటరీని చూసి వద్దామా?''

సబిత వెంటే, ఆమె ఇంటికి వెళ్ళారు సారధి, రామ్మూర్తి. ఆ ఇల్లు చాలా పాతబడింది. ఛటర్జీ లేబరటరీ మూలల్ని సాలెగూళ్ళు అల్లుకుని ఉన్నాయ్.

ఒక మూలగా టేబుల్ మీద కాగితాలకట్ట ఉంది. పెన్సిల్తో, కలంతో, ఆ కాగితాలనిండా ఏవో లెక్కలూ, ఈక్వేషన్లూ ఉన్నాయ్. టెలివిజన్ తయారీకి పనికి వచ్చే పరికరాలు మరికొన్ని ఉన్నాయ్.

డ్రాయరూ, అలమారూ అన్నీ వెదికినా ఫార్ములా లాంటి వేవీ కనుపించలేదు.

"అన్నట్టు నీవు ఏదో ఆఫీసులో టైపిస్ట్ గా పని చేస్తున్నా వనుకుంటాను! మీరు ఆఫీసుకు పోలేదా?"

"లేదండీ! రెండు రోజులు సెలవు పెట్టాను. నా మన సెందుకో, ఏ క్షణాన అయినా డాడీ తిరిగి రావచ్చని చెబుతున్నది. ఆయన సంగతి తెలిసేదాకా, నేను ఆఫీసుకు వెళ్ళను!"

"పగటి పూట ఈ ప్రదేశం అంతా నిర్మానుష్యంగా ఉంటుంది గదా? నీకు ఒంటరిగా ఉండటానికి భయం వేయదూ? అటు ఆఫీసుకన్నా వెళ్ళు, లేదూ తోడుగా ఎవరినన్నా తెచ్చుకో! నీవు ఒంటరిగా ఉండటం మంచిది కాదనుకుంటాను!" అన్నాడు రామ్మూర్తి, ఆ ఇంటి పరిసరాలు చూస్తూ.

అసలు కేసు వదిలేసి, కేవలం సబిత క్షేమాన్ని గురించే రామ్మూర్తి ఆదుర్దా పడటం చూసి సారథి నవ్వుకున్నాడు లోలోపలే.

"లేను! ఈ ఇల్లు వదలి నేనెక్కడికీ రాను! నేనే మంత పిరికిదాన్ని కాదు! ఒకర్తె నే ఉండగలను! ఏక్షణాన అయినా మా నాన్న కానీ, ఆయన గురించి సమాచారంగానీ రావచ్చని నా మనసు చెబుతోంది!"

"సరే నీ ఇష్టం; ఏదన్నా విషమపరిస్థితులు వస్తే, మాకు ఫోన్ చేయటం మరచిపోకు సబితా!" అక్కడ్నుంచి వెళ్ళిపోతూ సారథి హెచ్చరించాడు.

## 8

సబిత ఆలోచిస్తూ కూర్చుంది. రామూర్తి హెచ్చరించి నట్టుగా తనను ఏదైనా ప్రమాదం వెన్నంటుతుందని ఉందా అని తీవ్రంగా ఆలోచించింది.

ఆమె ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ, టెలిగ్రామ్ మెస్సెంజర్ వచ్చాడు.

"సబిత గారంటే మీరేనా? మీకు టెలిగ్రామ్ ఉన్నదండి!" అంటూ టెలిగ్రామ్ అందించి, సంతకం పెట్టించుకుని వెళ్ళిపోయాడు.

"అర్జెంటు వ్యవహారం మీద ఉండిపోయాను. మూడున్నర గంటలకు గిండీ స్టేషన్లో నీకోసం ఎదురు చూస్తుంటాను. వెంటనే రా!"

టెలిగ్రామ్ సారాంశం అది.

టైమ్ చూసుకుంది సబిత. రెండున్నర గంటలయింది.

పిచ్చిదానిలా నవ్వింది ఆమె! తండ్రి జాడ తెలిసింది! అతడు క్షేమంగా ఉన్నాడన్నమాట! ఈ డిటెక్టివ్‌లు చిన్నవిషయానికి గూడ రాద్ధాంతం చేస్తారు! అని మరో సారి నవ్వుకుంది.

తనకిలా టెలిగ్రామ్ వచ్చిందని సారధి ఆఫీసుకు ఫోన్ చేసేనో? ఎందు కనవసరం శ్రమ! తండ్రి తనను రమ్మని టెలిగ్రామ్ ఇచ్చాడు. కనుక తను నిర్భయంగా పోగలదు. అనుకుని మళ్ళీ ఆ పని విరమించుకుంది.

టాయిలెట్ అయి, ఇల్లు తాళం పెట్టి, ఎలక్ట్రిక్ ట్రైన్ ఎక్కేందుకు స్టేషను చేరుకుంది. బుకింగ్‌లో టికెట్ కొనుక్కొని ప్లాట్‌ఫారం మీదకు వెళ్ళంగానే ట్రైన్ వచ్చింది.

గిండీ స్టేషన్‌లో సబిత రైలు దిగింది. ప్లాట్‌ఫారమ్ మీద తండ్రి కనుపిస్తాడేమో అని ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూసింది. కాని ఎక్కడా ఆమె తండ్రి జాడలేదు.

బహుశా స్టేషన్ బయట వేచి ఉన్నాడేమో అనుకుని బయటకు నడిచింది.

రోడ్డు మీదుగా జాక్సన్ నల్లని కారుకు ఆనుకుని నిలబడ్డాడు. అతని అరచేతిలో చిన్న ఫోటో ఉంది. మాటి మాటికీ ఫోటోలోకి చూస్తూ, ట్రెయిన్ దిగి వస్తున్న యువతుల వంక పరీక్షగా చూస్తున్నాడు.

సవిత స్టేషను బయటకు వచ్చింది. ఆమెను చూడం గానే జాక్సన్ ముఖం వికసించింది.

ఆమె చేరువ కాంగానే, "మాడమ్! మీ పేరే సవిత అనుకుంటాను! నన్ను మీ నాన్నగారు పంపారు. ఈ కారులో ఎక్కండి!" అన్నాడు.

సవిత అతడ్ని తేరిపార చూచింది అనుమానంగా.

"కావాలంటే మీ ఫోటో గూడ నాచేతి కిచ్చారు మీ నాన్నగారు! మిమ్మల్ని ఆనవాలు పోల్చుకు నేందు కని!" అంటూ తన చేతిలోని ఫోటో చూపించాడు ఆమెకు జాక్సన్ ఆమె అనుమానాన్ని గ్రహించి.

సవిత ఫోటోవంక పరీక్షగా చూసింది. అది తనదే! తన తండ్రి పర్సులో ఆఫోటో ఎల్లప్పుడూ ఉంటుంది. దాన్నే ఇచ్చి పంపినట్టున్నాడు అనుకుంది.

డోర్ తెరిచి వెనుక సీట్లో కూర్చుంది సవిత.

సిటిలిమిట్స్ దాటే దాకా కారు మామూలు వేగంతో ప్రయాణించింది. ఆ తర్వాత స్పీడందుకుంది.

తనను గిండీ స్టేషన్‌లో కలుసుకుంటానని టెలిగ్రామ్ ఇచ్చిన తండ్రి, ఎందుకు రాలేదు తనను రిసీవ్ చేసుకోను? పైగా కారు అతివేగంగా సిటీ లిమిట్స్ దాటిపోతోంది, ఇందులో ఏదైనా మోసం ఉందా?

మొట్ట మొదటిసారిగా, ఆమెకు రామ్మూర్తి హెచ్చరిక గుర్తుకు వచ్చింది. తను పొరబాటు చేయడం లేదుగదా అని బాధపడింది మనసులో.

కారు హైరోడ్డు మీద నుంచి మళ్ళింది. కొద్ది దూరం వెళ్ళి ఆగింది. సబిత అనుమానంగా అటూ ఇటూ చూసింది. చుట్టూ మైదానం తప్ప, కనుచూపు మేరలో ఇల్లనేది లేదు. కారాగిన చోట మాత్రం పాడుబడ్డ భవనం ఉంది. ఆవరణలో చెట్లూ చేమలూ చిందర వందరగా, ఇష్టం వచ్చినట్లు పెరిగి ఉన్నయ్.

"డ్రైవర్! ఇదేమిటి? ఈ నిర్మానుష్య ప్రదేశంలోకి తెచ్చావ్ నన్ను?" సబిత అడిగింది.

"నాన్నగారు ఇక్కడకే వస్తారమ్మా! మీకొచ్చిన భయం ఏమీ లేదు. రెండు నిముషాలు కూర్చోండి!" అన్నాడు, తెల్లని యూనిఫారంలో ఉన్న డ్రైవరు.

"రాజారావుగారి భవంతా ఇది?" సబిత చుట్టూ చూస్తూ అంది.

డ్రైవరు ఆశ్చర్యపోయాడు. సబితకు తన గురించి ఏమీ తెలియదని రాజారావు చెప్పాడు. ఆ యువతి తెలుసుకో వలసిన దానికన్న ఎక్కువే నేర్చుకున్నట్టుంది. అటు వంటప్పుడు, తమ మోసాన్ని గ్రహించి ఆమె అల్లరి పెడుతుందనుకున్నాడు.

"ఇక్కడెందుకు ఆపావో చెప్పక పోతే, కారుదిగి వెళ్ళిపోతాను నేను!"

"మీరలా రచ్చ చేసుకుంటే నష్టపోయేది మీరే! కొద్ది క్షణాల్లోనే మీ నాన్నగారెదుట ఉంటారు మీరు!" ఆమెకు నచ్చ చెబుతున్నట్టుగా చెప్పాడు డ్రైవర్.

"అదేం కుదరదు! తక్షణం మా నాన్నను చూపిస్తావా లేక నన్ను వెళ్ళి పొమ్మంటావా?" అంది కారుడోర్ తెరుస్తూ.

"చూడండి మిస్! మీరలా మొండికేస్తే నేను బల ప్రయోగం చేయాల్సి వస్తుంది! ఆ తర్వాత నన్నని ప్రయోజనం లేదు."

సబిత కారు దిగి వెళ్ళిపోవటానికి ప్రయత్నించింది.

కానీ ఆమెకన్న వేగంగా డ్రైవర్ కదిలాడు. పెద్ద దుప్పటి తీసుకుని సబిత మీద కప్పేశాడు.

గిజగిజలాడుతున్న సబితను దుప్పటిలో చుట్టేసి, తాడుతో కట్టేశాడు. అతడి రాక్షస హస్తాల్లో కోమల మైన సబిత ఎంత తంటాలు పడ్డా, విడిపించుకోలేక పోయింది.

మూటనెత్తి కారులో వెనుక సీట్ మీద పడేశాడు డ్రైవర్. తన బాస్ కోసం ఆత్రంగా ఎదురు చూడ సాగాడు జాక్సన్.

# 9

"రామ్మూర్తీ! టెలిఫోన్ని కనిపెట్టుకుని ఉండు! నేనలా ఒక చిన్న కునుకు తీస్తాను!" అన్నాడు సారధి.

"అలాగే బాస్!" అన్నాడు రామ్మూర్తి, కాళ్ళు టేబుల్ మీదకు జాపుతూ.

సారధి ప్రక్కనే ఉన్న బెడ్ రూమ్లోకి వెళ్ళి తలుపు దగ్గరకు వేశాడు.

రామ్మూర్తి సిగరెట్ వెలిగించాడు. అతడి మనసులో సబిత మెదిలింది. పాపం! ఆ అమ్మాయిని ఆపదలు చుట్టు కుంటాయేమో అని బాధపడ్డాడు. సబిత తండ్రి తిరిగి

వచ్చేలోగా, ఆమెను కాపాడుకో గలిగితే ఎంత బాగుండును!

సారథి నిద్రలోకి జారుకున్నాడు. తనోసారి సబిత ఇంటికి వెళ్ళి ఆమెను చూసి వస్తేనో! సారథి లేచేలోపలే తను తిరిగి వచ్చేయచ్చు!

లేడికి లేచిందే పరుగన్నట్టు రామ్మూర్తి కుర్చీలోంచి లేచాడు. వాకిట్లో కునికి పాట్లు పడుతున్న బోయ్‌ని మొట్టికాయ వేసి లేపాడు. తను సబిత ఇంటికి వెళ్తున్నట్టుగా చెప్పాడు. తను తిరిగి వచ్చేలోపుగా సారథి లేచి అడిగితే చెప్పమన్నాడు.

ఆటోరిక్షాలో సబిత నివాసం చేరుకున్నాడు రామ్మూర్తి. ఆమె తనను లోపలకు ఆహ్వానిస్తుందనీ, తన చేతిమీదుగా టీ అందిస్తుందనీ ఊహించుకుంటూ కాలింగ్ బెల్ నొక్కాడు.

రెండుసార్లు నొక్కినా, లోపల గంట మ్రోగటం వినిపించిందే కానీ తలుపు తెరుచుకోలేదు.

అప్పుడు గానీ అతడు తన ఊహా ప్రపంచంలోంచి వాస్తవిక జగత్తుకి రాలేదు. వాకిలి తలుపుకి తాళం వేసి ఉంది.

అరె! సబిత బయటకు వెళ్ళిందన్నమాట? తమ ఆఫీసుకు రాలేదు! మరి ఎక్కడకు వెళ్ళినట్టు? ఒక వేళ పోలీస్‌కి రిపోర్టు ఇవ్వటానికేమైనా వెళ్ళిందా?

అతడికో ఆలోచన వచ్చింది. తన జేబులోంచి తాళం చెవుల గుత్తి తీసి, ఆ తాళం తీయడానికి ప్రయత్నించాడు. 'క్లిక్' 'క్లిక్' అని తాళంచెవి సగంలోనే తిరగటం మానేసింది. మరో జేబులోంచి వ్రేలెడు గుండ్రని ఆకు

రాతిని తీసి తాళం చెవిని కొద్దిగా అరగతీశాడు. తిరిగి తాళం తీయటానికి యత్నించాడు.

తాళం ఊడి వచ్చింది. తలుపు తీసుకుని లోపలకు జొరపడ్డాడు రామ్మూర్తి.

నేలమీద టెలిగ్రాం కనుపించింది అతడికి. దాన్ని చదువుతూనే, రామ్మూర్తి నీరయిపోయాడు.

నిజంగా ఆ టెలిగ్రామ్ సబిత తండ్రి ఇచ్చినదేనా? లేక ఛటర్జీని వంచటానికి రాజారావు సబితను అపహరించటానికి వేసిన ఎత్తా?

లోపల లేబరటరీ కిటికీలు తెరచి ఉండటాన్ని గమనించాడు రామ్మూర్తి. బహుశా ఛటర్జీయే ఇంటికి తిరిగి వచ్చి ఉండవచ్చు. ఆయన రాకతో తృప్తిపడి, సబిత తన ఆఫీసుకు వెళ్ళిందేమో!

"ఎవరు లోపల? ఛటర్జీగారా?" అని అరిచాడు రామ్మూర్తి.

అప్పటిదాకా లేబరటరీ లోంచి, ఎలుకలు కాగితాల్ని కొట్టివేస్తున్న చప్పుడు వస్తున్నది. అది కాస్తా, రామ్మూర్తి అరుపుతో ఆగిపోయింది.

ఆశ్చర్యంతో రామ్మూర్తి లేబరటరీలోకి వెళ్ళాడు. "ఛటర్జీ!" అని మరోసారి పిలిచాడు.

బదులు రాలేదు. గదిలో డ్రాయర్లూ, అలమారుల్లోని కాగితాలన్నీ చిందర వందరగా ఉన్నయ్. ఇంతక్రితమే ఎవరో వాటిని కలయబెట్టినట్టుగా తోచింది.

అయోమయంగా వాటివంకే చూస్తున్న రామ్మూర్తిని వెనుకనుంచి ఎవరో తలమీద గట్టిగా కొట్టారు.

ఆ దెబ్బకు రామ్మూర్తి పడిపోయాడు. అతడి మీద

దుప్పటి విసిరి వేయబడింది. అతడ్ని దుప్పటిలో చుట్టి, త్రాటితో బంధించాడు ఆగంతకుడు.

మరో పదినిముషాలు గదిలో కాగితాలన్నీ శోధించి ఆగంతకుడు వెళ్ళి పోయాడు.

గదిలోని వ్యక్తి అడుగుల చప్పుడు దూరమవటం గ్రహించంగానే, దుప్పటిలో రామ్మూర్తి 'ఊఁ!' అని మూలగటం ప్రారంభించాడు.

# 10

టేబుల్ మీది టెలిఫోన్ "రంయ్" "రంయ్" మని మ్రోగుతోంది. సారధికి నిద్రాభంగ మైంది.

చిరాకుగా "రామ్మూర్తి! ఆ ఫోన్ అలా మ్రోగు తుంటే, ఏం చేస్తున్నావ్! నీవూ నిద్రపోతున్నావా!" అని అరిచాడు.

ఆఫీసు రూమ్‌లోంచి బదులు రాలేదు. బెడ్ మీద నుంచి లేచి ఫోన్ కాల్ అందుకున్నాడు.

రసీవర్ని క్రేడిల్ మీద పెట్టేసూ, వరండాలోకి వెళ్ళాడు సారధి. ఆఫీసుబోయ్ చివర మెట్టు మీద కూర్చుని రోడ్డు మీద ఎవరితోనో మాట్లాడుతున్నాడు; సిగరెట్ త్రాగుతూ.

సారధిని చూస్తూనే వాడు సిగరెట్‌ని అవతలపారే శాడు. గబగబ మెట్లెక్కి పైకి వచ్చాడు.

"చిన్నసార్ సబిత ఇంటికి వెళ్తున్నానని చెప్పారు సార్!" అన్నాడు బోయ్.

"ఎంత సేపయిందేమిటి వెళ్ళి?"

"చాలా సేపయియింది సార్!"

రామ్మూర్తి సబితతో ప్రేమాయణం ముచ్చటిస్తూ టైమ్ గూడ మరిచాడేమో అనుకున్నాడు.

లోపలకు వెళ్ళి ముఖం కడుక్కుని, డ్రెస్ చేసుకున్నాడు సారధి. నేరుగా సబిత ఇంటికి కారులో బయలుదేరాడు.

సబిత ఇంటి తలుపు దగ్గరగా మూసి ఉంది. తలుపు నెట్టి, తను వచ్చిన అలికిడి విని ఎవరైనా బయటకు వస్తారేమో అని ఒక్క క్షణం ఎదురు చూశాడు.

చెట్లమీద పక్షుల అరుపులు మినహా, ఎటువంటి శబ్దమూ వినరాలేదు.

ఇంట్లోంచి లేబరటరీ రూమ్‌లో కెళ్ళాడు సారధి. లేబరటరీలో లైట్లు వెలుగుతున్నయ్. నేలమీదా, టేబుల్ మీదా, అంతటా కాగితాలు చిందరవందరగా పడి ఉన్నయ్.

అంతలో అతడికి ఎవరో మూలుగుతున్న చప్పుడు వినిపించింది.

"ఎవరది?" సారధి శబ్దం వస్తున్న వేపుగా చూస్తూ అరిచాడు.

దుప్పటిలో చుట్టబడి, ఒక వ్యక్తి మూలుగుతూ, గిజగిజలాడుతున్నాడు.

సారధి అతడ్ని బంధవిముక్తుడ్ని చేసాడు. ఆ దుప్పటిలో బంధింపబడింది రామ్మూర్తి అని గ్రహించి, విస్తుపోయాడు సారధి.

"దెబ్బలేం తగల్లేదు కదా? ఎవరీ పని చేసింది? సబిత ఎక్కడ?"

"తలమీద ఎవరో కొట్టారు నన్ను. నాకు మైకం వచ్చింది. నన్ను ఈ దుప్పటిలో చుట్టి పడేశాడనుకుంటాను ఆ ఆగంతకుడు! ఇక సబిత విషయమా? ఇదిగో! ఇది

చూస్తే మీకే తెలుస్తుంది!'' అంటూ రామ్మూర్తి తన జేబులోంచి టెలిగ్రామ్‌ని తీసి సారథి చేతిలో పెట్టాడు.

''నేను అనుకుంటూనే ఉన్నాను. మనం రాజారావుని అనుమానిస్తున్నామని పసిగట్టంగానే, రాజారావు ఛటర్జీతో వ్యవహారం కుదుర్చుకోవటానికి ఆత్రుత పడుతున్నాడు. సవితను గూడ వాడు చేజిక్కించుకున్నాడు, ఛటర్జీని లొంగ దీసుకోవడానికి.''

''ఆ కిరాతకుడు సవితను చిత్రహింస పెడతాడేమో గురూ?''

''ఎంత సేపటికీ సవిత గురించే నీ ఆలోచన. ఛటర్జీ గురించి పట్టించుకోవేం?'' మందలింపుగా అన్నాడు సారథి.

''సారీ గురూ?'' అంటూ నాలుక కొరుక్కున్నాడు రామ్మూర్తి. ''వాళ్ళిద్దర్నీ రక్షించేందుకు మనం ఏమైనా చేయాలి వెంటనే!''

''కానీ వాళ్ళు ఎక్కడున్నారని! బహుశా కాటన్ మిల్ దగ్గరున్న పాత మేడలో వాళ్ళిద్దర్నీ దాచి ఉండాలని నా అనుమానం! మనం తక్షణమే అక్కడకు వెళ్ళి వెదుకుదాం!'' అన్నాడు సారథి.

# 11

రాజారావు మేడదిగి వచ్చాడు. వెనుక భాగంలోకి నడిచాడు. చెట్లూ చేమల మధ్యగా మసక చీకటిలో గూడా ధైర్యంగా అడుగులు వేస్తూ కారుని సమీపించాడు.

కారు కానుకుని సిగరెట్ త్రాగుతున్న జాక్సన్, సిగరెట్ అవతల పారేసి, సెల్యూట్ చేశాడు.

''ఏదీ ఆ అమ్మాయి?'' కారులోకి చూస్తూ అడిగాడు రాజారావు.

"ఆమెకు అనుమానం వేసింది కాబోలు, ఎదురు తిరిగింది సార్! మూటకట్టి లోపల పడేశాను" జాక్సన్ బదులు చెప్పాడు.

"ఆమె ఒంటి మీద చెయ్యి వెయ్యొద్దని చెప్పానా లేదా నీకు! పంది వెధవా!"

"నేనేం చేయను సార్! కారు దిగి ఆమె పారిపోవటానికి యత్నించింది!"

"అఘోరించక పోయావూ?" అంటూ దుప్పటి మూటను రెండు చేతులతో మోస్తూ, రాజారావు మేడ వేపుగా వెళ్ళాడు.

మేడమీదకు వెళ్ళకుండా, మరో ద్వారం తెరుచుకుని నేలమాళిగలోకి వెళ్ళే మెట్లుదిగుతూ, భూగృహంలోకి వెళ్ళాడు.

మూటను మెట్లమీద ఉంచి తన వెనుకనే తలుపు మూసేశాడు. మళ్ళీ మూట నెత్తుకొని మరో తలుపు నెట్టాడు.

ఆ గది అధునాతనంగా అలంకరింపబడి ఉంది. నేల మీద ఎర్రని తివాచీ, సోఫాలూ, ట్యూబ్ లైట్స్‌తో ఎయిర్ కండిషన్ చేయబడి, మనసుకు ఆహ్లాదం కలిగించేలా ఉంది ఆ గది.

సవిత బంధనాలు ఊడదీశాడు రాజారావు. సవిత ముఖం జేవురించి ఉంది. కళ్ళు ఎర్రబడ్డయ్. జుట్టు రేగి పోయింది.

రాజారావు వంక చూస్తూ, "నువ్వు మనిషివా, రాక్షసుడివా?" అని పళ్ళు కొరికింది సవిత.

"కోపం తెచ్చుకోకు అమ్మాయ్! నా డ్రైవర్ చేసిన తప్పిదానికి నేను నిజంగా చింతిస్తున్నాను."

"ఈ నక్క వినయాలకేంలే! ఇంతకీ మా నాన్న ఎక్కడ రాజారావ్!" అంది సబిత.

రాజారావు ఉలిక్కిపడ్డాడు. తన పేరు ఈమెకెలా తెలిసిందబ్బా! ఛటర్జీ తన గురించి కుమార్తెకు గూడ తెలియదని చెప్పాడే! ఒకవేళ ఆ డ్రైవర్ వెధవ ఏమైనా చెప్పాడేమో!

"నా పేరు నీకెలా తెలుసు? డ్రైవర్ చెప్పాడా?" ఆశ్చర్యపోతూ అన్నాడు రాజారావు.

"డ్రైవర్ కాదు సారథి చెప్పాడు. నీ గురించి అంతా చెప్పాడు. ఇంతకీ మా నాన్న ఎక్కడ?"

సబితతో మాట్లాడడం తను అనుకున్నంత తేలిక కాదనుకున్నాడు రాజారావు. సారథి పేరు వింటూనే, అతడి వెన్నులో భయం జరజర ప్రాకింది.

"ఇలా జరగవచ్చని ఆయన ముందే హెచ్చరించాడు గూడా! కానీ నేనే అతి ఆతృతలో నీ దొంగ టెలిగ్రామ్‌ని చూసి మోసపోయాను. మా నాన్ననేం చేశావ్ చెప్పు ముందు?"

రాజారావు తన మనసులోని ఉద్వేగాన్ని కప్పిపుచ్చుకుంటూ నవ్వేశాడు.

"కాస్త నిమితపడు సబితాదేవీ! మీ నాన్నకొచ్చిన ప్రమాదమేం లేదు! ఆయన నిక్షేపంలా ఉన్నాడు. త్వరలోనే ఆయన్ని కలుసుకోవచ్చు నీవు! మీ నాన్న నేచెప్పినట్టుగా వింటే, మీరిద్దరూ క్షేమంగా తిరిగి వెళతారు సరేనా?"

"అంటే నీ ఉద్దేశ్యం?"

"అలమారులో రొట్టె, బిస్కట్లూ, డ్రింక్స్ ఉన్నాయ్. ఈ గదికి ప్రక్కనే లావెటరీ, బాత్‌రూమ్ ఉన్నాయ్. హాయిగా విశ్రమించు! నేను వెళ్ళాలి! ఇప్పటికే చాలా లేట్ అయింది!" అంటూ రాజారావు లేడిలా తలుపు తెరుచుకుని తను గది బయటకు వచ్చి, తలుపు మూసి తాళం పెట్టాడు.

లోపల్నుంచి సబిత అరచి కేకలు పెట్టినా బయటకు వినబడటంలేదు, ఆ గది ఎయిర్ కండిషన్డ్ చేయబడి ఉండటం మూలాన్ని.

రాజారావు మరో తలుపులో అదే తాళంచెవిని దూర్చి త్రిప్పాడు. క్లిక్‌మని తాళం విడిన చప్పుడు రాంగానే, తలుపు నెట్టుకుని లోపలకు వెళ్ళాడు. ఆ గది కూడా సబిత ఉన్న గదిలానే ఉంది అచ్చంగా. ఈ గదిలో సోఫాలో కూర్చుని తలకాయ అరచేతుల్లో పెట్టుకుని విచారంగా కూర్చుని ఉన్నాడు ఛటర్జీ.

రాజారావుని చూస్తూనే అతను లేచి నిలబడ్డాడు. రిమ్‌లేస్ కళ్ళజోడుని సవరించుకుని చూశాడు.

"మిస్టర్ ఛటర్జీ! నీ మనసేమైనా మార్చుకున్నావా? లేక ఇంకా మంకుపట్టుమీదే ఉన్నావా?" రాజారావు అడిగాడు.

"రాజారావ్! నీవు చేసిన పనికి నిన్ను జైలుకు పంపి తీరతాను" ఛటర్జీ అంత విచారంలోనూ కోపంగా అన్నాడు.

రాజారావు వికటంగా నవ్వాడు. "నీలాంటి తెలివి తక్కువ వాజమ్మలను ఎలా వంచాలో నాకూ తెలుసు! మీ అమ్మాయి సబిత నా చేతుల్లో ఉంది ఇప్పుడు!"

"ఏమిటీ! సబితను గూడ బంధించి తెచ్చావా? అయితే నీ రోజులు దగ్గర పడ్డాయన్న మాటే? నేను ఒక రోజు కనబడకపోయేసరికి, మా అమ్మాయి తప్పకుండా పోలీసు రిపోర్టు ఇచ్చే ఉంటుంది. ఏ క్షణాన అయినా నీ భవనం మీదకు దండెత్తి రావచ్చు పోలీసులు!"

"అదంతా నాకనవసరం! రాత్రి ప్రొద్దుపోయాక మళ్ళీ వస్తాను! మర్యాదగా ఒప్పుకుంటావా? లేక నీ కుమార్తె పతనాన్ని నీ కళ్ళారా చూసి ఒప్పుకుంటావో తేల్చుకో!" అంటూ రాజారావు వెళ్ళిపోయాడు విసురుగా.

## 12

రాజారావు మేడ దీపాలతో వెలిగిపోతున్నది. "ఏదో పార్టీ జరుగుతున్నట్టుందే! మన అనుమానం ఎంతవరకు నిజం కావచ్చు?" రామ్మూర్తి అనుమానంగా అడిగాడు.

"రాజారావుని నమ్మేందుకు వీల్లేదు. అందరి కళ్ళూ గప్పి, వాడు ఛటర్జీని, సబితనూ అపహరించుకు వచ్చి ఉంటాడు. అందుకు బలమైన ఎలిబీగా ఏదో పార్టీని ఏర్పాటుచేసి ఉంటాడు!" సారథి కారుని రోడ్డు ప్రక్కగా ఆపుతూ అన్నాడు.

"కారుని ఇక్కడాపి, మనం కాలినడకనే ఇంటి వెనుక భాగంలో జొరబడాలి!" సారథి కారు దిగాడు. అతడితో పాటు రామ్మూర్తి దిగాడు.

వారిద్దరి వెంట మరో వ్యక్తి వచ్చాడు. అతడి పేరు దాసు. దాసు ఆరడుగుల వ్యక్తి. కండలుదిరిగి, పుష్టిదేలి ఉంటాడు. తానొక్కడే నలుగురు మనుష్యుల్ని ఒకేసారి ఎదుర్కోగలడు. ఎప్పుడైనా అవసరం పడ్డప్పుడు సారథి అతడ్ని వెంట తీసుకురావడం పరిపాటే!

ముగ్గురూ మేడ వెనుకగా ఆవరణలోకి చేరుకున్నారు. మేడ దగ్గరకు చేరుకున్నారు.

దాసుని మాత్రం దూరంగా చెట్లచాటున ఉంచి, ఎవరైనా వస్తున్న అలికిడి అయితే సంకేతమివ్వమని కాపలాగా ఉంచారు.

సారధి తన జేబులోని తాళాల గుత్తి తీసి, గది తాళం తీయటానికి ప్రయత్నించాడు. కానీ అతడి ప్రయత్నం ఫలించలేదు.

"లాభంలేదు. ఈ తలుపు ఇనప్పెట్టె తలుపంత మందంగా ఉంది!" అంటూ పెదవి విరిచాడు సారథి.

వరండాకు దగ్గరగా చెట్లల్లో నక్కి ఉన్న దాసు సంకేతమిచ్చాడు.

"అలా ప్రక్కకు తప్పుకుని దాక్కో! ఎవరో వస్తున్నట్టుంది!" అంటూ తప్పుకున్నాడు సారధ.

రామ్మూర్తి మరో ప్రక్కకు తప్పుకున్నాడు.

ఎవరో వ్యక్తి అటుగా వచ్చాడు. చీకట్లో గూడ అతడి ఆకారాన్ని పోల్చుకుని, అతడు రాజారావు కాదని రూఢి చేసుకున్నాడు సారధి.

ఆగంతకుడు చేతిలో ట్రే ఉంది. బహుశా సవితకు ఆహారం తెస్తున్నట్లున్నాడు కాబోలు! ఆగంతకుడు తన జేబులోంచి తాళంచెవి తీసి తలుపులో దూర్చి త్రిప్పాడు.

"పాపం! సవిత ఇంతదూరం ప్రయాణించి అలిసిపోయి ఉంటుంది!" అన్నాడు సారథి చీకట్లో, నెమ్మదిగా.

ఆగంతకుడు ఉలిక్కిపడ్డాడు. తన చేతిలోని ట్రేని క్రిందపెట్టి, చీకట్లో మాట వచ్చిన వేపుగా పిడికిళ్ళు బిగించి చూశాడు.

సారథి నవ్వాడు. గభాల్న కూర్చున్నాడు. ఆగంతకుడు గోడకు గుద్దుకున్నాడు. దాసు అతడికి వెనకగా వచ్చి, ఎలుకని పట్టే పిల్లిలా ఆగంతకుడ్ని తన చేతుల్లో ఇరికించుకున్నాడు.

మరుక్షణంలో ఆగంతకుడు నేలకొరిగిపోయాడు. తన జేబులోంచి తాడు తీసుకుని అతడి కాళ్ళూ, చేతులూ కట్టి పడేశాడు. అతడి నోట్లో గుడ్డలు కుక్కి, తీసుకువెళ్ళి ఒక మూలగా దాచాడు దాసు.

దాసుని వరండాలోనే ఉంచి, సారధి, రామ్మూర్తి లోపలకు ప్రవేశించారు.

"ఈ తలుపుల తాళాలు గూడ ఎలెక్ట్రికల్‌గా ఆపరేట్ అవుతాయి కాబోలు! కాకపోతే, ఇంత మందంగా ఉన్న తలుపుకు ఇంత సన్నని తాళంచెవి ఏమిటి?" తలుపు వంక చూస్తూ అన్నాడు రామ్మూర్తి.

మెట్లు దిగి లోపలకు వెళ్ళారు. మరో తలుపు వచ్చింది. అదే 'కీ'తో ఆ తలుపు కూడా తెరుచుకుంది.

సోఫాలో కూర్చుని ఉన్న సబిత కంగారుగా లేచింది. అయితే ఆ వచ్చింది రాజారావు కాదనీ, తనను వెదుక్కుంటూ వచ్చిన సారథి, రామ్మూర్తి అని గ్రహించంగానే, ఆమె సంతోషానికి అవధి లేదు!

"ఏమిటిది? కలా? నిజమా? నన్ను ఎలా కనుక్కోగలిగారు?" అంది సబిత.

"యోగక్షేమాలు విచారించేందుకు ఇదేమీ రైల్వే ప్లాట్‌ఫారమ్ కాదు! ముందు నీ సంగతి చెప్పు! నిన్నేం హింసించలేదు గదా?" అంటూ రామ్మూర్తి ఆమె చేతి వ్రేళ్ళను తడిమి చూశాడు.

"రామ్మూర్తీ! ఆమెతో మాట్లాడుతూ, రాజారావు రాకను గూడా మరిచేవ్! జాగ్రత్తగా ఉండు! ఈలోపల నేను కొంచెం పని చూసుకుని వస్తాను!" అంటూ అక్కడ్నుంచి నడిచి మరో గదిలోకి వచ్చాడు సారథి.

ఆ గదిలో టేబుల్ మీద కలర్ టెలివిజన్ ఉంది' మరోవైపు అద్దాల బీరువాలో, గాజుపెట్టెలో చేతివ్రేళ్ళ నమూనాలు మైనంతో చేయబడినవి ఉన్నాయ్! వీటితోనే రాజారావు తన చేతివ్రేళ్ళ ముద్రలను ఫోర్జరీ చేసింది అనుకున్నాడు సారథి.

ఆ గదిలోంచి తిరిగి మొదటి గదిలోకి ప్రవేశించాడు సారథి.

"సవితా! మీ నాన్నను చూద్దువుగాని రా! ఆయన పాపం అలిసిపోయి నిద్రపోతున్నాడు!" అంటూ సారథి సవితను వెంటబెట్టుకుని మూడో గదిలోకి వెళ్ళాడు.

తండ్రి సోఫా కమ్ బెడ్ మీద పడుకుని నిద్రపోతున్నాడు. సవిత వెళ్ళి అతడ్ని కుదిలించి లేపింది.

ఛటర్జీ కళ్ళు తెరచి సవిత వంక అయోమయంగా చూశాడు. తను కలగంటున్నానేమో అని, కళ్ళు నులుముకుని మరీ చూశాడు.

"నాన్నా! నేను! సవితను!" అంది సవిత అతడ్ని కుదుపుతూ.

"నేను కలగనటం లేదుగదా! సవితా! ఎలా రాగలిగావిక్కడికి?" అంటూ సారథి వంక తేరిపార చూశాడు. "ఎవరితడు? రాజారావు మనిషి కాదుగదా? నిన్ను బలవంతంగా తెచ్చాడా ఇక్కడకు?"

"లేదు నాన్నా! ఈయన మనల్ని రక్షించటానికి

వచ్చిన వ్యక్తి. బయట అతడి కారు సిద్ధంగా ఉంది. మనం వెంటనే బయలుదేరాలి!" సబిత తండ్రిని తొందరచేసింది.

"అంత తొందరేం లేదులే! రాజారావు గదులు చాలా సౌకర్యంగా ఉన్నాయ్! అతగాడి ఆతిథ్యం పొంది మరీ వెడదాం! నమస్తే ఛటర్జీ సాబ్! నా పేరు సారథి! ప్రైవేట్ డిటెక్టివ్‌ని. టెలివిజన్ గురించి మీకూ రాజారావుకూ ఒప్పందం కుదరలేదా?" అనడిగాడు సారథి.

"రాజారాజా? టెలివిజనా? ఆ సంగతి నీకెలా తెలుసు? నా కుమార్తెకు కూడా ఈ విషయం తెలియకుండా ఉంచానే?" ఛటర్జీ ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు.

"అదంతా మనం తర్వాత తీరికగా చర్చించుకోవచ్చు. రాజారావు మిమ్మల్ని బలప్రయోగంచేత తన షరతులకు ఒప్పుకోమంటున్నాడా?"

సబిత అడ్డం వచ్చింది. "మనం ఇక్కడినుంచీ బయట పడితే నయం! లేదా మళ్ళీ ఆ రాజారావు రావచ్చు!"

"నేనుండగా మీకిద్దరకూ ఎలాటి ఆపదా రాదు! అదీ గాక రాజారావు రాత్రి ప్రొద్దుపోయేదాకా రాడు!" నిబ్బరంగా అన్నాడు సారథి.

అతడు ఆ గదిలోంచి బయటకు నడిచాడు. భూగర్భంలో నాలుగో గది తలుపు తాళం తీసి లోపలకు వెళ్ళాడు. ఆ గదిలో జనరేటరూ, ఎలెక్ట్రికల్ ట్రాన్స్‌ఫార్మర్లూ గది అంతా కరెంటు సామానుతో నిండి ఉంది. మెయిన్ స్విచ్‌లూ, స్విచ్ బోర్డు, పెద్ద స్విచ్‌లూ ఒక వైపు గోడను ఆక్రమించుకున్నాయ్.

మరో మూలగా ఇనుప నిచ్చెన బిగించి ఉంది. అది అత్యవసర పరిస్థితిలో పారిపోవటానికి ఉపయోగించే మార్గం.

అతడు తిరిగీ ఛటర్జీ గదిలోకి వెళ్ళాడు.

"సారథిగారూ! మిమ్మల్ని చూడంగానే అపార్థం చేసుకున్నాను. సవిత మీ సహాయం గురించి చెప్పింది. మీ మేలు జన్మలో మరచిపోలేను!" అన్నాడు ఛటర్జీ.

"నా సలహా ఏమంటే, మీరు ఇక్కడ్నుంచి బయట పడ్డాక, మీ సెట్‌ని ముందు పేటెంట్ చేయించండి! తర్వాత మీరు ఫ్యాక్టరీని స్థాపించేందుకు స్టేట్ బ్యాంకు నుంచి ఋణం పొందటానికి నేను సహాయపడగలను" సారథి సలహా ఇచ్చాడు.

"మీకు నా కృతజ్ఞతల్ని ఎలా తెలుపుకోవాలో అర్థం కావటంలేదు! అవునూ మీరు ఇంతసేపు నాతో తీరికగా మాట్లాడారు కదా? రాజారావు వస్తాడని భయం లేదా మీకు?"

"మనం ఏ క్షణాన తలుచుకుంటే ఆ క్షణానే బయటకు పోగలం. నా ఉద్దేశ్యం, రాజారావుతో ముఖాముఖి ఎదురుపడి అతడిచేతనే నిజాలు కక్కించాలని."

"మీరు నిజంగా గుండెలు తీసిన బంటులు సుమా!" అని మెచ్చుకున్నాడు ఛటర్జీ.

అంతలో గదిలో ఎర్ర లైటు వెలుగుతూ ఆరిపోవటం ప్రారంభించింది.

"అది దాసు సంకేతం! బహుశా రాజారావు వస్తూ ఉండాలి. త్వరగా తండ్రీ రెండో రూమ్‌లోనూ, కుమార్తె మొదటి రూములోనూ విచారంగా కూర్చోండి. పొరబాటున కూడా నా పేరెత్తవద్దు!" అన్నాడు సారథి.

ఛటర్జీ గదికి అనుకునే ఉన్న బాత్‌రూమ్‌లో సారథీ, రామ్మూర్తి దూరారు.

# 13

రాజారావు పార్టీకి వచ్చిన అతిథులందరికీ వీడ్కోలు చెప్పి భూగృహం వేపుగా వచ్చాడు. తను సబితకు ఆహారం పంపిన నౌకరు మళ్ళీ వెనక్కు రాలేదు. వాడేమైనాడా అని ఆశ్చర్య, సంభ్రమాలతో అతడు గబగబ నడిచాడు.

ఆ నౌకరూ ఒక నేరస్థుడే! పోలీసుల చేతుల్లో పడకుండా తనే వాడ్ని కాపాడి, తన దగ్గర పనికి పెట్టుకున్నాడు.

ఒకవేళ వాడు తనకు ద్రోహం తలపెట్టి పారిపోయాడు? వాడు నేరుగా ఏ పోలీస్ స్టేషన్‌కీ వెళ్ళలేదు గదా?

ఈ రాత్రి కల్లాగైనా ఛటర్జీ ఒప్పుకునేలా చేయాలి! ఇలా రోజులు సాగిన కొద్దీ ఏదైనా కొత్త ప్రమాదాలు ముంచుకురావచ్చు!

రాజారావు మెట్లుదిగి పాతాళ గృహం తాళం తీసి గదిలోకి ప్రవేశించాడు. ఇప్పటిదాకా అతడు ఏక్షణాన అయినా సారథి ఊడి పడతాడేమో అని భయపడి చస్తున్నాడు. అంతలోనే తను అనవసరంగా భయపడుతున్నానేమో అనుకున్నాడు.

సారథి ఎంత మొనగాడైనా గానీ, ఈ పాతాళ గృహం ఉనికిని ఎలా కనుక్కోగలడు? వాడి తల్లో జేజి గూడా ఇక్కడకు రాలేదు అని తనకు తనే ధైర్యం చెప్పుకున్నాడు.

అతడు ముందు సబిత దగ్గరకు వెళ్ళాడు. "మిస్ సబితా! నా డ్రైవర్ వల్ల నీకు జరిగిన బలప్రయోగానికి నేను మరోసారి క్షమాపణ చెప్పుకుంటున్నాను. నిజానికి

నీకు ఏ హానీ తలపెట్టలేదు. మీ నాన్న దగ్గరకు నిన్ను చేర్చాలనే నా అభిమతం.''

''చూడండి రాజారావుగారూ! మీ క్షమాపణలూ బెదిరింపులూ నా కక్కర్లేదు! మా నాన్నగారెక్కడున్నారో తక్షణం చూపించండి!'' సవిత ఆడ పులిలా గర్జించింది.

''నేను వచ్చింది అందుకోసమే! ఆయన దగ్గరకు పోంగానే, నీవైనా ఆయనకు నచ్చచెప్పు! నాకు విరోధమంటే చెడ్డ అసహ్యం!'' అంటూ రాజారావు సవితను వెంటబెట్టుకొని ఛటర్జీ గదిలోకి వెళ్ళాడు.

అప్పుడే మొదటిసారిగా తండ్రిని చూస్తున్న దానిలా ''నాన్నా! నీకేం హాని జరగలేదు కదా!'' అంది.

ఛటర్జీ ఆశ్చర్యంగా గుడ్లప్పగించి చూశాడు. ''అయితే ఈ నరరూప రాక్షసుడు నిన్ను బంధించి తెచ్చాడా తల్లీ!'' అన్నాడు కుమార్తెను తన చేతుల్లోకి తీసుకుంటూ.

''నీ తల బిరుసుదనమే నీ కుమార్తెను ఇక్కడకు రప్పించింది. నేను లోగడ చెప్పిన దాన్ని అంటే అయిదు శాతాన్ని పది శాతానికి హెచ్చిస్తున్నాను నీ వాటాని! నీవు ఒప్పుకుంటే ఇక్కడికిక్కడే అగ్రిమెంటు రాసుకుందాం! ఆ తర్వాత నీవూ నీ కుమార్తె లక్షణంగా వెళ్ళిపోవచ్చు!'' రాజారావు ఆవేశంగా అన్నాడు.

ఛటర్జీకి బదులుగా సవిత జవాబిచ్చింది. ''ఇదా నీ కపటనాటకం! నన్ను నా తండ్రి కళ్ళెదుటే హింసించి ఆయన చేత సంతకం పెట్టిద్దామనా నీ ఉద్దేశ్యం. అదెన్నటికి జరగదు. నాన్నా! నా ప్రాణాలు పోయినా సరే అతడితో నీవు రాజీ పడవద్దు!'' అంది.

రాజారావు పళ్ళు పటపట కొరికాడు. "తండ్రికి తగ్గ కూతురి వనిపించుకున్నావ్! దీనికి ఫలితం మీరిద్దరూ అనుభవించాల్సి ఉంటుంది."

"నీ సంగతంతా సారధిగారు ఎప్పుడో చెప్పేశారు..." సబిత ఇంకేదో చెప్పేలోపలే, రాజారావు అడ్డు తగిలాడు.

"ఎవరూ? సారధా? వాడో హంతకుడు. దగాకోరు! వాడి మాటలా మీరు నమ్మేది! మిమ్మల్ని లక్షాధికారుల్ని చేయబోతున్నది నేను! కానీకి టికాణా లేని ఆ వెధవ మాటలు మీకు కూడు పెడతాయా?"

"ఏమైనా సరే! మా నాన్నగార్కి ముప్ఫయి శాతం వాటా ఇస్తేగానీ ఒప్పుకోరు! ఆపైన నీ ఇష్టం!"

"పదిశాతం కన్న ఎక్కువ దమ్మిడీ గూడా ఇచ్చేది లేదు."

బాత్ రూమ్ తలుపు తెరుచుకుని సారధి హఠాత్తుగా ప్రత్యక్షమయాడు. "అంత శ్రమ ఎందుకు రాజారావ్! ఆ పదిశాతం నీవే ఉంచుకో!" అన్నాడు, జేబులో చేతులు పెట్టుకొని.

అసలే సారధి పేరు వింటూనే ఉలిక్కిపడుతున్న రాజారావు, ఈ హఠాత్సంఘటనకు ట్రాన్సుడిపోయాడు. కొద్ది సెకన్లు అక్కడ మౌనం తాండవించింది. సారధి కేసి గుడ్లప్పగించి చూస్తూండిపోయాడు రాజారావు.

"ఎవరూ? సారధే! నిజంగా!" అన్నాడు చివరకు గొంతు పెగల్చుకుని.

"అవును! నిజంగా సారధే!"

"ఎంత ధైర్యం నీకు! పులిబోనులోకి కుందేలు పిల్ల ఉరికినట్టు నా భూగృహంలోకి నీవే వచ్చావ్! నా గురించి

నీవు అతి ప్రమాదకరమైన రహస్యాల్ని సేకరించావ్! ఇకనిన్ను బ్రతకనివ్వటం నాకు క్షేమకరం కాదు!''

''నీ క్షేమం నాకు వదిలెయ్యి రాజారావు! నీవు రామారావు ఉరఫ్ లక్ష్మణరావుని హత్యచేసిన నేరానికి ఉరికంబం ఎక్కే రోజున, ఛటర్జీ కలర్ టెలివిజన్ ఫ్యాక్టరీకి ప్రారంభోత్సవం జరుగుతుంది!''

''రామారావెవరో నాకు తెలీదు! అతడ్ని నేనెలా హత్యచేయగలను.''

''నీవు నా వ్రేలి ముద్రల నమూనాలను తయారు చేయించ లేదా? అవి ప్రక్కగదిలో అల్మరాలో ఉన్నయ్; అంతకన్న సాక్ష్యం ఏం కావాలి, నీవే రామారావుని హత్య చేసినట్టుగా నిదర్శనం!''

రాజారావు ఒక్కక్షణం ఆలోచించాడు. ఈ సారధి ఆవులిస్తే ప్రేగులు లెక్కపెట్టే రకం! ఇతడి దగ్గర ఏవీ దాచి ప్రయోజనం లేదు. ఎటూ అతడ్ని తను ఈ పాతాళ గృహం నుంచి బయటపడనీయబోవటం లేదు. కనుక అతడికి యదార్థాన్ని చెప్పినా ఇబ్బంది లేదు అనుకున్నాడు రాజారావు. సారధి చేతివ్రేలు జేబులోని అగ్గిపెట్టె సైజులోని టేప్ రికార్డర్ బటను నొక్కింది.

''అవును వాడు, ఆ రాస్కెల్ రామారావు పెద్ద బ్లాక్ మెయిలర్. నా నుంచి వాడు క్రమేపీ వేలకు వేలు లాగటం మొదలెట్టాడు. అందుకే అతడికి టిక్కెట్ ఇవ్వదలుచుకున్నాను. ఇచ్చేశాను. నా వ్యాపారంలో ఒకసారి నీవూ ప్రమేయం కల్పించుకుని అహమ్మద్ ఖాన్ ని జైలుకు పంపావ్! అందుకే ఆ హత్యానేరాన్ని నీ మీదకు వచ్చేలా చేశాను,'' అంటూ రాజారావు సత్వరన వెనుదిరిగి తలుపు దగ్గరకు పరుగెత్తాడు.

కను రెప్ప పాటులో తలుపు మూసి బయట తాళం వేశాడు. ఆ తర్వాత జనరేటర్ రూమ్‌లోకి వెళ్ళి స్విచ్‌లన్నీ ఆఫ్ చేసేశాడు.

ఎయిర్ కండిషనర్‌లు పని చేయడం ఆగి పోయాయి, అన్ని గదుల్లోని లైట్లూ ఆరిపోయినయ్.

రాజారావు వికటంగా నవ్వాడు. ఇనుపనిచ్చెన మీదుగా ఎక్కి మేడలోని గదికి చేరుకున్నాడు. వేగంగా బయటకు వెళ్ళి కారులో కూర్చుని ఏక్సిలేటర్‌ని బలంగా త్రొక్కాడు.

కారు అరవయి మైళ్ళ వేగాన్ని అందుకుంది ట్రంక్ రోడ్డు మీద.

రామ్మూర్తి కంఠంలో ఆతృత గోచరించింది. "ఇప్పుడేమిటి దారి?" అన్నాడు.

సారథి తన జేబులోంచి మినీటార్చి తీసి వెలిగించాడు. మరో జేబులోంచి తాళం చెవిలాగి, తలుపులో దూర్చి త్రిప్పాడు.

"లాభంలేదు. ఈ తాళాలన్ని కరెంటు మీద పని చేస్తాయి. అందుకే అంత సన్నని చెవితో ఇంత దళసరి తలుపులు తేలికగా తెరుచుకున్నయ్!" అన్నాడు ధూర్జటి.

"ఇలాగే మనం ఉంటే ఏమవుతుంది?" అన్నది సబిత.

"రెండు గంటలలో ఈ గదిలో చెడువాయువు పేరుకుంటుంది. ఆక్సిజన్ అందక మనందరం ఊపిరాడక చచ్చిపోతాం!" రామ్మూర్తి బదులు చెప్పాడు.

"మనమేం క్షణాల్లో చావబోవటం లేదు! పాతాళ గృహం బయట దాసు ఉన్నాడని మరిచిపోకండి. ఎంత సేపటికీ మనం రాకపోవటం చూసి అతడు ఏదైనా సాయం తీసుకురావచ్చు!"

"అవును అదీ నిజమే! అనవసరంగా ఆదుర్దాపడి బ్లడ్ ప్రెషర్ తెచ్చుకోక, సోఫాల్లో హాయిగా విశ్రాంతి తీసుకోండి!" రామ్మూర్తి సూచన చేశాడు.

# 14

ఇన్స్పెక్టర్ రాజేంద్ర జీప్‌లో కూర్చున్నాడు, అతడి వెనుక ఇంకా నలుగురు పోలీసులు తుపాకులు పట్టుకొని కూర్చున్నారు.

జీప్ వేగంగా, రాజారావు కాటన్‌మిల్ వేపుగా పరుగిడుతోంది.

పోలీసులు రామారావు గదిని చివరిసారిగా వెతుకుతున్నప్పుడు గోడమీద పెన్సిల్‌తో రాసి ఉన్న టెలిఫోన్ నెంబరు కనబడింది. ఆ ఫోన్ నెంబరు రాజారావు ఆఫీసు ఫోన్‌ది.

ఇన్స్పెక్టర్ రాజేంద్ర రాజారావుని కలుసుకోవాలని అతడి ఆఫీసుకు వెళ్ళాడు. అక్కడ రాజారావు లేడు. ఆఫీసు సిబ్బంది తమలో ఎవరికి రామారావుతో పరిచయం లేదని వెల్లడించారు.

రాజారావు సెక్రటరీ మాత్రం, రామారావుని పోలిన వ్యక్తి అప్పుడప్పుడు వచ్చి రాజారావుతో మాట్లాడి వెళుతుండే వాడని చెప్పింది.

కనుక ఈ రామారావు ఉరఫ్ లక్ష్మణరావు అనే వ్యక్తి రాజారావుని తప్పకుండా బ్లాక్‌మెయిల్ చేస్తుండచ్చనీ, అందుకే అతడ్ని రాజారావు హత్యచేసే సావకాశం కలిగిందని మొదటి సారిగా అనుమానించాడు రాజేంద్ర.

రాజారావు కాటన్‌మిల్ దగ్గరి బంగళాలో పార్టీ ఏర్పాటు చేశాడని తెలుసుకుని హుటాహుటిని అక్కడకు

బయలుదేరాడు ఇన్స్పెక్టర్ రాజేంద్ర.

దోవలో అతడికి రాజారావు కారు ఎదురయింది. అపర మృత్యువులా, రోడ్డుమీద రాకెట్‌లా దూసుకు వస్తోంది కారు, మితిమీరిన వేగంతో.

"సార్! అది రాజారావు కారే!" అని అరిచాడు డ్రైవర్.

"ఎలాగైనా ఆ కారుని ఆపుజేయండి!" అన్నాడు రాజేంద్ర.

అందరూ జీప్‌లోంచి దిగారు జీప్‌ని రోడ్డు కడ్డంగా ఉంచి. అందరూ రోడ్డు ప్రక్కనే నిలబడ్డారు.

కారు వేగాన్ని తగ్గించుకుంటూ వచ్చింది. కానీ అప్పటికీ బ్రేక్ పడక, జీప్‌ని గుద్దేసింది.

పోలీసులు తుపాకులు ఫైర్ చేస్తూ, కారుని చుట్టుముట్టారు.

పోలీసుల్ని చూడంగానే రాజారావు ప్రైప్రాణాలు పైనే పోయినయ్.

# 15

ఆవరణలో కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్న దాసు పోలీసుల్ని చూస్తూనే, "అయ్యా! సమయానికి వచ్చారు. పాతాళగృహంలో సారథి, రామ్మూర్తి, ప్రొఫెసర్ ఛటర్జి, ఆయన కూతురు సబిత సజీవంగా సమాధి చేయబడ్డారు. వాళ్ళని రక్షించండి!" అన్నాడు.

ఇద్దరు పోలీసులు ఇనుప నిచ్చెన మీదుగా ముందులోపలకు దిగారు. ఆ తర్వాత రాజారావు, ఇన్స్పెక్టర్ రాజేంద్ర దిగారు. మిగతా పోలీసులు పైన కాపలా ఉన్నారు.

రాజారావు వెళ్ళి స్విచ్‌లన్ని వేశాడు.

లైట్లు వెలిగినయ్. ఎయిర్ కండిషనర్లు పనిచేయటం

ప్రారంభించినయ్.

రాజారావు తన జేబులోంచి తాళం చెవి తీసి రాజేంద్ర కందించాడు.

ఇన్స్పెక్టర్ తలుపు తీసి లోపలకు వెళ్ళంగానే, లోపలున్న నలుగురూ "మీరా ఇన్స్పెక్టర్! సమయానికి వచ్చి రక్షించారు!" అని అతడ్ని చుట్టుముట్టారు.

సారథి మాత్రం "రాజారావెక్కడ?"అని అడిగాడు.

"వాడెక్కడికి పోగలడు. వాడికి వెనుకా, ముందూ పోలీసులు కాపలా ఉన్నారు!" అన్నాడు రాజేంద్ర.

అదే సమయంలో ఎలక్ట్రిక్ పరికరాలున్న గదిలోంచి దిక్కులు పిక్కటిల్లేలా కేక వినబడింది.

అందరి శరీరాల్లోని రక్తం గడ్డకట్టుకు పోయింది ఆ కేకకు. ఎవరికి వారే వెర్రిగా ఆ రూమ్‌లోకి పరుగెత్తారు.

మెయిన్ స్విచ్ తెరచి అందులో తన రెండు చేతులూ దూర్చాడు రాజారావు. హైవోల్టేజీ కరెంట్ అవటం వల్ల, సెకన్లలోనే అతడి శరీరం విద్యుద్ఘాతానికి గురయింది, శరీరం నల్లగా కమిలిపోయింది.

"ప్చ్! ఎటూ ఉరిశిక్ష తప్పదని భయపడి, తనకు తానై ఆత్మహత్య చేసుకున్నాడు పాపం!" అన్నాడు రాజేంద్ర సానుభూతిగా.

"తను తీసుకున్న గోతిలో తానే పడ్డాడు!" ఛటర్జి పెదవి విరుస్తూ అన్నాడు.

-: ఐపోయింది :-

# పారిపోయిన సిపాయి!

## ముద్దా సురేష్

తెల్లవారు ఝాము నాలుగు గంటలవుతోంది.

అస్సాంలోని భోలాపూర్‌లో తొమ్మిదైతేనే గాని తెల్లవారదు. దూరంగా కొండరాళ్ల మీద ప్రవహించే నామ్‌ఖా చూ నది గలగలలు లయబద్ధంగా వినబడుతున్నయ్. అప్పుడప్పుడు మంచు పింజలు గాలిలో ఎగురుకుంటూ వచ్చి చెట్ల కొమ్మలకు అతుక్కుపోతున్నాయ్.

రాత్రంతా నిద్రలేక పోవడంచేత నాకళ్ళు విపరీతంగా మండసాగాయి. మణుగు బరువు బూట్లలో బంధించబడిన నా పాదాలకు వెలుగు చూసే అవకాశం లేదు. కారణం? యూనిఫారంలో ఉన్న సరిహద్దు రక్షకదళం సిపాయిని నేను.

ఓవరాల్ కాలర్ని పైకెత్తి మెడనిండా కప్పుకున్నాను. రంగు వెలసిన రేకు మగ్ లోని 'బ్లాక్ టీ' చప్పరిస్తూ రాతిగోడవైపు విసుగ్గా చూసాను.

చైనా భారత సరిహద్దును తెలిపే గోడది. గోడ అవతలివైపు ఓ పదడుగుల దూరం ఖాళీ. తర్వాత మళ్లీ రాతిగోడ ఉంటుంది. ఆ రెండో గోడ కావలివైపు ఉంటారు చైనీస్ సైనికులు.

సరిహద్దు అవతలి నుండి మమ్మల్ని వెర్రెక్కించడానికి చైనా సిపాయిలు పగలబడి నవ్వుతుంటారు. కిచకిచ మాట్లాడుకుంటారు. ఎపుడో అర్ధరాత్రివేళ మేము అదిరిపడేలాగ తుపాకులు గాలిలోకి పేలుస్తూంటారు.

దినదినగండం అన్నట్లు ప్రతీరోజు ఇలాంటి కవ్వింపు చర్యలను, వికృతపు చేష్టలను భరించడం అసహనంగా మారింది నాతోపాటు నా సహచరులకు కూడ. చిటికవేసే గోడదూకి శత్రువుల కుత్తుకలు కరిచెయ్యగల 'కలేజా' మా ప్లటూన్ కి ఉంది. అయితే హెడ్ క్వార్టర్స్ నుండి కమాండర్ కీ, కమాండర్ నుండి మాకు, ఆర్డర్స్ లేక పోవటం వల్ల మేము ఒళ్ళు చల్లబర్చుకొని ఓర్పు వహించాల్సి వస్తోంది.

ఖాళీ అయిన మగ్ ఇసుకలోకి విసిరాను. ఓవరాల్ జేబులో దూరిన నా చెయ్యి సిజర్స్ సిగరెట్ అందుకుంది. సిగరెట్ కడ్డంగా ముద్రించబడ్డ 'స్పెషల్ క్వాలిటీ' అన్న అక్షరాలని ఓసారి సంతృప్తిగా చదువుకొని పెదాలమధ్య ఉంచాను. అగ్గిపెట్టెలో తంటాలు పడాల్సి వచ్చింది. నాలుగుసార్లు గీచినా వెలగలేదు అగ్గిపుల్ల. అగ్గిపెట్టెని మందుఉన్న వైపు అరచేత్తో వేడి

చేసాను. ఈసారి వెలిగింది. దమ్ముగట్టిగా పీల్చి, గుండెల్లో ప్రవేశించిన వేడిని ఆనందంగా అనుభవిస్తూ వెన్నెల కాంతిలో నలువైపులా చూశాను.

సరిగ్గా అదే సమయంలో......

ధన్...ధన్...మన్న రైఫిల్ శబ్దం వినబడింది. అదిరిపడి బంకర్లో దూరి ఆటోమాటిక్ రికాయిలెస్ గన్ అందుకున్నాను.

మూడొందల మూడు రైఫిల్ లాగ రికాయిలెస్ గన్ 'జర్క్' ఇవ్వదు. అందువల్ల భుజానికి ప్రమాదం లేదు. అదే దాని ప్రత్యేకత.

సిగరెట్ జారిపడడం నేను గమనించలేదు. ట్రిగ్గర్ గార్డ్‌లో నా చూపుడువ్రేలు బిగుసుకుంది. తీక్షణంగా చూసాను గోడవైపు.

కుయ్...కుయ్...మన్న శబ్దం వినబడింది. చెవులు రిక్కరించాను. నా కళ్ళు పెద్దవయ్యాయి. గోడనుంచి తెల్లటి ఆకారం దూకింది. అదిరి పడ్డాను. "టామీ..." అన్నాను ఆందోళనగా.

కుక్కపిల్ల అది. మా ప్లటూన్‌లో సైనికు లందరికీ అదంటే ఎంతో యిష్టం. ముఖ్యంగా నాకు ప్రాణం. అది మాదగ్గరే పెరిగింది. ఎక్కడెక్కడో తిరిగి, పడుకోవాలను కున్నప్పుడు నా దగ్గర కొచ్చేసేది. పొట్టిగా ఉంటుంది టామీ తెల్లటిబొచ్చుతో ముద్దుగా. అయితే యిప్పుడు దానిదేహం చిక్కని ఎర్రటి రక్తపు మరకలతో ఉంది. రొజుకుంటూ, రొప్పుకుంటూ వచ్చి నా ఒళ్ళో దూరింది టామీ. తోకాడిస్తూ నీరసంగా మూల్గసాగింది. నాకళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. అక్కడక్కడ ఉన్న నా సహ చరులంతా నా వద్దకు పరిగెత్తుకొచ్చారు.

"టామీ; ఏమైందమ్మా"...అన్నాను గాభరాగా దాని దేహాన్ని నిమురుతూ. సమాధానాన్ని ఆశించని ప్రశ్న అది. అదే ఆఖరిచూపు అని తెల్సుకో లేకపోయాను. టామీ కనుగ్రుడ్లు తెల్లబడ్డాయి, తల వాల్చేసింది.

"టామీ..." పిచ్చిగా అర్చాను దాని దేహాన్ని చేతులమధ్య బిగించి. "విక్రాంత్! టామీ పొరపాటున గోడదాటి ఆ చైనా పిశాచాలవైపు వెళ్ళి ఉంటుంది. ఆ హృదయంలేని మనుషులు ఈ నోరులేని జంతువుపై కసి చూపించుకున్నారు. ఇందాకటి శబ్దం అదే" అన్నాడు సిపాయి కృపాల్ నా భుజంమీద చెయ్యివేసి.

నా ముక్కుపుటాలు ఉబ్బాయి. పళ్ళు బిగించాను. "రాస్కెల్స్! వాళ్ల అంతు చూస్తాను!" కుడిచేతిని తుపాకి మీద బిగించి పైకి లేచాను. హెల్మెట్ సర్దుకుంటూ చకచకా గోడవైపు కదిలాను.

"వాట్ ది హెల్ గోయింగ్ ఆన్ దేర్!"

ఎవరిదో కేక వినబడింది. నా కాళ్ళు తక్కున ఆగిపోయాయి. మౌనంగా వెనుదిరిగాను. నా సహచరులంతా ఎవరి స్థానాల్లోకి వాళ్ళు పరిగెత్తారు.

'ప్లటూన్ కమాండర్ జావేద్!' క్రాస్ బెల్ట్ సవరించుకుంటూ వస్తున్నాడు.

నాలుగడుగులు ముందుకు వేసి అంటెంక్షన్‌లో నిలబడి శాల్యూట్ చేసాను కమాండర్‌కి.

తల ఊపి "ఏం జరిగింది!" అన్నాడు కమాండర్ జావేద్, హాండ్ స్టిక్‌ని అరచేతిలో తడుతూ.

"కమాండర్ సాబ్! నెలరోజుల నుండి అటువైపు నుండి చైనీ సైనికులు కవ్వింపు చర్యలు కొనసాగించడం

మీకు తెల్సిన విషయమే. అటు చూడండి. ఈ రోజు టామీని షూట్ చేసి చంపారు. టామీ అంటే మా కందరికీ ప్రాణం. ఇక సహించకూడదు. వాళ్ల పీకలు కత్తిరించి ఈ సరిహద్దు గోడలకు తోరణాలు కట్టాలి.''

''డామ్ యువర్ బ్లడీ సెంటిమెంట్స్! కుక్క కోసం యుద్ధం చేస్తారా?'' విరుచుకు పడ్డాడు జావేద్.

''సాబ్! ఇప్పటికే ప్రత్యర్థులకు మనం చాల లోకువయి పోయాం. మేము పొందిన శిక్షణను ప్రదర్శించుకొనే అవకాశం యివ్వండి. కామ్‌గా వెళ్ళి ఖతం చేస్తాం. ఈ ప్రాంతం సరిహద్దు రేఖలో అంత ముఖ్యమైన ప్రదేశం కాదు. ప్రత్యర్థులు రెండు మూడు ప్లటూన్ల కంటె ఎక్కువ మంది ఉండరు.''

''డామ్ యువర్ స్టాటిస్టిక్స్. అలసిపోయి మీరేం మాట్లాడుతున్నారో మీకు తెలియడం లేదు. మీరు చేయబోయే వెధవ పనికి ఫలితం అనుభవించేది మీరుకాదు. కోట్లాది భారత ప్రజలు. గో అండ్ టేక్ యువర్ పొజిషన్.''

''సాబ్! పగతీర్చుకోవాలి. నేను వెళ్తాను......''

నా చెంప ఛెళ్ళున మోగింది. క్రింది పెదవిచిట్లి రక్తం పొంగింది. తుడుచుకోలేదు నేను. చేతులు బిగించి అటెంక్షన్‌లోనే ఉన్నాను.

''హౌ డేర్, యు డిసొబే మై ఆర్డర్స్'' పళ్ళు నూరాడు కమాండర్ జావేద్. ''దీనికి పనిష్మెంట్ ఏమిటో తెల్సా? రైఫిల్‌ని రెండు చేతులతో ఎత్తిపట్టుకొని ఆ కొండచుట్టూ మధ్యాహ్నం 12 గంటలదాకా పరిగెత్తు! నో రెస్ట్ అండ్ నో సప్లయ్ ఆఫ్ వాటర్. ఇలాంటి పిచ్చివేషాలు రెండోసారి వేస్తే 'క్వార్టర్ గార్డ్'కి పంపుతాను.

ఉలిక్కి పడ్డాను నేను. క్వార్టర్ గార్డు అంటే అదో మిలటరీ జైల్. ఒకో మిలటరీ యూనిట్ కి ఒక్కొటి ఉంటుంది. తప్పు చేసిన జవాన్లకు మిలటరీ కోర్టు ననుస రించి శిక్ష విధించబడుతుంది. ఆ శిక్ష ననుభవించాల్సింది. ఆ క్వార్టర్ గార్డులో.

"క్విక్! డబుల్ అప్" చేతులు రెండూ వెనుక పెట్టుకొని ఆజ్ఞాపించాడు కమాండర్ జావేద్.

నా వేపు సానుభూతిగా చూస్తున్న నా సహచరుల కేసి ఓసారి చూసాను. తర్వాత రైఫిల్ ని ఎత్తి పట్టుకొని మౌనంగా తాగ్లా, నింజిమా నే కొండల శ్రేణి వైపు రౌడు తీసాను.

# 2

ఆ రాత్రి మళ్ళీ డ్యూటీలో చేరాను. వాచీ రెండు గంటలు చూపుతోంది. సరిహద్దు అవతలి నుండి తాగు బోతు మార్కు పిచ్చి కేకలు ప్రారంభమయ్యాయి. నా ఒంట్లో రక్తం సలసల కాగుతోంది. చివరిసారిగా నా ఒడిలో వాలిపోయిన టామీ, అది జాలిగా దీనంగా చూసిన చూపులూ, ఇంకా నా కళ్ళకు కట్టినట్టు కనబడు తున్నయ్.

మైగాడ్! ముక్కు మూసుకొని ఎలా కూర్చోవడం బుషిలా?

"విక్రాంత్! నువ్వింత పిరికివాడివి అనుకోలేదు. బద్ లా!...రక్తానికి రక్తం...వెళ్ళు నీ కసి తీర్చుకో... భారత జవానులు అసమర్థులుగారనీ, రెచ్చగొట్టబడిన సింహాలనీ నిరూపించు" అంటూ ప్రబోధిస్తోంది నా అంత రాత్మ.

బంకర్‌లోంచి చటుక్కున పైకి లేచాను. సరిగ్గా అప్పుడే ఓ అనుమానం వచ్చింది. రికాయిలెస్ గన్‌తో నేను ఒక్కడినీ అంతమంది శత్రువులని చంపగలనా??

అసంభవం అనిపించింది. నా మెదడులో ఏదో మెరుపు మెరిసింది. మూడు రోజుల క్రితం కోచింగ్ క్లాస్‌లో చెప్పిన 73 మోడల్ ఓరన్ రివాల్వర్ విశేషాలు గుర్తొచ్చాయ్! నా ముఖంలో అప్రయత్నంగా ఓ కాంతి రేఖ మెరిసింది. ఓరన్ రివాల్వర్ ట్రిగ్గర్ నొక్కితే షాట్‌కి 5 బులెట్ల చొప్పున 73 సార్లు కాల్చవచ్చు. శబ్దం ఎంతమాత్రం రాదు.

అయితే అది సంపాదించడం ఎలా? డిఫెన్స్ పోస్ట్‌లో ఉన్న 'కోత్'లో భద్రంగా ఉంటుంది అది. (ఆయుధాల్ని రహస్యంగా ఉంచే చోటుని 'కోత్' అంటారు). ఆలోచనలతో టైం వేస్ట్ చెయ్యడం యిష్టంలేక బంకర్లోంచి బైటపడి డిఫెన్స్ పోస్ట్ ప్రాంతాలకు చేరుకున్నాను.

పొదల మధ్యనుంచి ముందుకు చూసాను. గుండె దడ దడలాడింది. ఎలా వెళ్లటం? డిఫెన్స్ పోస్ట్ చుట్టూ బార్బ్‌డ్ వైర్ ఫెన్సింగ్ ఉంది. బహుశా అందులో కరెంట్ ప్రవహిస్తుండవచ్చు. ఫెన్సింగ్ చుట్టూ అడుగడుగునా కాపలా కాస్తున్నారు సిపాయిలు అప్రమత్తంగా. అంతలో వెనుక ఏదో శబ్దం గావడంతో ఉలిక్కిపడి వెనక్కి చూసాను.

ఖాకీ దుస్తుల్లో ఉన్న ఓ వ్యక్తి, వేగంగా త్రొక్కుతున్నాడు సైకిల్. అతను డిఫెన్స్ పోస్ట్ వెపు వెళ్తున్నాడని తెలిసిపోయింది నాకు. చకచకా ఆలోచించాను. అంతే! పొదలోంచి ఛంగున బయటకి దూకాను. దారి కడ్డంగా నిలబడ్డాను. సైకిల్ బ్రేకులు ఠక్కున పడ్డాయి.

"సైకిల్ దిగు" అన్నాను రైఫిల్ ఎత్తి.

"ఎవర్నువ్? పిచ్చెక్కిందా నీకు. శత్రువుని కాదు నేను. డిఫెన్స్ పోస్టులో టెలిఫోన్ బాగుచేయడానికి వెడుతున్నాను." అన్నాడతను కోపంగా.

"అడక్కుండా చెప్పినందుకు థాంక్స్! సైకిల్ దిగి, వెనక్కి తిరిగి నిలబడు!"

అతను వినిపించుకోలేదు. "షటప్. మీ కమాండర్ కి రిపోర్ట్ చేస్తాను."

ఆలస్యం చేయడం నా కిష్టంలేదు. సైకిల్ ముందు చక్రాన్ని చటుక్కున పైకి లేపాను గాలిలోకి. వెల్లకితలా పడ్డాడు అతను.

"సారీ బ్రదర్" అన్నాను. ఆ వ్యక్తి నోరు తెరిచేలోపల రైఫిల్ బట్ ని అతని తలమీద ఆడించాను. స్పృహ తప్పాడు అతను. నా చేతులు చకచకా పని చేసాయి. అతని దేహం పొదల్లోకి దూరింది. నా దుస్తులు మారాయి.

# 3

"కౌన్ హో తుమ్!" అర్చాడు సెంట్రీ అలవాటుగా.

"లోపల టెలిఫోన్ రిపేర్ వచ్చిందట. హెడ్ క్వార్టర్స్‌నుంచి వస్తున్నాను" అంటూ అంతకుముందు దొంగిలించిన అనుమతి పత్రం చూపించాను. అతను టార్చిలైట్ కాంతిలో దాన్ని పరిశీలిస్తుండగా, ఫెజ్ కాప్ ని నుదుటిమీదకి లాక్కున్నాను.

"ఠీక్ హై?" అడిగాను.

"అందర్ జావ్" అన్నాడు గేటు తెరుస్తూ.

భుజాన్కి ఉన్న టూల్ బాక్స్‌ని సర్దుకుంటూ గ్రౌండ్ లోకి నడిచాను. ఒక గండం గడిచింది. నా అనుమానం

నిజమైతే లోపల మరో ప్రతిబంధకం ఎదురవ్వాలి. అతనే 'రియర్ గార్డ్'. ఎదురుగా కనబడుతున్న కొండరాతితో కట్టబడ్డ చిన్న సైజు బిల్డింగ్ లోకి నడిచాను.

"గార్డ్ కిదర్ హై తుం?" పిల్చాను పెద్దగా.

లోపలినుంచి పెద్దపెద్ద అడుగులేసుకుంటూ బయటకి వచ్చాడు సైతాన్ సింగ్. చేతిలో మెషిన్ గన్ ఉంది. కండలు తిరిగిన శరీరం అతనిది. ఎఱ్ఱటి ముఖం, వెడల్పాటి మీసాలు, స్నఫ్ కలర్ తలపాగా, మణికట్టుని స్టీల్ రింగ్. సిక్కు జాతి గాంభీర్యం అతనిలో ప్రతిబింబిస్తోంది. పాకెట్ కు పైగా ఉన్న నల్లటి ప్లేట్ పైన చెక్కబడ్డ తెల్లటి అక్షరాల ద్వారా అతని పేరు గ్రహించడానికి ఎంతోసేపు పట్టలేదు.

విషయం చెప్పాను అతనికి. ఫోన్ ఉన్న రూమ్ చూపించాడు సైతాన్ సింగ్. టూల్ బాక్స్ విప్పి ఫోన్ ప్రక్కగా కూర్చున్నాను. ఆ సామగ్రి ఎలా ఉపయోగించాలో నాకు తెలియదు. గార్డు సైతాన్ సింగ్ గుమ్మంలో నిలబడి నా వైపు చూస్తున్నాడు. నా ముఖం నిండా చమటలు పట్టాయ్. ఉన్నట్టుండి గుండె పట్టుకొని తటాలున నేలమీద పడిపోయాను. చేతివేళ్ళు కొంకర్లు తిరిగాయ్. దవడలు కరిచిపెట్టి "మ్..." అంటూ మూల్గాను. కాళ్ళను నేలకేసి బాదసాగాను.

"అరె! క్యాహోగా!" అంటూ పరుగెట్టుకొచ్చాడు సింగ్. సమాధానంగా మూల్గాను. బిగుసుకుపోయిన చేతులు నేలకేసి బాదాను. నాకు మూర్ఛరోగం ఉందన్న విషయం సైతాన్ సింగ్ గ్రహించాడు. చకచకా జేబులు వెతికి ఓ పొడుగాటి ఇనుప తాళంచెవి బయిటికి తీసాడు.

నా అరచేతులు బిగుసుకుపోయి ఉన్నాయి. బలంగా విప్పాడు చేతిని సైతాన్ సింగ్. అరచేతిలో తాళం ఉంచి పిడికిలి మూసాడు. మరో రెండు నిముషాలకి కొంత తేరుకున్నాను.

"దా...హం" అన్నాను పెదాలు తడి చేసుకుంటూ.

"ఇప్పుడే తెస్తాను" వెనక్కి తిరిగాడు సైతాన్ సింగ్. ఆ అవకాశాన్ని జారవిడుచుకోలేదు నేను. నేలమీద పడి ఉన్న మెషీన్ గన్ చటుక్కున లాక్కుని అతని మెడ మీద కొట్టాను. 'స్పైనల్ కార్డ్'కి తగిలి ఉంటుంది.

"మోసం...నీకు మూర్ఛ లేదు" అన్నాడు సింగ్ వానపాములా క్రిందకు జారిపోతూ.

సైతాన్ సింగ్ ఆరుగంటల దాకా లేవడని నాకు తెలుసు. చేతిలోని తాళాన్ని పరిశీలించాను. ఆరంగుళాల పొడవుంది అది. దానిమీద 'సెవెన్ టైమ్స్ సెవన్' అన్న అక్షరాలు చెక్కబడి ఉన్నయ్. గోడలో బిగించబడ్డ 'కోత్' వైపు నడిచాను. ఐరన్ సేఫ్‌ను పోలి ఉంది దాని తలుపు. డయల్ ఉంది పిడి దగ్గర.

7 అంకెను వెదికాను. తాళం దూర్చాను అందులో. ఏడుసార్లు తిప్పాను ఎడమవైపు. ఎక్కడో 'క్లిక్' మంది. తలుపు లాగాను. కిర్రుమంటూ తెరుచుకొంది. నాకళ్ళు చెదిరాయ్. లోపల రకరకాల ఆయుధాలు!

నల్లగా మెరుస్తున్న ఓరన్ రివాల్వర్‌ని చటుక్కున అందుకొని ముద్దుపెట్టుకొన్నాను. బులెట్ కేస్‌ని మాగ్జైన్‌కి అమర్చి 'కాక్' చేసి సేఫ్టీపిన్ బిగించాను. కోత్ తలుపు మూసి రివాల్వర్‌ని టూల్ బాక్స్‌లో సర్దాను. కాప్ సర్దుకుంటూ బోట్ గేట్ వైపు నడిచాను పెద్దపెద్ద అంగలతో.

"సెంట్రీ! నువ్ కునికిపాట్లు పడుతున్నావ్!" అన్నాను గట్టిగా. త్రుళ్లిపడ్డాడు సెంట్రి. "ఎవరితోను చెప్పక!" అన్నాడు ఖంగారుగా. "పని పూర్తయిందా?"

"సబ్ ఠీక్ హై యార్! సరిహద్దుల్లో సంచలనం రేగుతోందట. రేచుకుక్కల్లా రెడీగా ఉండాలి మన సిపాయిలు."

"నీ మాటలు ఆవేశాన్నిస్తున్నయ్. నిద్ర అన్న పదం మర్చిపోతాను" అన్నాడు సెంట్రి.

"అచ్ఛా! తో మై ఛల్ తాహూఁ!" అన్నాను సైకిల్ కేసి చూస్తూ.

# 4

ఎదురుగా గోడ కనబడుతోంది. చైనీ సిపాయిల వికవికలులీలగా వినపడుతున్నయ్. టామీ మస్తిష్కంలో మెరిసి మాయమైంది. ఓ చెట్టుకొమ్మ గోడ మీదకు వాలి ఉండడం గమనించాను. గబగబా చెట్టు ఎక్కాను. నా చేతులో ఓరన్ రివాల్వర్ ఉంది. గోడ అందుకొని అవతలి వైపు దూకబోయాను. సరిగ్గా అదే సమయంలో ......

"విక్రాంత్!" అన్న గర్జన వినబడింది. అదిరిపడి వెనక్కి చూసాను.

'కమాండర్ జావేద్!' కళ్లల్లో నిప్పులు కురిపిస్తూ నిలబడ్డాడు. అతని చేతిలో రివాల్వర్ నల్లత్రాచులా మెరుస్తోంది.

"గెట్ డవున్ అండ్ డ్రాప్ ది వెపన్" అరిచాడు జావేద్.

మండే బొగ్గుల్లో నీళ్ళు కుమ్మరించి నట్లయింది నా పరిస్థితి. నా పని పూర్తయిన తర్వాత దొరికినా అంత బాధ పడకపోదును. సిగ్గుగా క్రిందకు దిగాను.

"విక్రాంత్! నువ్ క్వార్టర్ గార్డ్‌కు వెళ్తున్నావ్!" అన్నాడు జావేద్ కఠినంగా.

నా చేతిలోని ఆయుధాన్ని కమాండర్ కాళ్ల ముందుకు విసరాను.

"థాంక్ యు సర్!" అన్నాను అంటెంక్షన్‌లోకొచ్చి అదోలా నవ్వుతూ. కమాండర్ జావేద్ నాకేసి విచిత్రంగా చూసాడు.

"కమాండర్ సాబ్! మనిషిలో ఉండే కామక్రోధాలని అదుపులో పెట్టడం కష్టం అంటారు. దానికి 'వాతావరణం మార్పు' ఒక్కటే మంచిదని నా అభిప్రాయం. అందుకే కొన్నాళ్ళు జైలు జీవితం గడపడానికి సిద్ధంగా ఉన్నాను."

కమాండర్ నావైపు సానుభూతిగా చూసాడు. మరుక్షణం చెయ్యెత్తి ఏదో సైగ చేసాడు. ఇద్దరు మిలటరీ పోలీసులు చీకట్లోంచి బయటికి వచ్చారు. దగ్గర్లో జీప్ కదిలిన శబ్దం అయింది. కాట్రిడ్జ్ బెల్ట్ (తూటాలపట్టీ) విప్పి కమాండర్ చేతికిచ్చాను.

"అయామ్‌సారీ విక్రాంత్!" అన్నాడు నా భుజం మీద చేయివేసి జావేద్.

"ఫర్గెటిట్ సర్! మీ డ్యూటీ మీరు చేసారు. మఫ్టీలో ఉన్న జావేద్ ఎంత మంచివాడో నాకు, నా మిత్రులకే తెల్సు."

ఇద్దరు మిలటరీ పోలీసులు రెండు వైపులా, నా జబ్బలు పట్టుకొని జీప్ వైపు లాక్కెళ్లారు.

# 5

బలిపరా ఫ్రాంటియర్ ప్రాంతంలో ఉన్న మిలటరీ కోర్టులో నా కేసు విచారణ జరిగింది. మిలటరీ కోర్టు

చీఫ్ జస్టిస్, లెఫ్టినెంట్ జనరల్ ఇఫ్తేకర్ నా వాదనను ప్రశాంతంగా విన్నాడు.

అధికారధిక్కరణా నేరానికి నేను చెప్పిన సంజాయిషీ మానవతా దృష్టిలో ఆయనకు కొంత నచ్చింది. అయితే దొంగతనం క్షమించ రానిదిగా భావించేడు. అన్నీ విన్న తర్వాత కళ్ళజోడు సవరించుకొంటూ తన ముందున్న జడ్జిమెంటును చదివాడు.

అయిదేళ్ళ జైలుశిక్ష!

నేను ఊహించలేదు అంత! నెలల్లో ఉంటుందేమో అనుకున్నాను. గడ్డం రుద్దుకుంటూ, ఆలోచనలతో వాన్ వైపు నడిచాను. పదిహేను నిముషాల్లో వాన్ ఎత్తయిన గోడలతో నిర్మింపబడ్డ 'క్వార్టర్ గార్డ్' ముందాగింది.

జైల్లో ఫార్మాలిటీస్ అన్నీ ముగిసాయ్. నా దుస్తులు మారాయ్. చారల చొక్కా, చారల నిక్కరు. నన్ను 'సెల్' వైపు నడిపించాడు వార్డర్.

తాళం తెరవబడింది. తలుపు తెరుచుకుంది. లోపలికి అడుగు పెట్టాను.

"మిస్టర్ 222!" పిల్చాడు వార్డర్.
"ఎవర్ని?" అన్నాను కనుబొమ్మలు ముడిచి.
"నిన్నే!"
"నా పేరు విక్రాంత్!"

"మర్చిపో అది. చొక్కా జేబుమీద చూసుకో నీకివ్వబడిన నంబరుంటుంది. కుడిప్రక్క గోడ మీద నిబంధనల కాయితం అంటించబడి వుంటుంది. అవి చదువుకో. క్రమశిక్షణతో మెలగాలి." తలుపు దడాలున వేసి తాళం వేశాడు వార్డర్.

అతను కనుమరుగయ్యేంత వరకూ చూస్తూ నిలబడి పోయాను. సరిగ్గా అదే సమయంలో......

"స్వాగతం కొత్త స్నేహితుడుకి సుస్వాగతం" అన్న మాటలు వినబడ్డాయి బొంగురుగా.

త్రుళ్ళిపడి వెనక్కి తిరిగాను.

ఎదురుగా...గట్టుమీద ఓ స్థూలకాయుడు కూర్చొని ఉన్నాడు నవ్వుతూ. కింగ్ కాంగ్ నూ, సన్ ఆఫ్ ఆస్ట్రేలియాను మరపించేంతటి పెద్ద శరీరం అతనిది. మెడ అస్సలు కనబడ్డం లేదు. బట్టతల, చిలికి కళ్ళు, గాంభీర్యం ఉట్టిపడే ముఖం.

హాలీవుడ్ నటుడు 'బడ్ స్పెన్సర్' గుర్తుకొచ్చాడు నాకు. అతను నా జైల్ మేట్ అన్న మాట!

"ఇన్నాళ్ళూ, తోడు లేక చచ్చాను. ఇప్పుడు నాకెంతో ఆనందంగా ఉంది. నా పేరు సంగా!" అన్నాడతను చేయిచాస్తూ.

"నీలాగే నేను భావిస్తున్నాను భాయ్! అయామ్ విక్రాంత్!" అన్నాను చెయ్యి కలుపుతూ.

# 6

"నిజం చెబితే నమ్ముతావా? కొంచెం ఫాంటాస్టిక్ గా ఉంటుంది సంఘటన" అన్నాడు సంగా—చారల టోపీని తల మీద అమర్చుకొంటూ.

చిన్నగా నవ్వాను "చెప్పు" అన్నాను.

"టూవాంగ్ తెల్సుగా."

"టిబెట్ బార్డర్స్" అన్నాను వెనక్కి వాలి.

"కరెక్ట్. స్మగ్లర్స్ డెన్ లీడర్ గా పని చేసే వాడిని అక్కడ. జూలై రెండవ తేది అని జ్ఞాపకం. అర్ధరాత్రి

దాటి రెండు గంటలయి ఉంటుంది. మన సిపాయిల కను రెప్పలు కొద్దిగా మూతలు పడుతున్నాయ్. సరిహద్దు గాడ్ అవతల ఏదో చప్పుడయింది. రెండున్నర అడుగుల వెడల్పు, ఆరడుగుల పొడవుగల 'స్లిట్ ట్రెంచ్' లో కూర్చున్న నేను ఉలిక్కి పడ్డాను. గోడవైపు చూస్తూ కళ్ళు చిట్లించాను.

"నా అనుమానం నిజమయింది. ఓ చైనీస్ సైనికుడు గోడ దాటడానికి ప్రయత్నిస్తున్నాడు. వాడి తల కన బడుతోంది నాకు. నేను ఆలస్యం చెయ్యలేదు. ట్రెంచి లోంచి బయటికి వచ్చి పొదల చాటుగా చరచరా పాక్కుంటూ అటువైపు వెళ్లాను. వాడి చేతిలో ఉన్న ఆయుధం చూసి అదిరి పడ్డాను."

"అది టామీ గన్ (TOMMY GUN) నిమి షానికి 47 రౌండ్లు కాల్చవచ్చు. అందుకే అంత ధైర్యంగా బయలుదేరాడు. ఆ చైనీ గోడ యివతలగా పిల్లిలా దూకాడు. నేను చెట్టుచాటు నుంచి గెరిల్లా పద్ధతిలో మెరుపులా అతని మీదకు దూకాను. ప్రత్యర్థి మొలకున్న కత్తి లాక్కుని చేతిలో గుచ్చాను. 'కీక్' మని అరుస్తూ టామీగన్ వదిలేశాడు. అతని బుర్రని రెండు చేతుల్లోకీ తీసుకొని రాతి గోడకేసి కొబ్బరి కాయలా బాదాను. తల బీటలేసి సగం చచ్చాడు. వాడి శరీరాన్ని చంకలో యిరికించుకొని గోడమీద నిలబడ్డాను."

"వురేయ్! సౌర్భాగ్యులూ, గోడదాటడానికి ప్రయత్నించే ప్రతీ వెధవ__పనీ యింతే!" అని గట్టిగా అరుస్తూ చైనీ దేహాన్ని శత్రువుల మధ్యకు విసిరాను. వెళ్ళి వెళ్ళి ఓ షెల్ ప్రూఫ్ బంకర్ మీద పడ్డాడు సౌర్భా

గ్యడు. నడ్డి విరిగి ఉండాలి. పూ ర్తిగా చచ్చాడు అప్పుడు."

"అంతలో శత్రు సైన్యంలో హాలాహలం రేగింది. మొలకున్న స్మోక్ గ్రనేడ్‌ని చేతిలో తీసుకొని తుపుక్కున 'పిన్' లాగి అటువైపు విసిరాను. గోడ అవతల — అంతటా పసుపురంగు పొగలు చుట్టుముట్టాయి. చైనా తుపాకులు టకట్లా మోరిగాయి. భారతసైన్యం వాళ్ళ మధ్యకు ప్రవేశించిందేమోనని భ్రమపడి ఆ పొగల మధ్య వాళ్ళలో వాళ్ళే కాల్చుకుని చాలా మంది చచ్చారు. నేను తాపీగా గోడ దిగి నా స్థానంలోకి వచ్చేసాను. ఆ తర్వాత రెండు రోజుల వరకూ ఇరుపక్షాల మధ్యా పోరు తప్పలేదు. మన సైనికులు దాదాపు నలభై మంది మరణించారు." అంటూ ఆగాడు సంగా.

"కమాండర్ ఏమంటాడు?" అన్నాను, సంగావైపు మెచ్చుకోలుగా చూస్తూ.

"లీడర్‌ని అయిఉండీ నాకు బుద్ధిలేదట. లోపలికి ప్రవేశించిన 'చైనీ'ని కామ్‌గా చంపేసి - తన బారక్స్‌కి వచ్చి రిపోర్ట్ చేసి ఉండాల్సిందనీ, అనవసరంగా తిరగబడి శత్రువులను కవ్వించాననీ, క్రమశిక్షణా రహితంగా ప్రవర్తించాననీ..." ఆగి నవ్వాడు సంగా.

"ఆ తర్వాత?"

"యింకేముందీ, కథ కంచికీ, మనం జైలుకీ."

# 7

జైలుగంట గణగణ మ్రోగింది.

ఖైదీ లంతా చావడిలోకి వచ్చి 'క్యూ'లో నిలబడ్డారు. అందరి చేతుల్లోను, జర్మన్‌సిల్వర్ ప్లేట్‌లున్నాయి. గోడ

వారగా నిల్చొని ఇద్దరు క్వార్టర్ గార్డ్ సెర్వర్స్ వడ్డన చేస్తున్నారు. ఒకడు చపాతీ, మరొకడు కుర్మా. కుళాయి దగ్గర శుభ్రంగా కాళ్లు, చేతులు కడుక్కొని లైనులోకి వచ్చి సంగా వెనుక నిలబడ్డాను. క్యూ కదులుతూంది.

వడ్డన అయిపోయిన ఖైదీలు అక్కడక్కడా గుంపులు గుంపులుగా కూర్చొని చపాతీలు తింటున్నారు. సంగా వంతు వచ్చింది. చేయి చాపాడు సంగా. అతని చేతి లోని ప్లేట్లో రెండు చపాతీలు పడ్డాయి. సంగా కళ్ళు చిట్లించాడు.

"రెండు చపాతీలకి ఓ పేగు తడవదు. రోజూ నాలుగు వడ్డించేవారు. ఈ రోజేం పోయేకాలం వచ్చింది మీకు?" అన్నాడు కోపంగా.

"నోర్మూసుకొని తినవోయ్ లేకపోతే ప్రక్కకు కదులు. ఖైదీలు కూడా కబుర్లు చెప్పడమే" అన్నాడు ఖాకీ నిక్కరు ధరించిన సర్వర్ విసుగ్గా. సంగా చేతిని చాపి చపాతీ ప్లేట్ ని అతని ముఖానికి ఆనించాడు.

"జలీల్ కా బచ్చే! మేం మామూలు ఖైదీలు కాదురా! మాలో ఆవేశం ఎక్కువైపోతే కొంతకాలం రెస్ట్ తీసుకో మని పంపారు అధికారులు. మర్యాదగా ప్లేట్లో నాలుగు చపాతీలు పెట్టి నా చేతికియ్యి."

"గౌరవంగా మాట్లాడవోయ్!" అన్నాడు సెర్వర్ ధైర్యం చిక్కబట్టుకొంటూ.

"గౌరవం వన్ వే ట్రాఫిక్ కాదురా చిడియా! ఇచ్చి పుచ్చుకోవాలి. తలమీద కొడితే భూమిలోకి దిగబడ తావ్! నే చెప్పిన పని చెయ్యి."

"అనవసరంగా గొడవ చేసావంటే డిసిప్లిన్ ఆఫీసర్ కి రిపోర్టు చేస్తాను."

ఆ మాటలతో సంగా రెచ్చిపోయాడు. అతని కాలర్ పుచ్చుకొని గాల్లోకి లేపాడు.

"అరేయ్ ఉల్లూ! నేనూ రిపోర్టు చేస్తా_నా వెల్ఫేర్ ఆఫీసర్కి. ఖైదీల సంక్షేమం బావుండకపోతే క్రమశిక్షణ ఎలా ఉంటుందిరా అరామ్ జాదే! మిలిటరీ జైళ్ళకి సహితం పాకిపోయిన ఈ అవినీతిని సహించను. ఖైదీల్లో ఆందోళన తీసుకొచ్చి అవసరమైతే "కల్నల్" దృష్టికి తీసుకువస్తాను. మా శిక్షాకాలం పూర్తయిన తర్వాత మేం మళ్ళీ ఆర్మీలో పని చేయాలని మర్చిపోకు. మాకు తిండి తగ్గించడానికి ఎవడికీ అధికారం లేదు." అంటూ సెర్వర్ని బల్లమీద కుదేసి - చకచకా తన ప్లేట్లో నాలుగు చపాతీలు వేసుకొని ప్రక్కకి కదిలాడు సంగా. కుర్మావాడు సంగాకి నవ్వుతూ వడ్డించాడు వద్దనేంత వరకూ. తర్వాత నా ప్లేట్లో నాలుగు చపాతీలు పడ్డాయ్.

# 8

సిల్చార్
10 ఆగస్టు'75

ప్రియమైన విక్రాంత్ బావకు,

నువ్వు మీ యింట్లో కోపగించి వెళ్ళిపోయి మిలట్రీలో చేరిన తర్వాత అక్క రేష్మాకు ఒక్క ఉత్తరం కూడా వ్రాయలేదు. ప్రస్తుతం మా పరిస్థితి ఏం బావులేదు. అక్క టైలరింగ్ మానివేశింది. ఆమెకు టైఫాయిడ్ తగిలి ప్రాణాపాయ స్థితిలో ఉంది. ముఖ్యంగా నీమీద బెంగవల్ల చిక్కి శల్యమైంది. నువ్వు గాఢంగా ప్రేమించి, పెళ్ళి చేసుకుంటానని మాట యిచ్చిన__అక్క ఈ స్థితిలోకి రావడానికి సగం కారణం నువ్వేనని చెప్పడానికి సాహ

సిస్తున్నాను. పరిస్థితుల ప్రభావంవల్ల నేను స్కూలుకి వెళ్ళడం మానివేశాను. నువ్వు ఉన్నప్పుడు ఊరంతా నీకు భయపడేది. మగ దిక్కు లేని మమ్మల్ని ఊళ్ళోవాళ్ళంతా వెలివేసినట్లు చూస్తున్నారు.

టెలిగ్రాం ఇచ్చే తాహతు లేక కవరు వ్రాస్తున్నాను. చివరిసారిగా నిన్ను చూడాలని అక్క కలవరిస్తోంది. వెంటనే రాగలవని నమ్ముతాను. మిగతా వివరాలు సన్నిధిలో.

నీ ప్రియమైన చిట్టి మరదలు,
సాల్మా.

పోస్టులో వచ్చిన ఉత్తరం చదివిన నా చేతులు గడ గడ వణికాయి. అది బి. ఎస్. ఎఫ్. నుండి రీడైరెక్ట్ అయి వచ్చిన ఉత్తరం. నా కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. ఉత్తరాన్ని ముఖానికి అదుముకుంటూ 'రేష్మా' ... అన్నాను అప్రయత్నంగా.

"ఎక్కడ్నించి భాయ్?" అన్నాడు సంగా కంగారుగా. ఉత్తరాన్ని మౌనంగా అతని చేతి కిచ్చాను. "చదువ్! తెలుస్తుంది" అలసటగా కళ్ళు మూసుకుని ఆలోచనల్లో పడ్డాను.

లేఖను చదివిన తర్వాత "విక్రాంత్! నువ్వు చాల అవివేకమైన పనిచేశావ్" అన్నాడు సంగా గంభీరంగా.

"సంగా! నువ్వు నా గురించి కొన్ని విషయాలు తెలుసుకోవాలి. నేను బి. ఏ. పూర్తి చేసిన తర్వాత ఉద్యోగం కోసం ఎడారిలో మంచి నీటిలా కాళ్ళరిగేట్టు తిరిగాను. నా ప్రయత్నాలు ఫలించలేదు. పైసా సంపాదన లేని నాతో, నా తల్లిదండ్రులు ప్రతీ విషయంలోను పుల్లవిరు

పుగా మాట్లాడేవారు. చిల్లరడబ్బులు అడగడానిక్కూడా సిగ్గు వేసేది. తెగించి అడిగితే 'జల్సాగా తిరగడానిక్కి డబ్బు లెక్కడివి? ఇంట్లో ఉండేది ఇంత తిని కడుపులో కాళ్ళు పెట్టుకొని పడుకో' అనేవారు.

"సంగా! దారిద్ర్యం బంధాల్ని సైతం తెంచుతుందని చాల ఆలస్యంగా తెల్సుకొన్నాను. చిన్నప్పట్నించీ, 'కేర్ ఫ్రీ'గా జీవించిన నేను వాళ్ళ మాటలకి తట్టుకోలేక పోయేవాడిని. నువ్వే చెప్పు భాయ్!

ఆ పరిస్థితుల్లో ప్రేమించిన రేష్మాను పెళ్ళి చేసుకుంటానని తల్లిదండ్రులతో ఎలా చెప్పగలను? ఓ రాత్రి ఎవరితోను చెప్పకుండా ఊరు విడిచిపెట్టి మిలిటరీలో చేరాను. మిలిటరీలో చేరిన తర్వాత దాదాపు ఇంటి విషయాలు మర్చిపోయాను. మొదట్లో మాత్రం, నా ఉనికిని తెలియ పరుస్తూ ఇంటికి వ్రాశాను. అక్కడ్నించి నో రిప్లయ్."

"రేష్మాకు అన్యాయం జరిగింది. మా ఊళ్ళో వ్యక్తులు అంత మంచివాళ్ళు కాదు భాయ్! ఒంటరిగా రేష్మా ఇన్నాళ్ళూ ఎలా గడిపిందో వూహించుకొంటే నా ఒళ్ళు జలదరిస్తోంది."

సంగా సానుభూతిగా నా వేపు చూసాడు. "విక్రాంత్! ఆడవాళ్ళు నిండుకుండలు. ఎంతటి దుఃఖాన్నైనా దిగ మ్రింగి దాచుకోగల శక్తి మన భారత స్త్రీలకు ఉంది. జరిగిందాన్ని విచారించి లాభంలేదు. పరిష్కారం ఆలోచించాలి."

"మనం డ్యూటీలో వున్నప్పుడే శలవు దొరకడం కష్టం. పైగా ఇప్పుడు ఖైదీగా వున్నావ్. అధికార యుతంగా నీకు స్వేచ్ఛ లభించడం ఇంపాసిబుల్."

"సంగా! నీ సహాయం నాకు కావాలి. నేను జైలునించి పారిపోయి నా 'రేష్మా'ను........"

బయట బూట్లచప్పుడు వినబడ్డంతో చటుక్కున నా నోరు మూశాడు సంగా.

"ఏమిటా గుసగుసలు? టైమయింది. పడుకోండి." హెచ్చరించాడు గార్డు.

'రేపు మాట్లాడుకుందాం' అన్నట్లు సైగ చేసాడు సంగా. అరచేతుల్లో తల పెట్టుకుని వెనక్కి వాలాను. బయట "గార్డు హోషియార్!" అన్న కేకలు వినబడు తున్నాయి. ఆ రాత్రి నిద్ర పట్టలేదు నాకు.

## 9

"విక్రాంత్! ఇదేం సినిమా కాదు జైల్లోంచి అంత సులువుగా తప్పించుకోడానికి. దశ బాగా లేక దొరికా వంటే తక్కువ శిక్షతో తేల్చే డిపార్టుమెంటు కాదు మనది. క్వార్టర్ గార్డులో పని చేసే సెంట్రీల చెవులు చీమ చిటికలను కూడా వింటాయి. వాళ్ళవి పాము చెవులు. పైగా మన జైలుగోడలు తాటిచెట్టంత ఎత్తున్నాయ్ అన్న విషయం మరువకు. తీరా కాళ్ళు విరిగితే సిలాటిఖ్ వరకూ పాక్కుంటూ వెళ్ళలేవ్" అన్నాడు సంగా సీరియస్‌గా.

చిన్నగా నవ్వాను. "సంగా! నువ్వే ఏదో ఆలోచించాలి. సిపాయివృత్తిలో పని చేసేవాడికి వర్తమానమే ప్రధానం. రేష్మాను కల్సుకున్న తరువాత నా ప్రాణం ఏమైనా ఫర్వాలేదు, అయ్ కేన్ స్పేర్"... ... అన్నాను మండుతున్న కళ్ళమీద తడిగుడ్డ పెట్టుకుంటూ.

రెండు నిముషాలు మామధ్య నిశ్శబ్దం తాండవించింది. సన్నగా ఈల వేశాడు సంగా. "విక్రాంత్! అయిడియా" అర్చాడు దాదాపు.

"ఏమిటి?" అన్నాను ఆత్రంగా కళ్ళ మీద గుడ్డ తొలగించి.

"ఇందాకేం చెప్పాను?"

"ఇదేం సినిమా కాదు, జైల్లోంచి అంత సులువుగా తప్పించుకోడాని కి......"

"స్టాప్ దేర్! రేపెన్నో తారీఖు?"

"15."

"నెల?"

"ఆగస్టు."

సంగా చిటిక వేశాడు. "ఆగస్టు 15 స్వాతంత్ర్య దినోత్సవం కదూ! రైట్ విను. మన ఖైదీలకు జింఖానా మైదానంలో రేపు రాత్రి దేశభక్తిని ప్రబోధించే ఓ సినిమా చూపిస్తారు. అప్పుడే తప్పించుకో బోతున్నావ్ నువ్వు. ఆఫీసర్లంతా వేడుకలతో హడావుడిగా వుంటారు."

"సంగా! ఒళ్ళున్న వాళ్ళకి బుర్ర వుండదని అంటూం టారు మన పెద్దలు. నిన్ను చూసిన తర్వాత అలా అన్న వాళ్ళకే బుర్ర లేదనిపిస్తోంది" అన్నాను సంగాకేసి ఆప్యా యంగా చూస్తూ.

"చాల్లేయిక. నా ప్లాన్ పూర్తిగా విను" అంటూ ఏదో చెప్పసాగాడు సంగా.

# 10

జైలు అధికారులంతా ఆ రోజు స్వాతంత్ర దినోత్సవ వేడుకలతో హుషారుగా తిరుగుతున్నారు.

జింఖానా గ్రౌండ్ కిటకిటలాడుతోంది.

సాయంకాల సమావేశం పూర్తయిన తర్వాత ఆనం దంతో 'డోంగ్రా' నృత్యాలు చేసారు ఖైదీలు. అర్కికి

సంబంధించిన ఖైదీలు గావటంవల్ల అందరికీ షరాబీ, సిగరెట్లు సప్లయి చెయ్యబడ్డాయి.

చీకటి పడింది. లైట్లు ఆర్పేశారు. జింఖానా మైదానంలో 16 ఎమ్. ఎమ్. స్క్రీన్ మీద 'హిందుస్తాన్ కి కసమ్' చిత్రం ప్రదర్శింపబడుతోంది. సంగా సలహా మీద ఆరోజంతా 'ఉత్సాహం' నటించాను. గ్రౌండ్ చుట్టూ సిగరెట్లు పీలుస్తూ గార్డులు కాపలా కాస్తున్నారు. సంగా ప్రక్కనే అన్యమనస్కంగా సినిమా చూస్తున్నాను సమయంకోసం వేచి చూస్తూ.

అంతలో సంగా దడాలున పైకి లేస్తూ "పాము... పాము......" అంటూ అరిచాడు. సినిమాలో లీనమైన ఖైదీలంతా అదిరిపడి పైకిలేచారు.

"అవును. నా ప్రక్కనుంచి ఏదో జరజరాప్రాకింది" అన్నారు ఎవరో.

"కట్లపాము మూడడుగుల పొడవుంది. కట్లు లెక్కపెట్టలేదు" గొంతుమార్చి అర్చాడు సంగా, గందరగోళం సృష్టిస్తూ.

ఖైదీలలో సంచలనం రేగింది.

"విక్రాంత్! మరో పదిహేను రోజుల్లో నా జైలు జీవితం ముగుస్తుంది. ఏసహాయం కావాల్సివచ్చినా ఉత్తరం వ్రాయి." అన్నాడు నెమ్మదిగా సంగా.

ఫెన్సింగ్ కి అడ్డంగా అందరూ పరిగెడుతున్నారు. జనం నిలబడిపోవడంవల్ల స్క్రీన్ మీద సినిమా బదులు నీడలు ఆడుతున్నాయి.

పాము ... పాము ... అన్న కేకలతో అందరూ కమ్ముకుంటున్నారు.

అయోమయంగా చూస్తూ నిలబడ్డ నా డొక్కలో మోచేత్తో పొడిచాడు సంగా. "అరే బుద్ధూ! జల్దీ భాగ్ జావ్!" గొణిగాడు చెవిలో. కాపలా కాస్తున్న సిపాయిలు సిగరెట్లు బూటుకాలి క్రింద నలిపి "ఏమిటి? ఏమైంది?" అంటూ కంగారుగా అటూఇటూ కదిలారు.

సంగాని ఆప్యాయంగా రెండు క్షణాలపాటు కౌగలించుకొని, చటుక్కున వదిలేశాను. అడ్డువచ్చిన వాళ్లని త్రోసుకుంటూ తారాజువ్వలా బయటకి దూసుకుపోయాను.

"లైట్స్ ఆన్ ఇడియట్!" ఎవరో అరిచారు. లైట్లు వెలిగాయి. గ్రౌండ్ అంతా కాంతితో నిండిపోడం నా కనుసన్నల్లోంచి గమనించాను. చెట్లమధ్య పల్లంవైపుగా పరిగెడుతూ రోడ్ వైపు తిరిగాను.

"ఎవరో పారిపోతున్నారు! పట్టుకోండి!" అన్న కేకలు లీలగా వినిపించసాగాయి.

అదృష్టం నావైపు ఉంది. కొద్ది దూరంలో వేగంగా వస్తున్న ఓ బస్ కనబడింది. టర్నింగ్ రావడంవల్ల బస్ స్లోగా తిరుగుతోంది, నెలలు నిండిన గర్భిణిలా. చటుక్కున ఎగిరి బస్ వెనుక ఉన్న నిచ్చెన అందుకొన్నాను. బస్ వేగం పుంజుకొంది. గాలి చెంపల మీదుగా పరిగెడుతోంది. నిచ్చెనకున్న మెట్లని గట్టిగా పట్టుకొంటూ చకచకా టాప్ మీదకు ఎక్కాను.

రోడ్ చీకటిగా ఉండడం వల్ల డ్రైవర్ బస్సులోని లైట్లు ఆర్పేసి హెడ్ లైట్ల కాంతిలో వేగంగా పోనిస్తున్నాడు. బస్ టాప్ మీద గోధుమ బస్తాలు, యాపిల్ పళ్ళ బుట్టలు, గుట్టలుగా ఉన్నాయి.

ఆరు అగ్గిపుల్లలు వృధా అయిన తర్వాత ఓ సిగరెట్ ముట్టించి వెల్లకిలా పడుకున్నాను. ఆకాశంలో అర్ధ

చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. నక్షత్రాలు మెరుస్తున్నాయ్.

బుట్టలోంచి ఓ యాపిల్ పండు తీసి కొరుకుతూ ఆలోచించ సాగాను. నేను పారిపోయిన విషయం అయిదు నిముషాల్లో అధికారులకు తెల్సిపోతుంది. నా జాతకం అంతా ఆఫీస్ రికార్డ్సులో ఉంటుంది. మరో అరగంటలో అన్ని పోలీస్ స్టేషన్లకూ, నా గూర్చి వార్తలు చేరుకుంటాయ్. మరుక్షణం అస్సాం అంతా నా కోసం గాలింపు ప్రారంభమవుతుంది.

చిన్నగా నవ్వుకున్నాను. నా ప్రియమైన రేష్మాను చూడబోయే శుభసందర్భంలో ఈ ప్రమాదా లెంత?

బస్ సడన్ బ్రేక్‌తో పెద్ద కుదుపు ఇచ్చి ఆగింది. ఆలోచనల్లోంచి ఉలిక్కిపడి టాప్ మీదుగా క్రిందకు చూసాను. నా గుండెలు దడదడలాడాయి. సిగరెట్ చటుక్కున ఆర్పేశాను.

"మైగాడ్! హౌక్విక్ దె ఆర్..." సన్నగా గొణుక్కున్నాను. రోడ్ వారగా ఓ జీప్ ఆగి ఉంది. ఓ ఇన్‌స్పెక్టర్, ఇద్దరు సాయుధులైన పోలీసులు డ్రైవర్ వద్దకు వస్తున్నారు. తల లోపలికి తీసుకొని చెవులో రిక్కించాను.

"డ్రయివర్! బస్సు చెక్ చేయాలి!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ దర్పంగా, లాఠి బస్ మీద కొడుతూ.

"సార్! నేను దొంగ రవాణా చేయడం లేదు." డ్రైవర్ కంఠం వొణికింది. "అదికాదు. మిలటరీ జైల్లోంచి ఓ వ్యక్తి పారిపోయాడు. బలిపరు ప్రాంతాల్లో గళ్ళ దుస్తుల్లో ఉన్న వ్యక్తి, ఎవరైనా నీ బస్సు ఆపాడా?"

"నోయి నెసర్" కంఠం మారింది. బహుశా కండక్టర్ జవాబు ఇచ్చి ఉండాలి. "ముందు బస్సులో లైటు వెయ్యి."

దీపాలు వెలిగించబడ్డాయి. ఊపిరి బిగపట్టాను.

"త్రీనాట్ త్రీ, ఫోర్ డబుల్ వన్. ఒకరు బస్సులోను, మరొకరు టాప్ మీదా చెక్ చేయండి."

నా గుండెలు అలిసిపోయాయి. "మైగాడ్ ఇప్పుడెలా? నా ఒళ్ళు చమటలు పడుతోంది. టాక్సీమీదకు కానిస్టేబుల్ వస్తాడు! నన్ను చూస్తాడు! ఇంత శ్రమా వృథా గావల్సిందేనా?

నిచ్చెనమీద బూట్ల చప్పుడవుతోంది. నా మెదడులో ఏదో మెరుపు మెరిసింది. గోధుమ బస్తాలని జరిపి, చటుక్కున వాటికింద మూలగా కూర్చొన్నాను. బూట్ల చప్పుడు దగ్గరయింది. బస్తాలమధ్య ఏర్పడ్డ ఖాళీ గుండా చూడసాగాను. కానిస్టేబుల్ చేతిలో బాయినెట్ ఉన్న రైఫిల్ ఉంది. అతను దగ్గరయ్యాడు. చూడ్డం మంచిది కాదు. తలత్రిప్పుకున్నాను. కస కసా చప్పుడవుతోంది. కానిస్టేబుల్ బాయినెట్‌తో పొడిచి, పొడిచి చూస్తున్నాడన్నమాట!

నా గుండె వేగంగా కొట్టుకొంటోంది. నేను భయపడినంతా అయింది. బాయినెట్ సర్రున లోపలికి దూసుకు వచ్చి నా భుజంలో దిగింది. గునపం దిగనట్లైంది. "అ...బ్బా!" అనబోయి నోరు చటుక్కున ఎడంచేతో మూసుకున్నాను. ఊపిరి బిగపట్టాను. బాయినెట్ పైకి లేచింది.

"ఇదర్ నైసాబ్" బస్సు లోపల్నుంచి వినబడింది.

"ఇదర్ భీసాబ్" అంటూ కానిస్టేబుల్ జేబులో రెండు ఆపిల్స్ కుక్కుకొని నిచ్చెనవైపు నడిచాడు. రెండు నిముషాలైంది.

"డ్రయివర్! గళ్ళ దుస్తుల్లో ఎవరైనా వ్యక్తి కనబడితే తక్షణం దగ్గర్లో ఉన్న పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చెయ్యి అండర్‌స్టాండ్?"

"అలాగే సర్!" అన్నాడు డ్రైవర్ క్లచ్ నొక్క బోతూ. అంతలో ఓ కానిస్టేబుల్ పొలికేక వేశాడు. "సార్! నా రైఫిల్ బాయినెట్‌కి రక్తపు మరకలు ఉన్నాయి, అంటే ఆ బస్సు టాప్ మీద......"

"ఫుల్స్! ఇడియట్స్! అంతా టాప్ ఎక్కండి. నేను వస్తా!" ఎవరో ఫెళ్ళున కొట్టినట్టైంది నాకు. ఆ మాటలు విని సగం చచ్చిపోయాను. అదృష్టదేవత మా మధ్య ఫుట్‌బాల్ ఆడుతోంది. చేయవల్సింది ఆలోచించాను. టకటకా బూట్ల శబ్దం వినబడుతోంది......నా శరీరం కంపిస్తోంది...బస్తాల చాటునుంచి ఓసారి క్రిందకు చూసి చటుక్కున నేలమీదికి జంప్ చేసాను. రోడ్ వారగా ఉన్న పోలీస్ జీప్ వైపు పరిగెత్తాను...ఇంకా వాళ్ళు నన్ను చూడలేదు. క్షణాల్లో స్టేరింగ్ ముందు కూర్చున్నాను క్లచ్ నొక్కి ఫస్టుగేర్ వేయబోయాను. బర్...బర్ మంటూ నీరసంగా మొరుగుతోంది ఇంజన్. స్టార్టు కాలేదు.

మైగాడ్! బాటరీ డౌన్!

"అదిగో జీప్ ఎక్కాడు రైఫిల్ ఎయిమ్ చేయండి" ఇంజన్ శబ్దం వినబడి రివాల్వర్ చేతిలోకి తీసుకుంటూ అరిచాడు ఇన్‌స్పెక్టర్.

అతని మాటల వెనుకే ఓ బులెట్ దూసుకువచ్చి, అద్దానికి తగిలి భళ్ళుమంది. చటుక్కున తలవంచుకొని జీపులోంచి క్రిందకు దూకాను.

ధన్...ధన్...గుళ్లు నా చెవి ప్రక్కగా దూసుకు పోతున్నాయి. కుడిచేతి గాయాన్ని ఎడమచేత్తో అదిమి

పట్టి, పాములా వంకర టింకరగా పరిగెడుతూ రోడ్ వారగా పల్లంలో ఉన్న చెట్లలో కలిసిపోయాను.

# 11

ఆలోచిస్తూ రోడ్ మీద నడుస్తున్నాను. బూట్లకు అలవాటు పడ్డ పాదాలు నగ్నంగా ఉండటంవల్ల వేగంగా నడవలేక పోతున్నాను. ఏదో గుచ్చుకున్నట్లు వుంటోంది. చొక్కా చింపి గాయపడ్డ కుడిభుజానికి తాత్కాలికంగా కట్టుకట్టాను. అయితే చెయ్యి కదిలినప్పుడల్లా నొప్పి పుడుతోంది.

ఊరవతల ప్రాంతం కావడంవల్ల రోడ్డు నిర్మానుష్యంగా ఉంది. అందుకే జైలు దుస్తులతో ఉన్నా ధైర్యంచేసి నడవ గలుగుతున్నాను. ఈ బట్టలతో ప్రయాణం కొన సాగించడం డేంజర్! డ్రస్ సంపాదించే పద్ధతి గురించి ఆలోచించసాగాను.

అంతలో దూరంగా 'కయ్'మంటూ సైరన్ మోత వినబడింది. ఉలిక్కిపడి వెనక్కి తిరిగాను.

మైగాడ్! మళ్ళీ ఆపద! అది పెట్రోల్ వాన్. తేజ్‌పూర్ వైపు వెళుతోంది. వాళ్ళు నన్ను గమనిస్తే నాదేహం సిల్హూట్ వెళ్ళదు. వాన్ 'యు' టర్నింగ్‌కి దగ్గరపడుతోంది.

దాక్కుందా మంటే అటూ ఇటూ చెట్లులేవు. అటూ ఇటూ అయోమయంగా చూసాను... నాదృష్టి రోడ్ వారగా నున్న డ్రైనేజి నాకర్షించింది. గబగబా అందులోకి దూకాను. ఆకాలువకి పూర్తి కవరింగ్ లేదు. అక్కడక్కడా సిమ్మెంట్ బ్లాక్స్ ఉన్నాయి. కాలువ విపరీతమైన దుర్గంధంవేస్తోంది. నోటితో పీల్చి, ముక్కుతో

వదలవలసివస్తోంది గాలి.తప్పదు. కాలువ ఓపెన్ గా ఉన్న చోట నిలబడితే వాన్ హెడ్ లైట్ల కాంతి నామీద పడే అవకాశం వుంది.

నాలుగడుగులు ముందుకు వేసి ఓ సిమెంట్ స్లాబ్ క్రింద నడుం వంచి నిల్చున్నాను. శబ్దం దగ్గరయింది. పెట్రోల్ వాన్ కాలువ ప్రక్కగా దూసుకుంటూ వెళ్ళి టక్కున ఓచోట ఆగింది.

నాలో అనుమానం రేకెత్తింది. వాన్ ఎందుకు ఆగింది? నా ఉనికి తెలిసిపోయిందా? కాలువలోకి దిగుతున్నప్పుడు వాళ్ళ కంటబడి ఉంటానా?

ఓ ప్రక్క నడుం నొప్పి పుడుతోంది. కాళ్ళు కదప కూడదు. నీటి శబ్దం అవుతుంది!

బూట్లశబ్దాన్ని బట్టి ఓ కానిస్టేబుల్ దిగి ఉంటాడని అనుకున్నాను. బూట్ల చప్పుడు నాకు కొంచెం ముందుగా ఉన్న స్లాబ్ దగ్గర అంతమయింది.

ఊపిరి బిగపట్టాను. గుండె కొట్టుకుంటున్న శబ్దం బయటకి వినపడుతుందేమోనని భయంగా ఉంది.

"ఎవరక్కడ? పైకిలెండి" చీకట్లో కర్కశంగా విన బడింది కానిస్టేబుల్ కంఠం. అతను బాయినెట్ ముందుకు గుచ్చుతున్నాడు. రెండు నిమిషాలు తన ప్రయత్నం కొన సాగించాడు.

అంతే; కాలువలోంచి 'దబ్'న శబ్దం చేస్తూ లేచింది ఓ నల్లటి ఆకారం. రోడ్ కడ్డంగా పరిగెత్తింది ఘీర్కిస్తూ.

అది పంది!

'థాంక్ గాడ్!' అనుకుంటూ దుర్గంధాన్ని ఉడుకు లాంలా పీల్చాను.

సిగ్గుపడిపోయాడు కానిస్టేబుల్. "ఎవడో కాలువలో

దూకాడన్నవ్! ఫూల్! త్వరగా వాన్ ఎక్కు. పందుల్ని తర్వాత వేటాడుదువ్ గాని!'' వాన్‌లోంచి వినబడిందో కంఠం.

''క్షమాకాజియేసాబ్!'' బూట్లశబ్దం దూరమయింది. బర్ మంటూ స్టార్టయి వెళ్ళిపోయింది వాన్.

మెల్లిగా బయటికి వచ్చి మళ్ళీ నడక సాగించాను వూరివేపు.

కాలికేదో గుచ్చుకున్నట్లనిపించడంతో వంగిచూసాను. ఏదో నల్లగా కనబడింది. చేత్తో తడిమాను ఇసుకలో. అది తుప్పు పట్టినకత్తి! దాన్ని చేతిలోకి తీసుకొని నాలుగు వేపులా పరికించాను. అక్కడక్కడా విసిరి వేయబడ్డట్టు ఉన్నాయి ఇళ్ళు. దుస్తులు మార్చుకోవాల్సిన అగత్యాన్ని దృష్టిలో పెట్టుకుంటూ ఓ యింటి పిట్టగోడ ఎక్కి చటుక్కున లోపలికి దూకాను. కిటికీలోంచి చూసాను. ఓ యువకుడు టేబుల్ లైట్ ముందు కూర్చొని ఏదో రాసుకొంటున్నాడు. ఇంటి ముందుకు వచ్చి తలుపు తట్టాను. రెండు నిముషాల తర్వాత తలుపు తెరవబడింది.

''ఎవరు?'' అన్నాడా వ్యక్తి. కత్తి అతని కంఠం ముందుంచాను. ''మిస్టర్! ఇది తుప్పు పట్టిన కత్తి సెప్టిక్ అవుతుంది. నాకు బట్టలు కావాలి.''

ఆ యువకుడు ఓక్షణం కంగారుపడి సర్దుకున్నాడు. ''నా పేరు గంగులీ. రచయితని. లోపలకి రండి బట్టలు తప్పించి మీ ముఖం చూస్తే మీరు దొంగ అనిపించడం లేదు.''

ఇద్దరం లోపలకి నడిచాం.

''మిస్టర్ గంగూలీ. మీదగ్గర ఫస్ట్‌ఎయిడ్ సామగ్రి ఉందా?''

"లేదు" ఎందుకన్నట్లు చూసాడు గంగూలీ.

"పోనీ. బ్రాందీ?"

పగలబడి నవ్వాడు గంగూలీ. "ఎందుకు కోరిక పుట్టిందా?"

కత్తి గంగూలీ మెడమీద నొక్కాను.

"మిస్టర్ గంగూలీ! నేనడిగింది ప్రశ్న. నాక్కావల్సింది జవాబు" అన్నాను కఠినంగా.

"టేబుల్ మీద ఉంది."

చకచకా అటువైపు నడిచాను. సగం ఖాళీ అయిన బ్రాందీ బాటిల్ ఉంది, దాని ప్రక్కగా వేట్ 69, బర్బన్స్ ఆన్ ది రాక్ విస్కీలున్నాయి.

భుజానికి ఉన్న గుడ్డను జాగ్రత్తగా విప్పి గాయం మీద బ్రాందీ పోసాను. భగ్గన మండింది గాయం. తప్పదు అదే మందు.

"మిస్టర్......"ఆగిపోయాడు గంగూలీ.

"విక్రాంత్" అన్నాను పళ్ళు బిగపట్టి బాధనోర్చుకుంటూ.

"నేను డ్రెస్సింగ్ చేస్తాను" అంటూ పొడిగుడ్డ ఒకటి తెచ్చి భుజానిక్కి చుట్టాడు గంగూలీ.

"మిస్టర్ గంగూలీ! పుండుమీద కారం అద్దినట్టుగా ఉంది. విస్కీ త్రాగుతాను. బాధ మర్చిపోవాలి." అన్నాను కుర్చీలో విశ్రాంతిగా కూలబడుతూ.

"మీ కడుపు - లోపలికి పోయింది. ఖాళీ పొట్టలోకి హాట్ డ్రింక్ వెళ్ళ కూడదు. లోపల స్టఫ్ ఉంది ఫలూడా పిచ్ మల్ బా, పీనట్, కాష్యూనట్స్........."

"వెళ్ళండి. త్వరగా రావాలి."

గంగూలీ వెళ్ళి రెండు నిముషాలయింది. విసుగ్గా కుర్చీ లోంచి పైకిలేచి గంగూలీ వెళ్ళిన రూమ్ వైపు నడిచాను. తలుపు సన్నగా తెరిచి లోపలకి చూసాను. గంగూలీ ఫోన్‌లో ఎవరితోనో మాట్లాడుతున్నాడు. నా కను బొమ్మలు ముడిపడ్డాయ్.

"ఎస్సార్! అతని పేరు విక్రాంత్ అట. జైలు దుస్తుల్లో ఉన్నాడు. ఆఁఇక్కడే. మీరు త్వరగా రావాలి..."

తలుపులు దడాలున తెరిచాను. "మిస్టర్ గంగూలీ! నమ్మకద్రోహం చేసావ్! నమక్ హరామ్" అన్నాను పళ్ళు నూరుతూ.

"నన్ను చంపక" అన్నాడు గంగూలీ భయంగా, చేతులు ఆడిస్తూ.

"ఛీ...నీలాంటి పిరికి పందని చంపడానికి ఈ తుప్పు పట్టిన కత్తి కూడా సిగ్గు పడుతుంది," గంగూలీని వెనక్కి తోసి చకచక ఫోన్ తీగలు కట్ చేసాను. వెంటనే బయటికి వచ్చి తలుపు గడియపెట్టాను. గంగూలీ లోపల అరుస్తున్నాడు. తలుపు బాదుతున్నాడు.

టేబుల్ వద్దకు నడిచి 'బర్బన్స్ ఆన్ ది రాక్' బాటిల్‌ని చేతిలోకి తీసుకొని గడగడా త్రాగాను. రేసు గుర్రాలుతాగే 'రమ్' కలవాటుపడ్డ నా నోటికి ఆ ఖరీదైన విస్కీ అమృతంలా తోచింది. తలదిమ్మెక్కి హాయిగా ఉంది. భుజం దగ్గరనొప్పి తెలియడంలేదు.

డ్రెస్సింగ్ రూమ్‌లోకి వెళ్ళి వార్డ్‌రోబ్ తెరిచాను. హాంగర్స్‌కి కొన్ని బట్టలు తగిలించిఉన్నాయ్. చకచకా నా బట్టలు విడిచి—వాటిలోంచి ఓ ఇటుక రంగు సఫారీ సూట్ సెలెక్షన్ చేసుకొన్నాను. క్షణంలో నా దుస్తులు మారాయి.

షెల్ఫ్‌లో వెంకటేశ్వరస్వామి ఫోటో ఉంది. వెంకటేశ్వరస్వామి కాళ్లదగ్గర ఓ లావైన పర్సు ఉంది. దేవుడికి నమస్కరించి ఆపర్సు జేబులో పెట్టుకొన్నాను. జేబులోకి వెళ్లిన చెయ్యి ఓ తాళం చెవితో బయటికి వచ్చింది.

ఆశ్చర్యంగా దానివైపు చూసాను. అది మోటర్ సైకిల్ తాళం. గబగబ డ్రస్సింగ్ రూం వదిలి బయటికి వచ్చాను.

## 12

ఉదయం పది గంటలయింది.

వర్షం కుండ పోతగా పడుతోంది. రోడ్ మీద అంత జన సంచారం లేదు. తేజ్ పూర్ రోడ్లు మోకాలి లోతులో మునిగి ఉన్నాయి.

"జావా" నీటిని చీల్చుకుంటూ పరిగెడుతోంది. నా బట్టలు తడిసిపోయాయి. పెదాలు వణుకుతున్నాయ్. ఫ్రెంట్ వీల్ కుదుపుకి హాండిల్ బార్ మీద నా పట్టు సడలుతోంది అప్పుడప్పుడు. టర్నింగ్ కోసి జావాని బ్రహ్మపుత్రా నది ఒడ్డున పోనిచ్చాను.

నదికి అవతల ఉన్నది నా స్వస్థలమైన సిల్ఘాట్ గ్రామం. నది దాటాలంటే ఫెర్రీ పడవమీద వెళ్ళాలి. భారీవర్షాల వల్ల ఫెర్రీలు కాన్సిల్ చెయ్యబడ్డాయిలా వుంది. ఒక్క పడవకూడా కనబడ్డంలేదు. వర్షం మొఖం మీద మొత్తుతోంది. ప్రళయం పైశాచిక నృత్యం చేస్తున్నట్లుంది. తడిసిపోయిన తలని పిడికిలితో పిండుకుంటూ నలువైపులా చూసాను. నా కళ్ళు మెరిసాయి.

దూరంగా ఓ పాడుపడిన దేవాలయం గుమ్మంలో నిలబడి చుట్ట పీలుస్తున్నాడు ఫెర్రీ తాత.

"హేయ్! ఫెర్రీతాత!" నోటిచుట్టూ రెండు చేతులూ పెట్టుకొని అర్చాను.వర్షం హోరులో అతనికి వినబడలేదు. గబగబా అటువైపు పరిగెత్తాను. ఫెర్రీ తాత నన్ను చిన్నప్పట్నించీ ఎరుగును. డబ్బులు అడక్కుండా బ్రహ్మ పుత్ర మీద తిప్పేవాడు తాత.

"క్రాంతి బాబూ! నువ్వా?" అన్నాడు చుట్ట నోట్లోంచి తీసి ఆశ్చర్యంగా తాత. "ఎప్పుడొచ్చావ్ బాబూ!..."

"తాత! వివరాలు తర్వాత రేష్మా కెలా ఉంది?" అన్నాను ఆతృతగా తాత భుజాలు పట్టుకుంటూ.

తాత ముఖంలో అకస్మాత్తుగా చీకట్లు కమ్ముకొన్నాయ్. "ఏం చెప్పను బాబూ! నీకు తెల్సుగదా? మన ఊరికి ఒకే డాక్టరు. అదు పైసా సూపిస్తేనే గానీ రిచ్చా ఎక్కుడు. రేషమమ్మకి ముందర అదేదో జొరం వొచ్చిందట. మెల్లి మెల్లిగా ప్లేగువ్యాధిలోకి దిగిందంట బాబూ! మడిసి సీపురుపుల్ల మాదిరి అయిపోయినది. ఏకాత్త ఎంగిలిపడ్డా కక్కేసుకుంటాది బాబూ! అదేం రోగమో! డాక్టర్కి మేం ఇచ్చిన డబ్బులు సాల్లేదట. ఖరీదైన మందులు వాడాలంట."

"తా... తా!" అన్నాను ఆశ్చర్యంగా. నా గొంతు బొంగురు పోయింది. నా గుండెని ఎవరో చేతుల్లోకి తీసుకొని నిర్దాక్షిణ్యంగా నలిపేస్తున్నట్లయింది. 'నువ్ పాపం చేసావ్!' అంటోంది అంతరాత్మ. మెదడులో ఆలోచనలు పాముల్లా మెలికలు తిరిగాయి.

ఇక ఆలస్యం చేయడానికి వీల్లేదు. "తాతా! కాలవ దాటాలి పడవెక్కడుంది?" అడిగాను.

"బాబూ! నీకుగాని మతిపోయిందా? బెమ్మపుత్ర ఉండుండి పొంగుతోంది. ఏచణంలోనైనా సిల్లాట్ ములిగి

పోవచ్చు. మన ఊళ్లో చాలమంది ఇప్పటికే కొంపలు ఖాళీ చేసి 'నాగాంగ్' వేపూ 'కజిరంగా' వేపూ పారిపోయారు. మీ అమ్మా, నాన్నా కూడా వెళ్ళిపోయారని తెల్సింది బాబూ!''

''తాతా! పడవ ఎక్కడ?''

''చిన్నప్పట్నించీ నువ్వింతే బాబూ! నీమాటే నీది. అదిగో అక్కడ లంగరు వేసి ఉన్న గొండో నంబరు పడవ మనదే'' అన్నాడు తాత ఒకవైపు చూపిస్తూ.

ఆలస్యం చేయలేదు నేను. అటు వైపు పరుగెత్తాను.

# 13

బ్రహ్మపుత్ర నురగలు కక్కుతోంది. కెరటాలు పడవని ఎత్తి కుదేస్తున్నాయ్. తెడ్లు బలంగా కదుపుతున్నాను. అవతలిగట్టు వైపు అతి కష్టంగా ప్రయాణిస్తోంది, ఫెర్రీ. భుజాలు నొప్పిపుట్టసాగాయ్. కుడిభుజం మరీను, నామనో నేత్రంముందు రేష్మా కనబడుతోంది...గాలి వేగంగా వీస్తోంది...వర్షం యింకా మొత్తుతోంది.......

దూరంగా ఏదో యింజన్ శబ్దం వినబడ్డంతో ఉలిక్కిపడి వెనక్కి చూసాను. నా గుండెల్లో రాయి పడింది!

అది ఓ మోటార్ బోట్! వేగంగా వస్తోంది నా పడవ వైపే. డెక్ మీద రెయిల్స్ కానుకొని నిలబడి ఓ పోలీస్ ఇన్స్పెక్టర్ కాబిన్ వైపు చూసి ఏదో చెబుతున్నాడు. అతని చేతిలో పిస్తోలుంది.

'ది హెల్ విత్ పోలీస్...రామేశ్వరం వెళ్లినా శనేశ్వరం వదల్లేదు' గొణుక్కున్నాను కోపంగా. నా చేతులు వేగాన్ని పుంజుకొన్నాయ్. పడవ నీటిమీద జారుతోంది.

ఢన్...మని శబ్దం వినపడింది. బులెట్-పడవప్రక్క భాగంలో యిరుక్కుంది. కొయ్యచిట్లింది కొంచెంగా.

కంగారుగా వెనక్కి తిరిగాను. మోటార్ బోట్ దగ్గరవు తోంది. ఇన్ స్పెక్టర్ చెయ్యిసాచి ఏదో అరుస్తున్నాడు. ఆ హోరులో వెనకబడకపోయినా ఆమాటలు ఊహించ గలను. అయితే లక్ష్య పెట్టలేదు నేను. తెడ్లు నాచేతి బలాన్నే చవి చూస్తున్నాయ్.

ధన్ ... ధన్ .... ధన్ ... మెడ ప్రక్కగా వరుసగా వెళ్ళాయి మూడుగుళ్ళు. ప్రమాదం వెంటబడి తరుముతోంది. చకచకా ఆలోచించి ఓ నిశ్చయానికి వచ్చాను. అంతే! పడవలోంచి పైకిలేచి చేతులుచాచి నదిలోకి దూకాను. మంచులా తగిలాయి నీళ్లు. ఆయాసంగా ఒడ్డుకేసి ఈదసాగాను.

# 14

తలుపు దబదబా బాదాను. "ఎవరూ?" అంటూ తలుపు తీసాడు ఓ వ్యక్తి కోపంగా, విసుగ్గా.

అతను 'డాక్టర్ త్రిపాఠీ!'

"నువ్వా! మిలిట్రీ లోంచి ఎలావచ్చావ్?" అన్నాడు కంగారుగా. త్రిపాఠీ మెడ పట్టుకొని లోపలకి గెంటాను.

"నీ దురాగతాలకి స్వస్తి పలకడానికి యిక్కడ అవతరించాను మిస్టర్ త్రిపాఠీ!" కంగారుగా అన్నాను అర చేతిలో కత్తి సానబెడుతూ.

త్రిపాఠీ గొణుగుతూ నా వైపు చూసాడు. "నన్ను చంపక" అన్నాడు భయంగా.

"మిస్టర్ త్రిపాఠీ! ఏళ్ళతరబడి మా పచ్చటిగ్రామాన్ని చీడపురుగులా పట్టుకొని బ్రతికావ్. నీలో వైద్యుని కుండాల్సిన దయ, కారుణ్యం లేవు. నేను ఊర్లో లేనన్న ధైర్యంతో నీకు కొమ్ములు మొలిచాయి. నా రేష్మాపట్ల రాబందులా ప్రవర్తించావ్!"

త్రిపాఠీ తల వొంచుకుని మౌనం వహించాడు.

"త్రిపాఠీ! మెడికల్ ఛెస్ట్ తీసుకొని నువ్వు యిప్పుడు నాతో రేష్మా యింటికి వస్తున్నావ్, ఆమె బ్రతకాలి. లేకపోతే నువ్వు బ్రతకవ్."

"ఇప్పుడా..." నసిగాడు త్రిపాఠీ. నా చేతులు త్రిపాఠీ కాలర్ని అందుకొన్నాయి. "మిస్టర్ త్రిపాఠీ! ఈ ఊర్లో విక్రాంత్ మాటకు తిరుగు ఉండదు" అన్నాను అతని కేసి సూటిగా చూస్తూ.

"అదికాదు లో...పల నాకోసం...ఓ...అ...... మ్మాయి" నీళ్ళు నమిలాడు త్రిపాఠి.

అతని మాటలు నాకర్థం అయ్యాయి. మోకాలు మడిచి అతని కడుపులో గుద్దాను. కడుపుపట్టుకొని వంగి పోయాడు త్రిపాఠీ. జుట్టుపట్టుకొని పైకిలేపాను.

"కమీనే...అవతల ఓ పేషంట్ ప్రాణాపాయా సితిలో ఉంటే ఇక్కడ నీ కామకలాపాలా" అరిచాను రెండో చెయ్యి గాలిలో కెత్తి.

"వస్తాను బట్టలు మార్చుకొని."

"టైంలేదు నీ మొహానికి ఈ బట్టలు చాలు. త్వరగా నడు" అంటూ అతడిని బలవంతంగా, నెట్టుకుంటూ రేష్మా ఇంటి వైపు బయలుదేరాను.

రేష్మా ఉండే ఇల్లు తలుపులు దగ్గరగా వేసి వున్నాయి.

నా గుండెలు వేగంగా కొట్టుకొంటోంది. తలుపు తెరిచాను ఆత్రుతగా. ఎదురుగా కనబడిన దృశ్యం చూచి నిశ్చేష్టుడనై నిలబడి పోయాను. నా కాళ్ళ క్రింద భూమి క్రుంగిపోతున్నట్లనిపించింది.

ఓ నులకమంచం మీద రేష్మా పడుకొని ఉంది,

ఆమె ముఖమంతా చెమటలు పట్టి ఉన్నాయ్. "విక్రాంత్ ఓసారి రావూ..." ఆమె కలవరిస్తోంది.

"మైగాడ్! విశాలమైన కళ్ళతో, చిదిమితే పాలుగారే బుగ్గలతో, చీల్చిన దొండపండు లాంటి పెదిమలతో, లియొడావిన్సీ చిత్రించిన మొనోలిస్సాను సైతం కాలదన్నే అందంతో అలరారే నా రేష్మా ఎలా మారిపోయింది? ఎంత ఆల్యమైంది? ఈ వయస్సులోనా ఆ కళ్ళ కింద నలుపు? ఓహో...భగవాన్! నన్ను క్షమించకు... నా దేవత ఉసురు నాకు తగిలేలా చెయ్యి!" ఏడుస్తూ పిడికిలితో నుదురు బాదుకున్నాను.

"విక్రాంత్...వి...క్రాంత్..." ఆమె కలవరిస్తోంది. ఆమె ఛాతీ బలహీనంగా ఎగిరెగిరి పడుతోంది.

మంచం వద్దకు పరిగెత్తి రేష్మా మీదకు వాలాను. "రేష్మా...రేష్మా..." పిల్చాను. నా గొంతు నాకే విచిత్రంగా ఉంది. ఆమె కదలలేదు. కలవరిస్తోంది యింకా. మంచం పక్కగా స్టూల్ మీద ఉన్న కూజాలో నీళ్ళు చేతుల్లోకి వంచుకొని ఆమె ముఖం మీద చల్లాను.

"రేష్మా...విక్రాంత్‌ని వచ్చాను." ఆమె చెంపలు తడుతూ ఆత్రంగా పిల్చాను. నా శ్రమఫలించింది. ఆమె కనురెప్పల్లో బలం వచ్చింది.

"రేష్మా! రేష్మా! నేను వచ్చాను ప్లీజ్! కళ్ళు తెరు." రేష్మా నెమ్మదిగా కళ్ళు తెరిచింది.

క్షణక్షణానికీ ఆమెకళ్ళు పెద్దవి కాసాగాయి. ఆమె పెదిమలు వణుకుతున్నాయ్. చేతుల్లో బలం వచ్చింది.

"ఇది...కలా..." నీరసంగా గొణిగింది రేష్మా.

"నహీం రేష్మా! నీకళ్ళ ముందున్నది నేనే. నీ విక్రాంత్‌ని." చటుక్కున ఆమె చేతులు పట్టుకున్నాను.

"రేష్మా... నన్ను క్షమించకు...హృదయంలేని పశువుని నీ చేతులు నాపీకచుట్టూ బిగించు...నన్ను చంపి నాలో రగులుతున్న అగ్నిపర్వతాల్ని చల్లార్చు." ఆమె చేతులు ముద్దుపెట్టుకుంటూ రోదించసాగాను.

రేష్మా కళ్ళు మెరుస్తున్నాయ్. "విక్రాంత్... నా కోసం వచ్చేశావా" నెమ్మదిగా పైకిలేచి ఆమె రెండు చేతులనీ, నా మెడచుట్టూ పెనవేసి చటుక్కున గుండె లకు హత్తుకుంది. రేష్మా చేతి వేళ్ళు నా జుట్టులో దూరి ప్రేమగా నిమురుతున్నాయి. ఆమె తడి ఆరిన పెదవులు నా ముఖం నిండా ముద్దులు కురిపించసాగాయి.

# 15

సిరెంజి బైటకు లాగి ఆమె భుజాన్ని డెట్టాల్ దూదితో తుడిచాడు త్రిపాఠీ. త్రిపాఠీని ప్రక్కగా తీసుకెళ్ళి అతనికళ్ళల్లోకి ఆత్రంగా చూసాను. "క్షమించు విక్రాంత్ ప్లేగు భయంకరమైన వ్యాధి. ఇప్పటికే ఆలస్యమైంది. ఆమె గుండె శిథిలమైంది. ఏదో చెయ్యాలి కాబట్టి చేసాను. ఆమె అయిదు నిముషాల కంటే ఎక్కువ బ్రతకదు..."

"త్రి...పా...ఠీ...!" గొంతు చించుకొని అర్చాను. "నా కళ్ళ ముందునుంచి తొలగిపొండి, గెట్ లాస్ట్."

త్రిపాఠీ మెడికల్ ఛెస్ట్ మర్చిపోయి పరిగెట్టాడు. రెండు నిముషాలు నిశ్చేష్టంగా నిలిచిపోయి రేష్మా వైపు కదిలాను. "వి...క్రాంత్...ఏమన్నాడు?" హీనంగా అడిగింది రేష్మా.

"నువ్ మళ్ళీ నవ్వుతూ తిరుగుతావు అన్నాడు" అన్నాను గంభీరంగా. రేష్మా రంగు వెలిసిన చీరలా నవ్వింది.

"పిచ్చి...విక్రాంత్...అతని...మాటలు. నేవిన్నాను."

అదిరిపడి రేష్మా వైపు చూశాను. దగ్గరగా రమ్మన్నట్లు సైగ చేసింది.

ఆమె ముఖాన్ని చేతుల్లోకి తీసుకొన్నాను. "రేష్మా! నువ్వు బ్రదకాలి" అన్నాను ఏడుస్తూ.

రేష్మా ఏదో మాట్లాడ బోయింది. అయితే దగ్గుతెర ఆమె గొంతుకలో అడ్డుపడింది. ఊపిరి దొరక్క ఉక్కిరి బిక్కిరయింది రేష్మా. ఆమె ముఖం ఎర్రబడి బిగుసుకు పోయింది. రేష్మా గుండెలపై అరచేతో నిమిరాను. "వి...క్రాం—త్! నే...ఇంతే కోరుకున్నా..." అంటూ నెమ్మదిగా తలపైకెత్తి తటాలున నా ఒడిలో తలవాలేసింది.

గాలిలో కెత్తిన చెయ్యి నా భుజాన్ని చేరుకోబోతూ చటుక్కున వాలిపోయింది. ఆమెలో ఒగుర్పు తగ్గి పోయింది...కాదు ఊపిరే...ఆగిపోయింది?

"రేష్మా!" "భయాందోళనలతో వికృతంగా అరిచాను.

నాలుగు దిక్కులూ నా కేకను ప్రతిధ్వనించి పరిహ సించాయ్?

# 16

"మిస్టర్ విక్రాంత్! ఈ యింటి చుట్టూ సాయుధులైన పోలీసు బలగం ఉంది. పిచ్చి ప్రయత్నాలు చేయకుండా లొంగిపో." సిల్‌ఘాట్ పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఖురానా కంఠం హాండ్ మైక్‌లో ఖంగుమంటూ వినబడింది.

సన్నగా తెరిచిన తలుపు సందులోంచి చూస్తూ పక పకా నవ్వాను. "ఇన్‌స్పెక్టర్ ఖురానా! నేను బయటికి పారిపోతున్నాను, మీరు పట్టుకోలేరు" అరిచాను బిగ్గరగా, ఆనందంతో.

"మజాక్ బంద్ కరో విక్రాంత్! నా సహనాన్ని పరీక్షించకు."

"ఇన్‌స్పెక్టర్ ఖురానా! అయామ్ కమింగ్ ఔట్!" అంటూ తలుపులు దడాలున తెరిచి రివ్వున పరిగెత్తసాగాను సూటిగా.

"విక్రాంత్! స్టాప్ దేర్!"

నేను ఆగలేదు లేడిలా పరిగెడుతున్నాను.

"కానిస్టేబుల్స్? ఓపెన్ ది ఫైర్?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ఖురానా.

ధన్...ధన్...ధన్...

రెండు భుజాల్లోకి దూసుకుపోయాయి గుళ్ళు. రేష్మానే తలచుకొంటూ నవ్వసాగాను. పరుగు ఆపలేదు.

ధన్... ధన్...ధన్... పిక్కల్లోకి దూసుకుపోయాయి బులెట్స్.

మొదలు నరికిన చెట్టులా కూలిపోయాను. ఆగలేదు, పిచ్చిబలంతో పాకడం మొదలుపెట్టాను.

ధన్...ధన్...ధన్... ఛాతీ క్రిందుగా ఎడంవైపు దూసుకుపోయాయి మూడు తూటాలు.

"నా...థాంక్యూ ... ఇన్... స్పెక్టర్" అరిచాను ఆయాసంగా.

ఖురానా పరిగెత్తుకుంటూ వచ్చి నా వైపు వింతగా చూసాడు.

"ఇన్... స్పెక్టర్? సిపాయి...వృత్తిలో...పనిచేసిన మనిషి...ఆత్మహత్య — ద్వారా ... చావుని...ఎన్నడూ ఆహ్వానించడు__అందుకే... ఈ ప్లాన్ — వేశా__"

—: ఐపోయింది :—

# విధి

## వసుంధర

"చెల్లాయ్!" అన్న పిలుపు దూరం నుంచి వినపడ్డప్పుడు నేను పట్టించుకోలేదు.

నాకు అన్నలూ, అక్కలూ లేరు. ఆమాటకొస్తే నా అనేవారెవ్వరూ లేరు. అయితే ఈసారి ఇంచుమించు నా ప్రక్కనుంచే చెల్లాయ్ అన్న పిలుపు వినపడడమూ, ఎవరో నాచేయి బలంగా పట్టుకోవడమూ జరగడంతో నేను చలించడం మాత్రమే కాదు—విపరీతంగా ఆశ్చర్య పడ్డాను.

నా చేయి పట్టుకున్నది ఒక యువకుడు. ఇద్దరి కళ్లూ కలవగానే అతను అంతులేని ఆనందాన్ని ప్రకటిస్తూ, "చెల్లాయ్—నువ్వు నిజంగా బ్రతికే ఉన్నావా?"

అన్నాడు.

"నేను బ్రతికేఉన్నాను కానీ నాపేరు చెల్లాయ్ కాదు" అన్నాను జవాబుగా.

అతను నాచెయి వదిలిపెట్టి—"నా మీద నీకింకా కోపం పోలేదన్న మాట," అన్నాడు.

"ముక్కూ ముఖం ఎరగని ఆడపిల్ల చేయిపట్టుకున్నాక పొరబాటుని అంగీకరిస్తూ క్షమించమని అడిగినా ఆపిల్ల కోపం పోకపోవచ్చు. అటువంటప్పుడు చేసిన తప్పుకు ఇంకా ఏక్షమార్పణా అడగని నీమీద కోపం నాకు ఇంకా తగ్గక పోవడం అసహజం కాదనుకుంటూను—" అని నాలుగడుగులు ముందుకు వేశాను.

నాకు తెలుసు కాస్త కంటికి నదురుగా కనిపించే ఆడపిల్లని ఏదో వంకతో తాకడం, పలకరించడం — ఆతరువాత దాన్నొక ఘనకార్యంగా స్నేహితుల మధ్య చెప్పుకుని మురిసిపోవడం ఈనాటి యువకులలో ఒక పెద్ద ఫ్యాషన్‌గా వస్తోంది. అందుకే నేనా అపరిచిత యువకుని విచిత్ర ప్రవర్తనకు అర్థం గురించి ఎక్కువగా ఆలోచించకుండానే ముందుకు దారితీశాను.

అయితే ఆ అపరిచిత యువకుడు నన్ను వదలలేదు. "అలా ముక్కూముఖం ఎరగని దానిలా నటిస్తా వేవిటే— ఏదో నిన్న తగువులాట వచ్చినంత మాత్రాన మనమిద్దరం అన్నా చెల్లెళ్ళం కాకుండా పోతామా?" అన్నాడు.

నేను ఆగాను. కుర్రాడి సంబోధన నాకు అంత నచ్చ లేదు.

కాస్త తీవ్రంగానే అతని కళ్ళలోకి చూసి—"చేయి పట్టుకోవడం కోసం చెల్లాయ్ అని పిలవడాన్ని

నేను క్షమించగల నేమోకానీ ఏమే అనడం కోసం చెల్లాయ్ అనే వాళ్ళ చెంప పగలగొట్టిందే నా మనసు ఊరట చెందదు,'' అన్నాను.

ఆ యువకుడి ముఖం తెల్లబోయినట్లు గమనించాను. "నువ్వు నిజంగా నా చెల్లాయివి కాదా?'' అనడిగాడు. అతని కంఠంలో జాలి ధ్వనించింది. అతని ముఖంలో దీనత్వం గోచరించింది. "అయినా నా వైరిగానీ చచ్చి పోయిన చెల్లాయ్ మళ్ళీ బ్రతికి వస్తుందా?'' అన్నాడు అదోలా.

ఎందుకో నా మనసు కరిగింది. "నీకు అచ్చం నాలాగే ఉండే చెల్లెలుండేదా?'' అని జాలిగా అడిగాను.

అతని ముఖంలో మళ్ళీ వెలుగు కనబడింది. "నీకు లాంటి చెల్లాయి కాదు. నువ్వే నా చెల్లెలివి'' అన్నాడు. ఈసారి అతని కంఠంలో ధైర్యం ధ్వనించింది. ముఖంలో నమ్మకం గోచరించింది.

నేను చిన్నగానవ్వి—"నా పేరు వసంత. మా అమ్మకు నేను ఏకైక సంతానం. ఇదే ఊరిలో మా అమ్మా, నేనూ బహుశా నాకు రెండు మూడేళ్ళ వయసప్పటి నుండీ ఉంటూ వస్తున్నాము. నాకు తండ్రిలేడు. నే నెరిగున్నంత వరకూ పిన్నిలూ, బాబాయిలూ వగైరా బంధువు లెవ్వరూ లేరు. గత రెండు మాసాలనుంచి నేను తల్లి కూడా లేని అనాధనయ్యాను. ఇప్పుడు నేను ఏకాకిని. ఇటువంటి నన్ను పట్టుకుని నా మీదింకా కోపం తగ్గలేదా చెల్లాయ్–అంటూ ఎవరైనాఅడిగితే ఏంజవాబు చెప్పగలను.'' అనేసి ముందుకి నడిచాను. అతను నిశ్చేష్టుడయ్యాడు.

అమ్మ తలపులోకి రాగానే మనసంతా పాడయింది. నాకు చిన్నతనం నుంచి తెలిసిన ఏకైక ఆప్తబంధువు,

అమ్మ నన్ను రెండు నెలల క్రితం ఏకాకిని చేసి వెళ్ళిపోవడం నా జీవితంలో నేను మర్చిపోలేని ఒక భయంకరమైన చేదు నిజం.

## 2

"నన్ను మీరు క్షమించాలి." అన్నాడతను.

పార్కులో ఒక మూల బెంచీ మీద కూర్చుని ఏదో ఆలోచిస్తున్న నేను ఉలిక్కిపడి చూశాను. అతనే!

"ఎందుకో?" అన్నాను, కాస్త ప్రసన్నంగానే అతని వంక చూస్తూ.

అతను మౌనంగా తన జేబులోంచి ఒక ఫోటో తీసి నాకిచ్చాడు. నేను చూశాను. "నా ఫోటో మీదగ్గరకెలా వచ్చిందీ—"అన్నాను ఆశ్చర్యంగా.

"అది నా చెల్లెలు సుజాత ఫోటో. కులం తక్కువ వాడిని ప్రేమించినందుకు ఇంట్లో దాన్ని నాతో సహా అందరూ నానామాటలూ అన్నాము. తర్వాత ప్రేమించిన వాడు దాన్ని మోసగించడం జరిగింది. ఎవణ్ణినమ్మి అది మమ్మల్నందర్నీ వదిలిపెట్టి వెళ్ళిందో వాడే మోసం చేసేసరికి అది ఏమయ్యిందో మాకు తెలియదు కానీ తన జీవితం ముగియబోతున్నట్లు ఇంటికి రాసిన ఉత్తరం మాత్రం నా దగ్గర ఉంది. అందువల్లనే నిన్న నేను మీ దగ్గర విచిత్రంగా ప్రవర్తించడం జరిగింది. ప్రాణాల కంటె మిన్నగా భావించే చెల్లెలు మరి ఈలోకంలో లేదని అనుకుంటున్న నాకళ్ళ ముందు మీరు కనబడ్డప్పుడు నా మనస్సులో భావాలెలా ఉంటాయో ఈఫోటో చూసి మీరే ఊహించగలరు" అన్నాడా యువకుడు.

నేను నవ్వి "మనిషిని మనిషి ఇంతగా పోలిఉండడం

అసంభవం. ఇది మీ చెల్లెలి ఫోటో అయుంటుందని నేనను కోవడం లేదు—'' అన్నాను.

అతను షాక్ తిన్నట్టుగా ముఖంపెట్టి—''అంటే — మీ అభిప్రాయం?'' అన్నాడు.

''మీ కిష్టంలేని వాడిని ప్రేమించి నందుకు ఇల్లు వదిలి పోవడం మినహాగా మరో గత్యంతరం లేదు. ప్రేమించా డనుకున్నవాడు మోసంచేస్తే ఆత్మహత్య తప్ప మరో గత్యంతరంలేదు. ప్రాణాలకన్న మిన్నగా భావిస్తున్నా ననుకునే మీ ప్రేమ మీ చెల్లెలికి చూపించిన దారులవి. ఇటువంటి మీకు చెల్లెలు సజీవంగా కనబడగానే ఆనందా నికి బదులు ప్రస్తుతం ఎటువంటి నీచపు జీవితం గడుపు తోందోనన్న అనుమానమూ, దానికి తోడుగా ఆగ్రహమూ రావాలి. అలా జరగలేదంటే నేను మీ చెల్లెలిని పోలి ఉండలేదన్న మాట'' అన్నాను.

అతను నోటమాట లేకుండా ఒక్క క్షణంపాటు నావైపే చూస్తూ ఉండి పోయాడు. ఆ తర్వాత ఫోటో కోసమన్నట్లుగా చేయిజాపాడు. నేనివ్వగానే ఫోటో తీసుకుని జేబులో పెట్టుకుని మారు మాటాడకుండా వెళ్ళి పోయాడు.

వెళ్ళిపోతున్న అతనివంకే చూస్తూ ఆలోచిస్తున్నాను. అతడిని అనుకోకుండానే నే నేడిపిస్తున్నానా అన్న ఆలోచన క్షణమాత్రం నాలో కలిగింది.

అప్పుడే నాకు గుర్తుకు వచ్చింది. అతను నన్ను క్షమార్పణ అడగడానికి వచ్చి నేను క్షమించానో లేదో తెలుసుకోకుండానే మధ్యలో వెళ్ళి పోయాడు. ఇంతకీ అతన్ని నేను క్షమించానో, లేదో నాకే తెలియదు.

# 3

"అరే! సుజాత!" అని నన్ను చూసి ఆశ్చర్యపోయిన ఆ యువతి వంక పరీక్షగా చూశాను. వయసు పదహారుకీ ఇరవైకీ మధ్యలో ఉండవచ్చు. మనిషి నాజూగ్గా ఉంది.

"నన్నేనా మీరు సుజాతా అంటున్నది?" అన్నాను.

"నిన్నుకాక మరెవర్ని అలా పిలుస్తానే—నాకు తెలిసిన సుజాతవు నీవొకత్తెవేకదా" అని నేను మళ్ళీ జవాబిచ్చేలోగానే—"ఇంతకీ ఈ వూరెలా వచ్చేవే..." అనడిగింది.

నేను ఇబ్బందిగా నవ్వి—"నాకు తెలిసినంత వరకు నా పేరు సుజాతకాదు. నాకు జ్ఞానం వచ్చినప్పటి నుంచీ ఇక్కడే ఈ ఊళ్ళోనే ఉంటున్నాను. నాకు జ్ఞానంవచ్చి కనీసం పన్నెండేళ్ళు అయుంటుందని నా అంచనా." అన్నాను.

"నాతో రెండుసంవత్సరాలు నా ఊళ్ళో నా ఆత్మీయురాలిగా మెలగిన నా సుజాత పన్నెండు సంవత్సరాల నుంచి ఈ ఊళ్ళోనే ఉంటోందంటే నన్ను నేనే నమ్మలేనేమో—" అందా యువతి.

"మీరు పొరబడ్డారు. నాకు జ్ఞానం వచ్చినప్పటి నుంచీ ఇక్కడే ఉంటున్నానని అన్నాను. కానీ జ్ఞానం రాక మునుపుకూడా ఇక్కడ కొన్ని సంవత్సరాలున్నాను. మొత్తం ఈ ఊరిలోని నా నివాసకాలం కనీసం పదహారు సంవత్సరాలుంటుంది."

"ఏమిటే ఈ డొంక తిరుగుడు మాటలూ - ఇంట్లో దెబ్బలాడి కోరుకున్న వాడితో ఎక్కడికో వెళ్ళిపోయావని విన్నాను. ఆ తర్వాత మళ్ళీ ఇదే నిన్ను చూడ్డం

ఎంతో వుత్సాహంతో నిన్ను పలకరిస్తే నువ్వు ఏమిటే మిటో మాట్లాడుతున్నావు. నా సుజాతను నేను గుర్తు పట్టలేననుకోకు. నేను నీ స్నేహితురాలిని. నీ వునికి రహాస్యంగా వుంచడం అవసరమని నీవనుకుంటే అందుకు నేను నీకు అడ్డంకి కాబోను. దయవుంచి ఈ పిచ్చిమాటలు కట్టిపెట్టి ఎప్పటి సుజాతలా నాతో మాట్లాడు."

"చూడండి...మీరెవరో నాకు నిజంగా తెలియదు. నేను ఎప్పటి సుజాతలా మాట్లాడడం సంగతి అటుంచి_ ఎప్పటికీ సుజాతను కానని గుర్తించండి. నా పేరు వసంత. మీకేమైనా సందేహాలుంటే ఇక్కడే నేను చదివిన స్కూల్లోని రికార్డులూ, ప్రస్తుతం నేను పనిచేస్తున్న ఆఫీసులోని నా కొలీగ్స్ వగైరాలవల్ల తీరగలవు. కోరిన వాడిని వివాహం చేసుకోడానికి ఇంట్లో పెద్దలతో దెబ్బ లాడవలసిన అగత్యం నాకు లేదు. నా ఇంటికి నేనే పెద్దను. నాతో మీరు పరిచయాన్నభిలషించే మాటయితే నేను సుజాతనే కానవసరంలేదు."

ఆ యువతి ఆశ్చర్యంగా నా వంక చూస్తూ__ "నువ్వు...నువ్వు...మీరు__మీరు...సుజాత కాదంటే నాకళ్ళను నేనే నమ్మలేక పోతున్నాను మీరు చెప్పేదే నిజమయితే నాకు ప్రపంచంలో ఇంతకంటే ఆశ్చర్యకర మైన సంఘటన వుండదనిపిస్తోంది" అంది.

"నాకు ఆశ్చర్యంగానే ఉంది. మీకళ్ళలో మొదట కనిపించిన నమ్మకమూ తర్వాత కనిపించిన ఆశ్చర్యమూ అసలు నేను వసంతనేనా అని నన్ను నేనే అనుమానించు కునే స్థితికి తీసుకొచ్చాయి." అని ఒక్కనిముషం ఆగి 'ఎప్పుడైనా నన్ను కలవాలనుకుంటే మీరు నా ఇంటికి

కానీ, ఆఫీసుకుకానీ రావచ్చును''—అంటూ ఆ రెండు అడ్రసులూ ఆమె కిచ్చాను.

ఆమె ఇంకా షాక్ నుంచి తేరుకున్నట్లు లేదు. కలలో మనిషిలా నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళి పోయింది. ఆమె దృష్టినుంచి మరుగయ్యాక నాకు గుర్తొచ్చింది. నాకామె పేరు తెలీదు, ఆమె నాకు తన చిరునామా ఇవ్వలేదు.

## 4

ఒక్కత్తినీ ఇంట్లో కూర్చుని నా జీవితాన్ని సింహావలోకనం చేసుకుంటున్నాను.

తండ్రెవరో నాకు తెలీదు. చిన్నతనంనుండీ అమ్మనన్ను కంటికి రెప్పలా సాకింది. నన్ను కార్లలో తిప్పి మేడల్లో తిరిగేలా చెయ్యకపోయినా ప్రపంచంలో ప్రేమను మించిన ధనం ఏమీ లేదని నాకు తోచేలా మసిలింది.

అమ్మ చరిత్ర నాకు తెలియదు. ఆమె ఎన్నడు పుణ్యస్త్రీ లాగే చేతికి గాజులూ, ముఖానికి బొట్టూ వుంచుకునేది. ఎప్పుడైనా నేను నాన్నను గురించి ప్రశ్నిస్తే ఏమీ చెప్పేదికాదు. అమ్మకు ఇష్టంలేని ప్రశ్న అది అని నాకు తెలిశాక మరి నేనా ప్రశ్న వేయలేదు.

మొదట్లో అమ్మ కొన్ని ఇబ్బందులు ఎదుర్కొన్నే ఉంటుంది. కానీ నాకు ఊహ తెలిసేసరికి అమ్మకు చుట్టుపక్కల గౌరవస్థానమే వుందని నాకు అర్థమైంది.

అమ్మ చదువుకున్నది. తెలివైనది. పౌరుషం గలది, అభిమానం ఎక్కువ, పట్టుదల ఎక్కువ. మనిషి నిప్పులాంటిది—వగైరా మాటలు అమ్మ గురించి ఇతరులు చెప్పకోగా విన్నాను.

అమ్మ ఈ ఊరు వచ్చిన కొత్తలో తన ఒంటిమీది బంగారాన్నమ్మి ఇప్పుడు నేనుంటున్న ఈ ఇల్లు కొన్నదట. జీవనోపాధికి మొదట్లో ట్యూషన్లు ప్రారంభించి నోటి మంచి తనంతో ఎందరినో ఆకట్టుకుని చివరకు ఒక కమిటీ స్కూల్లో టీచరుగా వుద్యోగం సంపాదించుకోగలిగింది.

నన్ను చిన్నతనం నుంచీ అటు గారాబమూ, ఇటు క్రమ శిక్షణా రెంటినీ మేళవించి పెంచింది. ఎన్నోసార్లు అమ్మ నాతో—"నిన్నొక ఇంటిదాన్ని చెయ్యడమే నా జీవితాశయం." అంటూండేది.

కానీ నేను ఎదుగుతున్న కొద్దీ అమ్మలో క్రమంగా మార్పు వస్తోందని నేను గమనించాను. నాకు పది సంవత్స రాల వయసప్పుడు— "అమ్మా నాకు కారెక్కాలని వుందే—" అన్నాను.

దానికి జవాబుగా అమ్మ కళ్ళల్లో నీళ్ళు చూశాను. సాధారణంగా నేను పెద్ద కోరికలు కోరినప్పుడు అమ్మ వివరంగా ప్రపంచ పరిస్థితీ, మా ఇంటి పరిస్థితీ చెప్పేది. కానీ ఇలా కళ్ళ నీళ్ళతో ఊరుకోవడం అరుదు.

బహుశా నా పన్నెండవ ఏట అనుకుంటాను—నేను క్లాసులో వుపన్యాస పోటీలో మొదటి బహుమతి పొంది నందుకు ఇంటికి వచ్చేక అమ్మకు కృతజ్ఞతలు చెప్పుకొని అమ్మ కాళ్ళకు దణ్ణం పెట్టాను.

అమ్మ కళ్ళలో నీళ్ళు తుడుచుకుంటూ—"మీ అమ్మ నీకు చేయగలిగిన దంతా చేయడంలేదు తల్లీ!" అంటూ నన్ను దగ్గరగా తీసుకుంది. అమ్మ మాటలు నా కర్థం కాలేదు.

గత రెండు సంవత్సరాలుగా అమ్మ ప్రవర్తనలో విపరీత ధోరణి పెరుగుతూ వచ్చింది.

ఒక పర్యాయం కన్న బిడ్డకోసం నీకులా శ్రమపడే తల్లి వుండదంటూ నేను అమ్మను మెచ్చుకోగా అమ్మ ముఖం వివర్ణమయింది.

తను కేవలం స్వార్థపరురాలనీ కన్నబిడ్డ సుఖంకంటే తన స్వార్థానికే ప్రాముఖ్య మిస్తున్న మనిషిననీ అమ్మ అంది.

ఆక్షణంలో నాకు అమ్మ మీద చాలా కోపం వచ్చి "ఇలా మాట్లాడితే నేను నిన్ను వదిలి ఎక్కడికైనా పోతానంతే" అన్నాను.

అమ్మనవ్వి "ఎక్కడికైనా పోయే రోజులు దగ్గరపడు తున్నాయిలే" అని ప్రేమగా నా తల నిమిరింది.

మరోసారి ఒక సందర్భంలో "నేను చేసిన తప్పు నీకు తెలిస్తే బహుశా ఎన్నటికీ నన్ను క్షమించలేవనుకుంటాను" అంది అమ్మ.

నా కేదో అనుమానం రాగా "నువ్వు విచిత్రంగా మాట్లాడుతున్నావు. నీ మాటలు నాకర్థం కావడం లేదు" అన్నాను.

నా కళ్ళలోని అనుమానం, భయం అమ్మకు సరిగ్గానే అర్థమయాయనుకుంటాను.

"చూడు పాపా ఒక అమూల్యమైన నిధి వుందనుకో. అది మన ఇంటి పెరట్లో వుందనుకో. ఆ నిధి ఎక్కడ వున్నదో నాకు తెలుసుననుకో. అయినా నేను ఆ నిధిని వెలికి తీయడానికి ప్రయత్నించక, నీకు నిధి ఆచూకీ తెలుసుకునే అవకాశమివ్వక ఒక స్వార్థబుద్ధితో అలా కాలం గడిపేస్తున్నాననుకో. అది నీదృష్టిలో తప్పవునా, కాదా?" అంది అమ్మ.

"ఈ సారి నీమాటలు ఇంకా విచిత్రంగా వున్నాయి. ఏదైనా నిధి ఆచూకీ నీకు నిజంగా తెలిసి ఉంటే మనకీ కర్మ ఏమిటి? ఆనిధి ఆచూకీ తెలపక పోవడానికీ, నీస్వార్ధానికీ ఎంత ఆలోచించినా నాకు సంబంధం కనబడడం లేదు."

అమ్మ అదోలా నవ్వి "మన పెరట్లోనే వున్న నిధిని నువ్వు కళ్ళారా చూసినప్పుడు బహుశా ఈ అమ్మను ఎన్నటికీ క్షమించలేవను కుంటాను." అంది.

నేను ఆతృతతనూ, ఆవేశాన్నీ కంఠంలో వ్యక్తపరుస్తూ "మన పెరట్లోనే నిధి వుందా? ఇది నిజమా! అయితే ఎక్కడ?" అన్నాను.

అమ్మ తాపీగా ఇలా అంది "చెప్పానుగా నేను స్వార్ధపరురాలనని. మన పెరట్లో నిధి వుంది, దాని ఆచూకి ఇప్పుడు నేను నీకు చెప్పను. ఈ విషయంలో ఇంకేమీ మాట్లాడకు."

నేను స్కూల్ ఫైనల్ పరీక్షలురాశాక అమ్మకు జబ్బు చేసింది. ఏదో సామాన్యమైన రోగమే అని ముందు అనుకున్నా అది క్రమేపీ ముదురుతూ వచ్చి మొత్తం మీద అమ్మను మంచాన పడేసింది. డాక్టర్లు కనీసం ఆరునెలలైనా అమ్మ మంచం దిగకుండా పూర్తి విశ్రాంతి తీసుకోవాలని చెప్పారు.

అమ్మ జబ్బు పడ్డ రెండు నెలలకు నా పరీక్షా ఫలితాలు వచ్చాయి. నేను ప్యాసైయ్యాను. అమ్మ సంతోషంగా నన్నింకా చదివించాలని తను అనుకున్నట్లు చెప్పింది.

స్కూలు తెరిచినా అమ్మ వుద్యోగంలో జాయిన్ కాలేదు. తన పరిస్థితి స్కూలు హెడ్‌మాష్టరుగారికి విపులీకరించి చెప్పింది. అమ్మ అనారోగ్యం సంగతి విని

చూడ్డానికి వచ్చిన అనేక మందిలో స్కూలు హెడ్ మాష్టరుగా రొకరు.

అమ్మ పరిస్థితి నర్థం చేసుకున్న హెడ్‌మాష్టరుగారు, ఆమెకు సానుభూతి వాక్యాలతో ధైర్యం చెప్పడమేకాక నా భవిష్యత్తు గురించికూడా కొన్ని సలహాలిచ్చారు. ఆయన సలహా ప్రకారం ఆ ఊళ్ళోనే దొరికే పక్షంలో నన్నుద్యోగంలో ప్రవేశపెట్టడానికి అమ్మ అంగీకరించింది.

సరిగ్గా అయిదు వారాలకు ఊళ్ళోని ఒక చిన్న కంపెనీలో నాకొక చిన్నగుమస్తా ఉద్యోగం దొరికింది. హెడ్ మాష్టరుగారు నాకా ఉద్యోగం రావడానికి చాలవరకు సహాకరించారు.

ఉద్యోగం రావడం వల్ల అమ్మ పనులు చూసి పెట్టడానికి ఓ మనిషిని కూడా నేను కుదర్చగలిగాను. నేను ఇంట్లోలేని సమయంలో అమ్మను జాగ్రత్తగా చూడడం ఆమె బాధ్యత. అయితే ఆ మనిషి ఉపయోగం నాకు నెలరోజులు మాత్రమే కనబడింది.

అమ్మ జబ్బు ముదిరి ఆమెను జనరల్ హాస్పటల్‌లో అడ్మిట్ చెయ్యవలసి వచ్చింది. జనరల్ హాస్పటల్‌లో అమ్మ సరిగ్గా పన్నెండు రోజులు గడిపింది.

పదమూడో రోజు మధ్యాహ్నం మూడు గంటల ప్రాంతంలో నాకు ఆఫీసుకు ఫోన్ వచ్చింది, అమ్మ పరిస్థితి ప్రమాదకరంగా వుందని. నేను చూడ్డానికి వెళ్ళేసరికి మరినాకిక అమ్మ లేదు.

చనిపోయే ముందు నాగురించే ఆదేపనిగా అమ్మ కలవరించినట్లు హాస్పటల్ నర్సు నాతో చెప్పింది.

అమ్మ ఈలోకంలో నన్ను ఒంటరిదాన్ని చేసి వెళ్ళిపోయింది.

# 5

ఎవరో తలుపు తట్టారు. వెళ్ళి తలుపుతీసి ఆశ్చర్యంగా "అరే మీరా? అన్నాను.

ఆమె నవ్వింది. "మీ అడ్రసు నా దగ్గరవున్న మాట నిజమేకానీ ఇప్పుడు నేను అనుకోకుండా మీ ఇంటికి ఏ అడ్రసు సహాయమూ లేకుండా వచ్చాను." అంది.

"అంటే?" అన్నాను అర్థంకాక.

"నేను ఇళ్ళకోసం వెతుకుతున్నాను. ఈ ఇంట్లో ఒక గది కాళీ వుందని ఈ వీధి చివర ఒకావిడ చెప్పింది. వచ్చాను–మిమ్మల్ని కలిశాను. ఇదేనన్నమాట మీ ఇల్లు," అందామె.

ఆమెను లోపలి కాహ్వానించాను. నేను మా ఇంట్లో ఒక గది ఎవరైనా ఆడపిల్లకు అద్దెకివ్వాలని అనుకుంటున్నాను. ఈ విషయం మావీధిలోని చాలామందికి తెలుసు.

సుజాత స్నేహితురాలిపేరు శోభ. ఆమె కూడా ఈ మహానగరంలో ఒక మూల నాకులాగే ఉద్యోగం చేస్తోంది. ఆమె ఇల్లంతా కలియతిరిగి చూసింది. గది ఆమెకు నచ్చింది. వెళ్ళి పోబోయే ముందు "మళ్ళీ ఇలా వసంత పేరుతో వున్న సుజాత రూపానికి చేరువౌతున్నానన్నమాట" అంది శోభ.

మరుసటి నెల ఒకటవ తేదీన శోభ నా ఇంట్లో అద్దెకు ప్రవేశించింది.

శోభ రాక నాకు మంచి కాలక్షేపాన్నీ తద్వారా మనశ్శాంతినీ ప్రసాదించింది. ఒక వారంరోజులు గడిచేక శోభ నాతో "ఇంత మంచి పెరడుండి ఇలా వదిలేయడం భాగలేదు. ఏమైనా మొక్కలు వేద్దాం" అంది.

ఈ అయిడియా నాకు నచ్చింది. ఆ రోజు సాయం త్రమే ఇద్దరం కలిసి ఒకసారి పెరడంతా కలియదిరిగి ఒక పథకం వేసుకున్నాం. శోభ అంటుందీ సపోటా, మామిడీ, కొబ్బరి లాంటి పెద్ద వాటిని ఒకటి రెండు దొడ్లో పాతాలని.

నా అభిప్రాయంలో చిన్నపూల మొక్కలూ, ఏమైనా కూరల మొక్కలూ వేయాలని. కాస్సేపు చర్చ అనంతరం ఒక కొబ్బరి మొక్క, ఒక మామిడి మొక్క వేయడానికి నేను నిర్ణయించుకొన్నాను. అయితే అవి ఎక్కడ పాతాలీ అన్నది ఇంకా తేల్చుకోలేదు. ఈ విషయాన్ని దృష్టిలో వుంచుకుని శోభ ప్రత్యేకంగా దొడ్డిని పరిశీలించింది.

"పెరట్లో కాస్త పెద్ద మొక్కలు వేసేముందు చాదస్త మంటూ తీసిపారేయక కొన్ని శాస్త్ర నియమాలను పాటించితే బాగుంటుంది. ఈ విషయంలో నా కాట్టే తెలియదు ఎవరైనా పెద్దలను సంప్రదించండి మంచిది." అంది శోభ.

"ఏ నియామాలూ పాటించకుండా మనకి తోచిన చోట పాతేసే ఏమవుతుందీ?" అనడిగాను.

"నాకు తెలీదు. కాని అరిష్టమని అంటారు." అంది శోభ.

"నా జీవితంలో ఇంకా అరిష్టాలు లేముంటాయిలే." అన్నాను, నిస్పృహగా.

"అలాగనకు. నీ ముందింకా నూరేళ్ళ జీవితముంది!"

"కనీసం మరి పాతికేళ్ళైనా బ్రతుకుతానని మాఅమ్మ చనిపోయే ముందుక్షణం వరకు అనుకుంటూండేది. నేను నూరేళ్ళు ఇంకా జీవించవలసి వుందని నువ్వంటూంటే

నాకీ సంగతి గుర్తుకొస్తోంది. నేను మరో నెల తిరక్కుండా చనిపోయాననుకో, నువ్వాశ్చర్య పడతావా?" అనడిగాను.

శోభ ఆశ్చర్యంతో నోరెళ్ళ బెట్టింది.

# 6

"చూడమ్మా! దొడ్లో నీ కోసం నిధి ఉంచాను. మరెవ్వరి పాలూ కాకుండా నేను కాపాడుతున్నాను. త్వరగా నువ్వా నిధిని వశం చేసుకోవాలి. అంతవరకూ నేను పుణ్యలోకాలకు పోకుండా ఇక్కడే ఉండాల్సి వుంటుంది."

హఠాత్తుగా నాకు మెలకువ వచ్చింది. అది అర్ధరాత్రి సమయం. నాకు కాస్త భయమే వేసింది. అమ్మ కలలో కనిపించడం నాకు కొత్త కాదు కానీ ఇలా చనిపోయిన వ్యక్తిగా కలలో కనిపించడం ఇదే మొదలు.

నేను లేచి తడుముకుంటూ గోడదాకా వెళ్ళి స్విచ్ నొక్కాను. లైటు వెలగలేదు. అంటే కరెంటు లేదన్న మాట. హఠాత్తుగా నాలో మొండిధైర్యం కలిగి ఒకసారి పెరట్లోకి వెళ్ళాలనిపించింది.

అమావాస్య రోజులు కావు కాబట్టి మరీ అంత చీకటిగా లేదు. నా కళ్ళు కూడా కాస్త అలవాటుపడ్డంతో నేను శ్రమ లేకుండానే పెరట్లోకి నడిచి వెళ్ళగలిగాను.

అయితే పెరట్లో నేను చూసిన దృశ్యం నన్ను ఆపాదమస్తకం కంపింపచేసింది. కెవ్వుమని కేక పెట్టవలసిందే. కానీ ఎవరో నా గొంతు పట్టి నొక్కేసినట్లుగా—కంఠం పెగల్లేదు.

పెరట్లో ఒక స్త్రీమూర్తి కలయ దిరుగుతోంది. ఆమె అమ్మ కాదు గదా! అదే నిజమయితే అమ్మ దయ్యామైందా? అసలు దయ్యాలున్నాయా? ఇప్పుడు నేనేం చెయ్యాలి?

అంతకాలం ప్రేమతో నన్ను సాకిన అమ్మ ప్రాణాలు కోల్పోగానే నాలో ఇంత భయాన్ని రేకెత్తిస్తోందేమిటి?—అని అనిపించగానే కాస్త ధైర్యం కూడ గట్టుకుని ఆ మూర్తిని సమీపించాను.

అడుగుల చప్పుడుకు ఆమె తటాలున వెనుదిరిగింది. ఒక్క క్షణం పట్టినప్పటికీ ఆమెను గుర్తుపట్ట గలిగాను—

"నువ్వా, శోభా!" అన్నా నాశ్చర్యంగా.

శోభ తడబడింది— "నిద్ర పట్టడం లేదు—" అంది.

ఆ సమాధానం నాకంత సంతృప్తిని కలిగించలేదు. ఇంత రాత్రి వేళ నిద్ర పట్టని కారణంగా శోభ పెరట్లో తిరుగుతోందంటే అసహజంగానూ, అసందర్భంగానూ నాకు తోచింది. అందులోనూ మా అమ్మ చనిపోయి కొద్ది నెలలు మాత్రమే అయిందన్న విషయం శోభకు తెలుసు. సాధారణంగా నా వయసు వారికి, అందులోనూ ఆడపిల్లలకు భయంగావుండడానికి ఈమాత్రం చాలు. కానీ శోభ నిర్భయంగా పెరట్లో తిరుగుతోంది. ఇందులో రహస్యం వుండి వుండాలి.

ఇద్దరం ఇంట్లోకి వచ్చాం, ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళి పడుకున్నాం. నాకు వెంటనే నిద్ర పట్టలేదు. ఆలోచిస్తూండగా ఒక చిన్న అనుమానం వచ్చింది.

శోభ వయసులో వుంది. బహుశా తన స్నేహితు డెవరి కోసమైనా ఎదురుచూస్తోందేమో! అదే నిజమయితే శోభను ఇంట్లోంచి బయటకు పంపేయాల్సొంటుంది. అర్థరాత్రి సమయంలో ఎవరేనా యువకుడు శోభగురించి నా యింటి పెరట్లోకి రావడం ఎవరి దృష్టిలోనైనా పడితే అపవాదు నామీద పడగల అవకాశాలు చాలా వున్నాయి. నేనూ వయసులో వున్న ఆడపిల్లనే మరి!

అసలు శోభ ఇంకా పడుకున్నదో లేదో చూద్దామని ఒకసారి ఆమె గదికి వెళ్ళి తలుపు తట్టాను. మరో క్షణం లోనే తలుపు తీసింది శోభ. "ఇంకా నిద్ర పట్టలేదా"— అనడిగాను.

"నిద్ర రావడం లేదు—" అంది శోభ.

"అయితే నా గదిలోకి రాకూడదూ? నాకూ నిద్ర రావడం లేదు. ఇద్దరం ఏమైనా కబుర్లు చెప్పుకోవచ్చు." అన్నాను. శోభ సంతోషంగా అంగీకరించింది.

శోభ మంచం నా గదిలోకి మార్చేసింది. ఇద్దరం చాలా సేపు కబుర్లాడుకున్నాం. నేను శోభతో "రోజూ మన మిలాగే కాలక్షేపంచేస్తే బాగుంటుందేమో—"అన్నాను. శోభ మారు మాటాడకుండా తన అంగీకారాన్ని తెలపడం నాకు ఆశ్చర్యాన్నే కలిగించింది.

ఆ తర్వాత పదిరోజులపాటు రాత్రిళ్ళు ఆమె కను మానం రానివిధంగా శోభను ఓ కంట కనిపెడుతూనే ఉన్నాను. ఆమె ప్రవర్తనలో అనుమానించ వలసినదేమీ లేనట్లు నాకు రూఢి కాసాగింది. క్రమంగా మా ఇద్దరి మధ్యా స్నేహంతోపాటు ప్రేమాభిమానాలు కూడా వరిల్లసాగాయి. నా జీవితంలోని కొంత దిగులూ, బరువూ దూరం కావడానికి శోభ స్నేహం నాకు ఉపయోగ పడింది.

## 7

అనుకున్న పదిహేను రోజులకు ఒక కొబ్బరి మొక్కను కొన్నాం.

పొరుగింటి నుంచి నేను గునపం తేవడానికి వెళ్ళగా పొరుగింటావిడ— "గునపమెందుకమ్మా నీ పెళ్ళికి పందిరి నువ్వే వేసుకుంటున్నా వేమిటీ—" అని వేళాకోళ

మాడింది. విషయం చెప్పాను. "ఆడపిల్లవు. ఒక్తరీ ఇలాంటి పనులు చేయగలవా? వుండు మా వెంకన్ను పంపిస్తాను___" అందావిడ.

నేను నవ్వి___"పదిహేనేళ్ళ కుర్రాడికి మాత్రం ఇది బరువు పని కాదా, ఆ మాత్రం నేనే చేసుకోగలను లెండి___" అన్నాను.

ఆవిడ నా మాటను చెవిని పెట్టలేదు. నాతోపాటే వాళ్ళబ్బాయి వెంకట్రావును గునపం ఇచ్చి పంపించింది.

మేమిద్దరం వెళ్ళేసరికి శోభ నాకోసమే ఎదురుచూస్తోంది. వెంకట్రావు వంక ప్రశ్నార్థకంగా చూస్తున్న శోభతో_ "మనకు సాయపడ్డానికి వచ్చిన మగవాడు" అన్నాను నవ్వుతూ. వెంకట్రావు కొంచెం యిబ్బందిగా సిగ్గు పడ్డాడు.

శోభ చూపించిన చోట అతను తవ్వడం మొదలు పెట్టాడు. కొంతసేపు తవ్వేక అంత చిన్న కుర్రవాడికి కాస్సేపు శ్రమ తగ్గించాలనిపించి నేను అతన్ని వారించి స్వయంగా తవ్వబోయాను. చాలా కష్ట మనిపించింది. శోభ కూడా ప్రయత్నించి కష్టం ఫీలయ్యింది. పొరుగింటా విడ మాటల్లోని నిజం అర్థం కాగా మళ్ళీ వెంకట్రావుకే పని అప్పగించాం.

అతను మరో పావుగంటసేపు త్రవ్వాడో లేదో — ఖంగుమన్న పెద్ద శబ్దం అయింది. నా కళ్ళు మెరిశాయి. నా ఊహల్లో నిధి మెదిలింది.

శోభ మాత్రం నిరుత్సాహాన్ని ప్రదర్శిస్తూ— "పడ్డ శ్రమంతా వృథా అయింది. ఇంత కష్టపడి తవ్విన చోట రాయి తగిలింది. మళ్ళీ మొదటికొచ్చాం" అంది.

"అయితే ఆ శబ్దం రాయి వల్లనే నంటావా?" అన్నా న్నేను.

"రాయి కాకపోతే నిధులూ, నిక్షేపాలూ ఉన్నాయంటావా?" అంది శోభ తేలిగ్గా. అయితే ఆ శబ్దానికి నిధే కారణ మయుండవచ్చునని ఆ అమాయకురాలికి తెలియదు. తెలియచెప్పాలని నే ననుకోనూలేదు.

ఇప్పుడు నా మనసులో తీవ్రంగా ఒకే ఒక ఆలోచన మెదుల్తోంది. ఎవరికీ తెలియకుండా నేను నిధిని దక్కించుకోవాలి.

తాత్కాలికంగా తవ్వకం పని ఆపు చేశాం. వెంకట్రావు వాళ్ళ గునపాన్ని వదిలేసి వెళ్ళిపోయాడు. నేనూ, శోభా కాస్సేపు మొక్కల పెంపకం మీద జోక్సు వేసుకున్నాం. నా మనసంతా ఖంగుమన్న ఆ శబ్దం చుట్టే తిరుగుతోంది. మనసునిండా ఆశలు పేరుకుంటున్నాయి.

శోభ మనసులోకి నిధి గురించిన ఆలోచన రాకూడదని దేవుణ్ణి ప్రార్థించుకుంటున్నాను. ఆమెను తాత్కాలికంగా ఇక్కడినుంచి బయటకు పంపించాలి. కానీ ఎలా?

ఇద్దరం గునపం కూడా తీసుకుని ఇంట్లోకి వచ్చాం. నేను గునపాన్ని గోడవారగా నేలమీద పడుకోబెట్టాను. ఆ తర్వాత ఇద్దరం నా గదిలోకి వెళ్ళాం.

"ఇంకా చాలా వెలుగుంది. మనం ఈ రోజు కొబ్బరి మొక్కను పాతేయాల్సింది." అంది శోభ.

"నిజమే ననుకో కానీ నాకు తెలీ కడుగుతాను. మొక్క పాతడానికి అంతలోతు తవ్వాలా?" అన్నాను.

"నాకూ తెలీదు కానీ మా నాన్నగారు మా దొడ్లో కొబ్బరిమొక్క పాతించినపుడు చాలా పెద్ద గొయ్యే తవ్వించారు. ఆ తర్వాత సగం గోతిని మట్టితో పదులు పదులుగా నింపారు. ఆ పైన మొక్కను పాతారు. అలా

వెయ్యడం వల్లనే ఆ మొక్క పెరిగి పెద్దదై కాయలు కాసిందని నేననుకున్నాను.'' అంది శోభ.

''సరే—ఈవేళ్టికి అంతపని మళ్ళీ చేయలేం'' అని బదకంగా ఆవలించి ''ఈవేళ నీకు సినిమా ప్రోగ్రాం వుందనుకుంటాను—'' అన్నాను.

''అబ్బే—అలాంటిదేమీ లేదు'' అంది శోభ.

నేను నవ్వి—''నిన్న నువ్వు అలా చెప్పినట్లు గుర్తు.'' అన్నాను.

ఇద్దరం కలిసే భోంచేశాం. మామూలు విధంగానే ఇద్దరం నా గదిలోనే పడుకున్నాం. నాకు నిద్ర రావడం లేదు. మనసు పెరట్లో తిరుగుతోంది. కాసేపు కబుర్లు చెప్పుకున్నాక—''పడుకుందాం. నిద్రవస్తోంది—'' అంది శోభ.

మాట లాగిపోయాయి. దీపం ఆర్పేశాం. నేను నిద్ర పట్టక మంచంమీద అటూ ఇటూ దొర్లుతున్నాను. చాలా సేపు గడిచేక మరి ఉండబట్టలేక నెమ్మదిగా మంచం మీంచి లేచాను.

''నీకూ నిద్రపట్టడం లేదా?'' అన్న శోభ మాటలు విని వులిక్కిపడ్డాను.

''ఈ రాత్రికి నాకు నిద్ర వచ్చేలా లేదు'' అన్నాను.

''ఆశ్చర్యంగా వుంది. నేను ఏవో మా ఇంటి సమస్యల గురించి ఆలోచిస్తున్నాను, అందువల్ల నిద్ర రావడం లేదు, మరి నీ కేమయింది?'' అంది శోభ.

నేను ఒక క్షణం తటపటాయించి—''మనం దొడ్లోక సగం గొయ్యి తీసి వదిలేశాం, అలా చేయడం అరిష్టదాయకమని మా అమ్మ చెబుతూండేది—'' అన్నాను,

“అయితే ఇప్పుడు మనం చేయగల్గిం దేముంది?” అంది శోభ.

“ఉంది, నీకూ నిద్ర పట్టటం లే దంటున్నావుగా పద చెబుతాను” అన్నాను.

శోభకూడా లేచింది. ఇద్దరం పెరట్లోకి వెళ్ళాం.తవ్విన గోతిలో కొద్దిగా మట్టివేసి ప్రక్కనే వదిలేసిన కొబ్బరి మొక్కను పాతి మళ్ళీ లోపలకు వచ్చి మా మా మంచాల మీద పడుకున్నాం. కాసేపు కబుర్లు చెప్పుకున్నాక ఇద్దరకూ కూడా నిద్ర పట్టేసింది.

నాకు వుదయం ఆరున్నరగంటల ప్రాంతంలో మెలకువ వచ్చింది. అప్పటికి శోభ ఇంకా నిద్రపోతూనే వుంది. నేను లేచి పెరట్లోకి వెళ్ళాను. కొబ్బరిమొక్క పాతడం వల్ల పెరడుకు అందం వచ్చిం దనిపించింది.

నేను ముఖం కడుక్కుంటుండగా శోభ వచ్చి పలకరించింది—“ఎంత సేపయింది నువ్వు లేచి” అనడిగింది ఆత్రుతగా.

“ఇప్పుడే లేచి ముఖం కడుక్కుంటున్నాను—” అన్నాను.

“అమ్మయ్యా నీకూ నాలాగే మంచి నిద్రే పట్టిం దన్న మాట—”అంటూ తన దృష్టి దొడ్డిచుట్టూ ప్రసరింప చేసి “కొబ్బరిమొక్క చాలా అందంగా ఉంది కదూ! ఈ రోజు సాయంత్రం దాన్ని సరైన స్థానంలో పాతాలి—” అంది.

“పోనీ అక్కడే వదిలేస్తేనో—” అన్నాను.

“భలే దానివే, అంత రాయి అడ్డుగా వుంటే ఆ మొక్కేం బ్రతుకుతుందీ?”

“ఆ రాయి ఎంత పెద్దదో మనకి తెలియదు. తవ్వి బయ

టకు తీయడానికి ప్రయత్నించి వుండవలసింది—'' అన్నా న్నేను.

''అబ్బే—అంత లోతున్న రాయి చిన్నదిగా వుండదు. తవ్వి బయటకు తీయడం కష్టం. ఇలాంటి విషయాల్లో నాకు చాలా అనుభవం. చిన్నతనంలో మాఇంట్లో అందరం దొడ్డిపని బాగా చేసేవాళ్ళం. తవ్వడాలూ, చెక్కడాలూ మొగవాళ్ళపనీ, తుక్కు ఏరడాలు, ఊడ్వడాలూ ఆడ వాళ్ళ పని'' అని నవ్వింది శోభ.

ఇద్దరం స్నానాలు ముగించి కాఫీలు తీసుకున్నాక వంట ప్రారంభించేం. గంటలో వంట ముగిసింది. కాసేపు ఇల్లు శుభ్రం చేసుకుని భోజనానికి కూచుని లేచేసరికి టైము తొమ్మిదిన్నర అయింది. ఇద్దరం బట్టలు మార్చుకుని ఆఫీసు లకి బయల్దేరబోయాం.

హఠాత్తుగా నేను కూర్చుండి పోయాను— ''ఏవిటో కళ్ళు తిరుగుతున్నాయి శోభా! నేను కాస్త ఆలస్యంగా వస్తాను. నువ్వు వెళ్ళిపో—'' అన్నాను.

శోభ దెబ్బ తిన్నట్లుగా కనపడింది— ''ఏమయింది నీకు?'' అంది ఆత్రుతనూ, కంగారునూ కంఠంలో మిళితం చేస్తూ.

''ఏమీ లేదు. బహుశా కొద్దిసేపు విశ్రాంతి అవసర మనుకుంటాను'' అన్నాను నీరసంగా.

శోభ నా తల నిమిరింది. నుదుటిపైన అరచేత్తో నెమ్మ దిగా రాసింది. ఆ తర్వాత ఒకక్షణం ఆగి ''స్నేహితు రాలి నీదశలో వదిలి నేనాఫీసుకెలా వెడతాననుకున్నావ్'' అంది.

నేను మాట్లాడలేదు. ఒకక్షణం కూర్చున్నాక లేచి మంచం దగ్గరకు వెళ్ళి పడుకున్నాను. శోభ నా మంచం

మీద నే పక్కగా కూర్చుంది. కొద్ది నిముషాల సేపు ఇద్దరి మధ్య మాటలు లేవు.

"శోభా మీ ఆఫీసరు చండశాసనుడనీ, ఓ పట్టాన సెలవివ్వడనీ ఒకప్పుడన్నావు గదా—నీ అమూల్యమైన శెలవును నా గురించి వృధా చేయడం నాకిష్టంలేదు. నా కొచ్చినది పెద్ద జబ్బేమీ కాదు. బహుశా నరాల నిస్సత్తువ వల్ల ననుకుంటాను—అదోరకమైన నీరసం నన్నావహించింది. నువ్వు ఇల్లు కదిత్తే నా ఆఫీసులో కూడా కాస్త ఈ సమాచారం అందజేయగలవని నా ఆశ. ఓ గంటలో తేరుకుని ఆఫీసుకు వెళ్ళగలనని అనుకుంటున్నాను."

ఏమనుకుందో ఏమో శోభ సరేనని బయల్దేరి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిన మరుక్షణం నేను వీధి తలుపు గడియవేసి పెరట్లోకి వెళ్ళాను. అక్కడ శుభ ప్రదమైన కొబ్బరి మొక్క అలాగే ఉంది.

నేను గునపం తీసుకుని త్వరత్వరగా తవ్వి కొబ్బరి మొక్కను వెలికితీసి గోతిని పూర్వపు విధంగా తీశాను. ఒక్క పర్యాయం తవ్వినది కావడంవల్ల పదిహేను నిముషాలలో పని పూర్తయింది.

అప్పుడే హృదయం పులకరించేలా మళ్ళీ ఖంగుమన్న శబ్దం వినపడింది. నేను మరో రెండు దెబ్బలు ప్రక్కవాటుగా వేసి ఆ శబ్దానికి కారణ భూతమైన వస్తువును కదిల్చి చూశాను. కొంచెం నిరుత్సాహమే కలిగింది. అది రాయి అన్న అనుమానం కలిగింది. మరో పదిహేను నిముషాల శ్రమ అనంతరం నా అనుమానం నిజమని ధృవపడింది. నేను ఆ రాతిని తొలగించి బయటకు తీశాను. కొబ్బరి మొక్కను మళ్ళీ పాతేశాను.

స్నానాల గదిలోకి వెళ్ళి ముఖం, కాళ్లూ, చేతులూ కడుక్కొన్నాను. ఒకసారి అద్దంలో ముఖం చూసుకుని సంతృప్తి చెంది ఆఫీసుకు బయలుదేరాను.

నాకు దొరికిన రాతిని జాగ్రత్తగా ఇంట్లో ఎవరికీ తెలియని చోట దాచాను. కేవలం ఒక నల్లరాయి నాలో కొన్ని గంటలపాటు కలిగించిన అనుభూతులూ, ఆశలూ తలపులోకి రాగా నవ్వుకోకుండా ఉండలేకపోయాను.

# 8

సాయంత్రం అయిదుగంటలకు నేను ఇంటికి వెళ్ళేసరికి ఇంటికి ఇంకా తాళంవేసే ఉంది. అంటే శోభ ఇంకా ఆఫీసునుంచి రాలేదన్న మాట.

సాధారణంగా ఆమె నాకంటే కాస్త ఆలశ్యంగానే రావడం నాకు తెలిసినదే కాబట్టి ఆ విషయం నాకంత ఆశ్చర్యాన్ని కలిగించలేదు.

కానీ మరో పదినిమిషాల్లో పొరుగింటి వాళ్ళబ్బాయి వెంకట్రావు వచ్చి తలుపుతట్టి నేను తలుపు తీశాక "మీరీ వేళ ఆఫీసుకు వెళ్ళలేదాండీ?" అనడిగినప్పుడు ఆశ్చర్యపోయాను.

"ఏమలా అడుగుతున్నావ్?" అనడిగాను.

"ఈ రోజు మా ఇంట్లో తద్దినం. అందువల్ల నేనుపిల్లల్ని ఆడించడం కోసం స్కూలు మాని ఇంట్లో ఉండి పోవలసి వచ్చింది. పన్నెండు గంటల ప్రాంతాల నేను మా తమ్ముళ్ళనీ, చెల్లెళ్ళనీ తీసుకుని వీధిలోంచి నడిచివెడుతూ మీ ఇంటి తలుపు తాళంవేసి ఉండకపోవడం గమనించాను. ఆ సంగతి అమ్మకు చెప్పాను. మీకు గారెలిచ్చి రమ్మని

అమ్మ నన్ను రెండుగంటల ప్రాంతంలో పంపింది. మీ ఇంటి తలుపులు తాళంవేసి లేకపోయినా ఎంత తట్టినా ఎవరూ పలకలేదు. వెళ్ళి అమ్మతో చెబితే ఒంట్లో బాగా లేదేమో, నిద్రోతున్నారేమోనని అంది. ఇంతకూ ఇప్పుడు నేను గునపం తీసుకెడదామని వచ్చాను. మీ పని అయిందా?" అన్నాడు వెంకట్రావు.

"ఇంకా పని అవలేదు కానీ మీకు అవసరమైతే తీసుకు వెళ్ళు. మళ్ళీ రేపు తీసుకుంటాన్లే" అన్నాను.

"మధ్యాహ్నం నిద్రపోయారాండీ" అనడిగాడు వెంకట్రావు కుతూహలంగా.

"నిద్ర పోయానుగానీ మధ్యాహ్నం కాదు. ఉదయమే అదీ ఇంట్లో కాదు. ఆఫీసులో" అని నవ్వి "నిన్న రాత్రి నాకూ, నా స్నేహితురాలికి కూడా నిద్ర పట్టలేదు. అందువల్ల బహుశా మా శోభ సెలవుపెట్టి ఇంటికొచ్చి నిద్ర పోయి ఉంటుంది" అన్నాను.

గునపం తీసుకుని వెళ్ళిపోయిన వెంకట్రావు కొద్దిగా గారెలూ, పచ్చళ్లూ, కారంతో తిరిగి వచ్చాడు. నేను అవి తీసుకుని 'థాంక్స్' చెప్పి అతన్ని పంపేశాను.

గారెల్ని చూడగానే నాకు ఆకలేసింది. అల్లంపచ్చడీ నూపచ్చడీ తోడుచేసి నాలుగైదు గారెల్ని లాగించి మంచి నీళ్ళు తాగేసరికి శరీరంలో నూత్న చైతన్యం కలిగింది.

నెమ్మదిగా పెరట్లోకి నడిచాను. నాలో ఎన్నో ఆశలు రేగడానికి కారణభూతమైన కొబ్బరిమొక్క అదే స్థలంలో అలాగే నిలబడి ఉండి నన్ను చూసి నవ్వుతోందనిపించింది.

అక్కడి నుంచి నెమ్మదిగా పడక గదిలోకి వెళ్ళాను. గదిలో ఏదో కొత్తరకం వాసన వేస్తోందనిపించింది. ఆ

వాసన నాకు సుపరిచితమైనదే అనిపిస్తోంది. కాని ఏమిటో తెలియలేదు. కిటికీ తలుపులు తీశాను. చల్లని గాలి గదిలో ప్రవేశించింది. అయిదు నిముషాల్లో గదిలో ఏ విధమైన వాసనా లేదు.

నేను ఆలోచిస్తున్నాను. శోభ మళ్ళీ ఇంటికి వచ్చిందా? వస్తే ఎందుకు వచ్చింది? ఆమెకు కూడా నాకు లాగే నిధి గురించిన అనుమానాలున్నాయా? నాకే నిధి వున్నదీ లేనిదీ సరిగా తెలియదు. ఏదో ఆశ మాత్రమే. అటువంటప్పుడు ఆవిడకు తెలిసే అవకాశం ఎక్కడుంది?

ఇలాంటి ఆలోచన నాకు కలగడం ఇదే మొదలు. ఆ దృష్టితో ఆలోచిస్తూంటే శోభ ప్రవర్తన మొదట్నించీ నిధి గురించి వెతుకుతున్నదానివలె ఉందనిపించింది.

ఈ ఆలోచన హాస్యాస్పదంగా నాకు తోచినప్పటికీ ఎందుకో ఒకసారి కొబ్బరిమొక్క దగ్గర పరిసరాలను గమనించి రావాలనిపించింది. మళ్ళీ పెరట్లో మొక్క దగ్గరకు వెళ్ళాను. అక్కడ అనుమానించవలసినదేమీ కనబడలేదు.

మొక్క చుట్టూ ఉన్న మట్టిని చేతులతో పెళ్ళగించడానికి ప్రయత్నించాను. ఆ ప్రయత్నంలో నన్నాశ్చర్యపరచేది ఒకటి నా కళ్ళబడింది. అది ఒక చిన్న సిగరెట్ పీక. అప్పుడే ఇందాక నా గదిలో నాకు అనిపించిన కొత్త వాసన గుర్తుకొచ్చింది. అది సిగరెట్ వాసన. నా గదిలో ఎవరో చాలా సేపు సిగరెట్లు కాల్చారు. ఆ వ్యక్తే ఇక్కడ కొబ్బరి మొక్క దగ్గర మట్టి తవ్వి మళ్ళీ పోశాడు.

సందేహం లేదు. పెరట్లో నిధి గురించి ఎవరికో తెలిసింది. ఇందులో శోభ పాత్ర కూడా వుంది. ఎవరీ శోభ? అని ఆలోచిస్తూండగా వీధి తలుపు తట్టిన శబ్దమైంది. తప్పక శోభే అయి ఉండాలనుకొంటూ ఆ సిగరెట్ పీకను తిరిగి మట్టిలోనే వదిలి చేతులు దులుపుకుని వెళ్ళి తలుపు తీశాను.

నవ్వుతూ లోపలకు ప్రవేశించింది శోభ. ఆలోచిస్తు న్నానేను, మధ్యాహ్నపు సంగతి శోభను అడగాలా వద్దా అన్నది.

ఇద్దరం పడకగదిలో కూర్చున్నాం. శోభకు పొరు గింటావిడ పంపిన గారెలు పెట్టాను. శోభ అడగ్గా వెంక ట్రావు తెచ్చిఇచ్చినట్లు వివరం చెప్పి, వెంకట్రావు చెప్పిన సంగతులు కూడా వివరించాను.

శోభ తనలోనే ముసి ముసిగా నవ్వుకుంటూ "నన్ను నువ్వు క్షమించాలి వసంతా!" అంది.

తర్వాత నెమ్మదిగా శోభ జరిగిన విషయం వివరిం చింది.

తను ఆఫీసుకి వెళ్ళి నా అనారోగ్యం సమాచారం అందజేసి తన ఆఫీసుకి వెళ్ళబోతుండగా ఆమె ప్రియుడు తగిలాడట. అతగాడికి ఆ రోజు ఎందువల్లనో కాళీ అట. శోభను కూడా ఆఫీసుకి సెలవు పెట్టవలసిందని రిక్వెస్టు చేశాడట. శోభ ఒప్పుకుని ఆఫీసులో సెలవు చీటీ ఇచ్చి అతనితో బయల్దేరిందట.

ఇద్దరూ కాసేపు ఓ పార్కులో కూర్చుని కబుర్లు చెప్పుకున్నారట. టైము పదకొండున్నర ప్రాంతంలో శోభ తన ప్రియుడిని నాకు పరిచయం చేయాలనే ఉద్దే శ్యంతో ఇంటికి వచ్చిందట. నేను అంత త్వరగా ఆఫీసుకు వెళ్ళగలనని ఆమె అనుకోలేదట.

ఇంటిదాకా వచ్చాక తలుపు తాళం చూసి శోభ ప్రియుడు నిరుత్సాహానికి మారుగా ఉత్సాహం ప్రకటించా డట. కాంతతో లభించబోయే ఏకాంతవాసం అతని ఉత్సాహాన్ని కలిగిస్తే, శోభను కాస్త కలవర పరిచిందట.

కానీ ఇద్దరూ ఇంట్లో అడుగు పెట్టారు. ఒక గంటసేపు కబుర్లతో కాలక్షేపం చేశారు. తన ప్రియుడిలో మగ తనపుటావేశాన్ని గుర్తించిన శోభ అతన్ని దృష్టి మరల్చడం కోసం పెరట్లోకి తీసుకువెళ్ళింది. కొబ్బరి మొక్కను చూపించి మా సమస్యను తెలియబర్చింది. పురుష పుంగవుడు ఆవేశపడి కొబ్బరిమొక్క దగ్గర సుమారు నిలువెత్తు గొయ్యి తవ్వాడు. ఈ పర్యాయం ఖంగుమన్న శబ్దం రాక పోవడం శోభను చాలా ఆశ్చర్య పరచింది.

అతను విషయం విని "అది ఏదో నిధే అయ్యుంటుంది. కావలసిన వాళ్ళు తవ్వితే అరడుగు లోతులో దొరికేది నాబోటిగాళ్ళు తవ్వితే మూడు నిలువుల లోతుకెళ్ళినా దొరకదు" అన్నాడు.

అతను మళ్ళీ కొబ్బరిమొక్కను యధాస్థానంలో పాతేశాడు. ఆ తర్వాత అతనితో ఏకాంతం ప్రమాదమని గుర్తించి శోభ బయటకు తీసుకెళ్ళిపోయింది.

"మేము వెళ్ళిపోయే ప్రయత్నంలో ఉండగా ఈ వెంకట్రావు కాబోలు తలుపు తట్టాడు. ఆ పరిస్థితిలో సాహసించి తలుపు తీయలేకపోయాను." అంది శోభ.

ఆశ్చర్యంగా అన్నీ విన్నాను. నా అనుమానాలన్నీ తొలిగిపోయాయి. "అయితే నువ్వొక ప్రేమికురాలవన్న సంగతి ఇంతకాలం ఈ స్నేహితురాలికి తెలియకుండా దాచావన్న మాట." అన్నాను నిష్ఠూరంగా.

శోభ నవ్వి "ఇందులో దాచడానికేముందీ ఇంతవరకూ చెప్పడానికి సరైన అవకాశం రాలేదంతే. అతను మా ఊరివాడే నా స్నేహితురాలు సుజాత అన్న" అంది.

ఉలిక్కిపడ్డాను. "అయితే అతన్ని నేనుకూడా చూశాననుకుంటాను" అన్నాను.

"అవును! ఆ వివరాలన్నీ అతను నాకేనాడో చెప్పాడు. కానీ నువ్వతన్ని సరిగా అర్థం చేసుకోలేదని కూడా చెప్పాడు" అంది శోభ.

నేనేమీ మాట్లాలేదుగానీ నాకేవిటో అదోలా అనిపించింది. ఇద్దరు వ్యక్తులు నన్ను "సుజాతా!" అని పిలిచారు. ఆ ఇద్దరూ పరస్పరం తెలిసినవారే. నేను నిధి వుంటుందని అనుమానపడ్డ ప్రాంతంలో ఆ ఇద్దరూ నేను లేని సమయంలో తవ్వకం కొనసాగించారు. ఇది కేవలం కాకతాళీయమా?

అసలు నా ఇంట్లో నిజంగా నిధి వుందా? నా అదృష్టాన్ని తారుమారు చేయగలిగి నంతటి డబ్బును నిధి రూపంలో అమ్మ ఎలా కూడ బెట్టగలిగింది?

నా ఈ ఆలోచనలకు సమాధానం వెంటనే లభించలేదు. లభించదని కూడా నాకు తెలుసు.

ఒక పర్యాయం అమ్మను తలుచుకుని భక్తిభావంతో మనసులోనే ఆమెకు నమస్కరించుకున్నాను.

# 9

ఇంట్లో అమ్మకు ఒక చిన్న పెట్టె వుంది. దాన్ని అమ్మ చాలా భద్రంగా చూసుకునేది. నేను అమ్మ చనిపోయాక ఆ పెట్టెను శుభ్రపరచి నా పెట్టెలో పెట్టుకున్నాను.

ఆ పెట్టెలో కొన్ని కాగితాలూ ఓ రెండు పుస్తకాలూ ఒక దేవుడి పటమూ ఉంటాయి. కాగితాలు ఏవో ఉత్తరాల్లా నాకు అనిపించేవి. పుస్తకాలు ఏవో మామూలు నవలలు. దేవుడి పటం వెంకటేశ్వరస్వామిది.

అమ్మ జీవితానికి సంబంధించిన రహస్యమేదైనా ఆకాగితాల్లో కనబడుతుందేమోనని ఒక పర్యాయం నా పెట్టెలో వున్న ఆ చిన్న పెట్టెని తీశాను.

పెట్టెమూత తెరవగానే వెంకటేశ్వరస్వామి పఠం కనపడాలి. ఆ పెట్టె ఎప్పుడు సర్దినా నేనలాగే ఏర్పాటు చేస్తాను. కానీ ఈ పర్యాయం అలా జరుగలేదు. అన్నిటి కంటె పైన ఉత్తరాలుగా నేను భావించే కాగితా లున్నాయి.

నా మనసు పరిపరి విధాల పోయింది. సందేహం లేదు ఎవరో ఈ పెట్టిని కదిపారు!

ఒక్కక్షణం మనసును చిక్కబట్టుకుని ఆ కాగితా లను చదివాను. అవి వుత్తరాలు కాదు. ఒక స్త్రీని పొగు డుతూ అల్లబడిన వచనకవిత్వం. దస్తూరీ ముత్యాలకోవలా వుంది. నవలలు తీశాను. అట్టతర్వాత రెండుమూడు పేజీలు చించబడ్డాయి. రెండు నవలలకూకూడా చివరి అట్టరెండు నవలలకూ లేదు.

ఆ పెట్టె తెరవడం ద్వారా నేను తెలుసుకున్న చెప్పుకోదగ్గ సమాచారమేదీలేదు కానీ నా ఇంట్లో నా వస్తువులు శోధించబడుతున్నాయన్న అనుమానం కలిగింది. ఈ అనుమానాన్నాధారంగా చేసుకుని నా బీరువాలూ, పెట్టెలూ పరిశీలించాను. వాటన్నిటినీ ఎవరో ఏదో వస్తువు కోసం గాలించినట్లు అతిసులభంగా నాకు గ్రహింప యింది.

శోభ ఈ వ్యవహారంలో ప్రధానపాత్ర వహిస్తోందని కూడా తెలిసిపోయింది. ఈ విషయం తెలియగానే నాకు భయం, బాధ, దుఃఖమూ ఒక్కసారిగా కలిగాయి.

"అమ్మా! ఈ లోకంలో నన్ను ఒంటరిదాన్ని చేసి పోయావు. ఎలా బ్రతికేదమ్మా భయంకరమైన ఈ మను ష్యుల మధ్య" అంటూ చేతుల్లో ముఖం పెట్టుకుని కాసేపు ఏడ్చాను.

క్రమంగానే ఊరట కలిగింది.

శోభ సినిమానుంచి తిరిగేవచ్చే సమయమవుతోందని గ్రహించి నెమ్మదిగా వంట ప్రయత్నం మొదలుపెట్టాను. అన్నం ఉడికేసరికి శోభ వచ్చింది. భోజనాలయ్యాక—

"మనం మూఢ నమ్మకాలంటూ తీసిపారేస్తాంగానీ కొన్నింటిలో నిజముంటుంది" అంది శోభ.

"ఎందు కలాగంటున్నావ్?" అనడిగాను.

"ఖంగు మన్నట్టే అని మాయమైపోయిన నీ నిధిసంగతి మేము కలగజేసుకోవడం వల్లనే అది మాయమైపోయిందని నా అనుమానం."

నేను నవ్వి "అది నిధి అని ఎవరన్నారు? అసలు నా దొడ్లో నిధి ఉందని ఎందుకనుకుంటున్నావ్?" అనడిగాను.

"అంతకుముందు రోజు స్పష్టంగా విన్నశబ్దం మరుసటి రోజుకు మాయమెందంటే మరేకారణమూ తోచడంలేదు. నీ దొడ్లో నిధి గురించి నీకు చీమకుట్టినట్లయినా వున్నట్లు లేదు. ఎప్పుడో దక్కించుకున్నదానిలా నిమ్మకు నీరెత్తినట్లున్నావ్" అంది శోభ భావగర్భితంగా నా వంక చూస్తూ.

"కారణం చెప్పనా - నా దొడ్లో నిధి వుంటుందని నే ననుకోవడం లేదు" అన్నాను.

"నిధి సంగతి నీ కంతగా తెలియదు. హక్కుదారులు కాని వాళ్ళ కది రాయీ, రప్పల్లా, పాముల్లా కనపడవచ్చు. అసలైనవాళ్ళ కంటికే అది ధనంలా కనబడుతుంది."

"ఎందువల్ల?"

"తమ వారసుల కందజేయవలసిందని కోరి ధనాన్ని భూమాతకు అప్పగించినప్పుడు; కేవలం వారసులకే అది

వుపయోగపడేలా చేయడం భూమాత బాధ్యత. ఆమె మహిమవల్లనే నేను చెప్పినట్లు జరుగుతుంది'' అంది శోభ.

''సరే నువ్వు చెప్పినవన్నీ నిజమే ననుకుందాం. అటు వంటప్పుడు నేను కంగారుపడి ఏం ప్రయోజనం? నేను నిధికి వారసురాలనైతే అది నాకు అప్రయత్నంగా లభించాలి. కానిపక్షంలో అదెల్లాగూ నా వశం కాదు'' అన్నాను.

''అలా కాదు. నీకేదైనా పెట్టె భూమిలో దొరికిందనుకో అందులో కేవలం చిల్ల పెంకులున్నాయనుకో. అంత మాత్రాన దాన్నవతల పారేయ రాదు.''

అర్థమయింది నాకు. నాకేమైనా దొరికిందేమోనన్న అనుమానం శోభకు కలిగింది. అందుకా కారణం ఆమె ప్రయత్నించిన సమయానికి భూమిలో ఏ శబ్దం కాకపోవడంతో అందుకే ఆమె ఇల్లంతా శోధిస్తోంది. నేను అదోలా నవ్వి ''భూమిలో దొరికేదైతే కనీసం ఇత్తడి పెట్టయి వుండ వచ్చు. పెట్టెలో చిల్ల పెంకులుంటే యేం? అవతల పారేయడానికి ఇత్తడి మాత్రం తక్కువ ఖరీదులో ఉందా?'' అన్నాను.

''అలాగని నేనలేదు. కానీ అందులో ఉండే చిల్ల పెంకుల విలువ నీకు తెలియదని చెబుతున్నాను'' అంది శోభ.

''సరే అలాంటిదేమైనా జరిగినప్పుడు పెట్టెనాది చిల్ల పెంకులు నీవి. సరా?'' అన్నాను.

''సరే మరి మాట తిరక్కూడదు'' అంది శోభ. ఆ తర్వాత ఇద్దరం కూడా నవ్వుకున్నాం.

మర్నాడు శోభ లేని సమయం చూసి పొరుగింటి వెంకట్రావుకి భూమిలో నాకు దొరికిన నల్లరాతిని చూపించి

"ఇదేమైనా బంగారంలా కనిపిస్తోందేమో చూడు" అడిగాను అనుమానంగా.

ఎందుకంటే ఒకప్పుడు మా ఇల్లు కూడా పొరుగింటి వాళ్ళదే. ఆ విధంగా మా దొడ్లోని నిధికి వెంకట్రావు వారసుడయ్యే అవకాశముంది.

వెంకట్రావు కాస్త ఇబ్బందిగా ఆ రాతిని అందుకుని "బంగారమనుకుందామంటే కనీసం రంగైనా కాస్త పచ్చగా లేదు" అని అవతల పారేయబోయాడు.

"అయ్యోఅలా పారేయకు దీన్ని బంగారంగా భావించి అందుకునే వాడెక్కడో ఈ భూ ప్రపంచంలో పుట్టి తిరుగుతున్నాడు మరి" అంటూ ఆరాతిని మళ్ళీ భద్రంగా అందుకుని పట్టుకుపోయాను. నా మాటల్లోని హాస్యం వెంకట్రావుకి అర్థమయ్యే అవకాశం లేదు పాపం!

# 10

శోభ తవ్వుతోంది. నేను మట్టి తీస్తున్నాను.

అప్పటికి దొడ్లో కొబ్బరి మొక్క కాక మరికొన్ని మొక్కలు పాతాం. ఒక వరుసలో నాడుగు గులాబులు వేశాం. వాటికి కొంచెం ప్రక్కగా కనకాంబరాలు... ఇవతల వంగనారు పాతాం. ఇంకా ధనియాలు, తోటకూర ఒకచోట పక్క పక్కగా వేశాం. ఒక పథకం ప్రకారం అన్నీ చేసుకుంటూ వస్తున్నాం.

ఇప్పుడు మామిడి మొక్క కోసం ఈ ప్రయత్నం. ఇందాకా నేను కొంతలోతు తవ్వాను. ఇప్పుడు శోభ తవ్వుతోంది. నేను మట్టితీస్తున్నాను. నేను మట్టితీసి "ఏదో గట్టిగా తగుల్తోంది మరో దెబ్బవేయ్" అన్నాను. శోభ గునపం పైకి ఎత్తింది. నేలపై బలంగా దింపింది. ఖంగుమన్న శబ్దమైంది. ఆగిపోయిందామె.

ఇద్దరం జాగ్రత్తగా మట్టితీయసాగాము. 'శ్రమ వృధా' అన్న మాటలు ఆ పర్యాయం శోభ నోటినుంచి రాలేదు. ఆమె ముఖంలో ఉత్సాహం కనబడుతోంది. నేనామెకు సహాయం చేస్తున్నాను మట్టి తీయడంలో.

గునపాన్ని వుపయోగించి మొత్తంమీద ఒక వస్తువును బయటకు తీయగలిగాము. అది ఒక చిన్న ఇత్తడి పెట్టె.

శోభ చేతులు వణుకుతున్నాయి. నేను కుతూహలంగా చూస్తున్నాను. "ఇలాంటి పెట్టె భూమికి ఇంత తక్కువ లోతులో దొరుకుతుందని నేననుకోలేదు." అంటూ శోభ పెట్టె తెరచి ఉలిక్కిపడి "చూడు ఇందులో ఏము న్నాయో" అంది.

నేను చూసి "చిల్లపెంకులు" అన్నాను.

"నీకూ అలాగే కన్పిస్తున్నాయా?" అంది శోభ నిరుత్సాహంగా.

"ఇదేనంటావా నిధి" అన్నాను చప్పగా. "మాట తప్పను. చిల్లపెంకులు నీవి ఇత్తడి పెట్టె నాది."

"అదేమిటి వసంతా చేతికి దక్కిన పెన్నిధి చూస్తే నీకు వేళాకోళంగా ఉంది" అంది శోభ ఆదోలా.

"వేళాకోళం కాదు. ఇదివరలో నువ్వూ, సుజాత అన్నా కలిసి తవ్వారు చూడు–నేనింట్లో లేనప్పుడు అదే రోజున నువ్వింట్లో లేనప్పుడు నేనూ అక్కడ తవ్వాను. ఓ నల్లరాయి దొరికింది. దాన్ని భద్రంగా దాచాను. ఈ రోజున చిల్లపెంకులు దొరికాయి. వీటిని ఆ రాతి పక్కన పోస్తాను. బహుశా నేను ఇంట్లో ఇంకో గది కట్టించుకోవాలేమో దొరికిన నిధులు దాచుకోడానికి. ఇంకా ఇలాంటి నిధులెన్ని దొరుకుతాయో ఏమిటో" అన్నాను.

శోభ ఆశ్చర్య పడింది. "అయితే నిధి గురించి నువ్వు వెదుకుతున్నావన్న మాట."

"భలే దానివే నా ఇంటి పెరట్లో నిధిమీద నాక్కాక పోతే నీ కుంటుందంటావా ఆసక్తి!" అన్నాను.

"అయితే నిధి పెరట్లో వుందని నీకు తెలుసా?" అంది శోభ.

"ఉందని తెలియదు కానీ ఇలాంటి సంఘటనలు జరిగి నప్పుడు ఉందేమోనని ఆశ కలుగుతూంటుంది" అన్నాను.

శోభ పరీక్షగా చిల్లపెంకుల వైపే చూస్తోంది. "వీటిని అశ్రద్ధ చేయకూడదు. ఇవి మామూలు చిల్లపెంకులు కాదు ఇత్తడి పెట్టెలోని చిల్లపెంకులు" అంది సాలోచనగా.

"అందుకే అవి నీకే ఇచ్చేస్తున్నాను. పెట్టెమాత్రం నాది_మరిచి పోకూడదు" అన్నాను.

"వీటికి అసలు వారసులెవరో ప్రయత్నించి తెలుసు కోవాలి" అని శోభ అంటూంటే వస్తూన్న నవ్వు నాపు కుని మరో ప్రక్కకు తిరిగాను.

# 11

నేననుకున్నది జరగలేదు. శోభ ఇంకా నాతోపాటే నా ఇంట్లోనే ఉంటోంది. చిల్లపెంకులు మాత్రం భద్రంగా దాచుకుంది. ఒకరిమీద ఒకరికి ఎటువంటి అనుమానా లున్నా మా ఇద్దరి స్నేహం మాత్రం నానాటికీ బలపడు తోంది. ఒకరంటే ఒకరికి ఇష్టం పెరుగుతోంది.

ఒక రోజున నేను శోభను అడిగాను. "వివాహ విష యంలో నువ్వు సర్వస్వతంత్రురాలి వన్నావు. నిన్ను మనసారా ప్రేమించిన వ్యక్తి ఒకడున్నాడు. అతగాడు సర్వస్వతంత్రుడు. మీ ఇద్దరి వివాహానికీ ఇంకా ఆలస్య మెందుకు?"

శోభ సిగ్గు పడింది వివాహం ప్రసక్తి తీసుకు వచ్చి నందుకు. కానీ శాస్త్ర మెల్లగా అంది. "వివాహ మయ్యేక నేను మరి ఉద్యోగం చేయను. ప్రస్తుతం అతని ఉద్యోగం చిన్నది. తన ఒక్కడి సంపాదనతో ఒక చిన్న సంసారాన్ని కంఫర్టబుల్ గా ఈదగల స్థాయికి తన సంపాదన పెరిగే దాకా సన్నాగలసిందిగా అతను కోరాడు. ప్రస్తుతం అత నా ప్రయత్నాల్లో వున్నాడు."

"ఏమిటి ఎక్కడైనా నిధి కొడుతున్నారేమిటి మీ రిద్దరూ కలిసి" అన్నాను శాస్త్ర డైరెక్టుగా.

"అవుననుకో. లేవనుకున్న చెల్లెలు అతనికి, నీ అంత అందమైన ఆడపడుచు నాకు దొరికితే అదే పెద్ద నిధి" అంది శోభ.

"కానీ నా దగ్గర మాత్రం ఏ నిధీ లేదు మరి', అన్నాను.

"దొరకున్కాడదని లేదుగదా దొరికితే మాకిస్తావా?"

"అమ్మో నా నిధి నాది లేకపోతే కాబోయే మా వారిది కానీ అన్నావదినెల కెందుకిస్తాను!" అన్నాను చిలిపిగా.

శోభ నవ్వి "కాబోయే వారికే నిధి కట్టబెట్టాలని చూస్తున్నావు. నీకంటె నిధి ఎందుకమ్మో మీ ఆయనకి" అంది.

"అలాగే సుజాత అన్న అనుకుంటే మీ వివాహం ఇంకా కాకుండా ఉండేదా?"అన్నాను జవాబుగా. శోభ మరి మాట్లాలేదు.

నేను మళ్ళీ అన్నాను "శోభా నువ్వెందుకు నా జీవితంలో ప్రవేశించావో నాకు తెలియదు. కానీ భయంకరమైన ఒంటరితనం నుంచి నన్ను రక్షించి నా జీవితంలో

ఉల్లాసాన్ని ప్రవేశ పెట్టావు. నీకు నేను సర్వదా కృతజ్ఞురాలిని.''

శోభ ఇంకా మాట్లాడలేదు. ''ఒంటరి ఆడదాన్ని నాకు నిజంగా పెద్ద నిధి దొరికిందనుకో అనుభవించడానికి కాలకాలం బ్రతకగలనంటావా?'' అనడిగాను మళ్ళీ నేను.

''అదేం అనుమానం_అసహ్యంగా'' అంది శోభ.

''ఎందుకో నాకు భయంగా ఉంది. నా పెరట్లో నిధి ఉందో లేదో నాకు తెలియదు. కానీ కొంతమంది ఇతరులకా అనుమానముండి వెతుకుతున్నారని నేను గ్రహించాను. వాళ్ళకు ఎందుకా అనుమానం వచ్చిందో మాత్రం నాకు తెలియకుండా ఉంది.''

శోభ తమాషాగా నవ్వి ''ఉదాహరణకు నీ అనుమానం నా మీదనే ఉన్నదనుకో. డబ్బుకోసం హత్యల వరకూ వెళ్ళేటంత ధైర్యం ఉన్న మనిషిగా నేను కనబడుతున్నానా? ఏదో సామాన్య మానవురాలిని, ఉంటే కాస్త నీ డబ్బు మీద ఆశ ఉండొచ్చు'' అంది.

శోభ మాటల్లో నాకు ఎన్నో అర్థాలు గోచరించాయి. నేనామె మన స్తత్వాన్నీ, ఆమె మనసులోని ఉద్దేశ్యాన్నీ ఇంకా సరిగా అంచనా వేయలేక పోతున్నాననే చెప్పాలి.

శోభ నా వంక ప్రేమగా చూసి ''నాకు తెలీకడుగుతానూ_ నీ పెరట్లో నిధి వుందని నీకు తెలీదూ'' అంది.

''ఎలాగని అనుకోను? ఈ ఇల్లు అమ్మ కొన్నది. అందువల్ల మా పూర్వీకులెవరైనా పెరట్లో నిధి పాతిపెట్టి వుంచే అవకాశం లేదు. అమ్మ నా కోసం నిధిని పెరట్లో పాతిపెట్టి ఉంచగలిగేటంత ధనవంతురాలుకాదు.

ఎన్నో శ్రమలకోర్చి నన్ను పెంచి పెద్ద చేసింది అమ్మ. అటువంటప్పుడు పెరట్లో నిధి ఉంటుందని నేననుకునే అవకాశ మెక్కడిది?"

"ఈ ఇల్లు కొనేముందే మీ అమ్మకు ఈ ఇంట్లో నిధి వున్నదని తెలిసుండవచ్చును. అందుకే ఆవిడ ఈ ఇల్లుకొని ఉండవచ్చును. పెరట్లో నిధి ఉన్నట్లుగా ఎన్నడు మీ అమ్మ నీకు చెప్పి వుండ లేదా?" అనడిగింది శోభ.

నేను కాస్త సూటిగానే శోభవంక చూస్తూ ఇలా అడిగాను. "శోభా మా పెరట్లో నిధి వుందని మాఅమ్మకు తెలిసే అవకాశమున్నట్లు కేవలం ఊహించి తెలుసుకోవడం సాధ్యం కాదు. నీ ప్రశ్నను బట్టి మా అమ్మకు పెరట్లో నిధి ఉన్న విషయం తెలుసునన్న సమాచారం నీకు ఖచ్చితంగా అంది వుండాలనే నేనూహించుకో గలుగుతున్నాను. ఇన్నాళ్ళ మన స్నేహాన్ని పురస్కరించుకుని ఈ నిజాన్ని నాకు చెప్పవలసిందిగా కోరుతున్నాను. చెప్పగలవా?"

"తప్పక చెబుతాను. మా ఆఫీసులో కొలీగా ఒకామెకు ఒంట్లో సరిగాలేక జనరల్ హాస్పటల్ లో జాయిన్ అయింది. ఆమెను చూడ్డానికి నేను వెళ్ళాను. అప్పుడు మీ అమ్మ ప్రాణాపాయ స్థితిలో వున్నది. డాక్టర్లు అనుకోని పరిస్థితి అనుకుంటూ కంగారు పడుతున్నారు.

ఆ సందర్భంలో ఆవిడ నీ పేరు కలవరించి పెరట్లో నిధి వుంది కదమ్మా నేను లేకపోయినా నువ్వు సుఖపడతావు అంటూ కలవరించింది. ఆవిడ మాటలు నేనొక్కర్తినే శ్రద్ధగా ఆసక్తితో విన్నాననుకుంటాను. అటువంటి కలవరింతలూ, పలవరింతలూ అక్కడి డాక్టర్లకూ, నర్సులకూ మామూలే కదా.

ఆ పరిస్థితుల్లో నేనామె దగ్గరకు వెళ్ళాను. ఒక నర్సు "కూతురికోసం కలవరించిపోతోంది, మగతలో వుంది. ఒక్కసారి అమ్మా అని పిలిచి ఆవిడ చేతిలో చేయివేసి చూడ'మని రిక్వెస్టు చేసింది.

నేనలా చేయగానే ఆవిడ నా చేతిని బలంగా పట్టుకుని "నీకోసం పెరట్లో పెద్ద నిధి వుంచానమ్మా! తీసుకుంటావు కదూ తప్పక తీసుకుని ఇంతకాలం స్వార్థంతో నిన్ను బాధ పెట్టిన నీ తల్లిని క్షమిస్తావు కదూ" అంది. ఆ క్షణంలో నాకు కళ్ళనీళ్ళు తిరిగాయి. ఆవిడ బలవంతంగా కళ్ళు తెరవడానికి ప్రయత్నిస్తోంది. తలచుకుంటే ఆ దృశ్యం నా కళ్ళముందు భయంకరంగా మెదుల్తోంది.

నా చేతిని పట్టుకునే నన్ను తన కూతురిగా భావిస్తూనే ఆవిడ నా కళ్ళముందే మరణించింది. ఆవిడ నీ తల్లి అని నీ ఇంట్లో అడుగుపెట్టిన రోజునే తెలుసుకోగలిగాను."

"ఒక అపరిచితురాలు నీకు తన ఇంట్లో నిధి వుందని విచిత్ర పరిస్థితుల్లో చెప్పడమూ, నేను నీ స్నేహితురాలు సుజాతను ముమ్మూర్తులా పోలి వుండడమూ, అనుకోకుండా నువ్వు నా యింట అద్దెకు ప్రవేశించడమూ, నేను లేని సమయంలో మరో పురుషుడి సాయంతో పెరట్లో గోతులు తవ్వడమూ ఇవన్నీ కాకతాళీయంగా జరగడం తమాషాగా లేదూ!" అన్నాను.

శోభ నవ్వి "అదే నేనూ నీతో అందామనుకుంటున్నాను. ఒకోసారి నిజాలు కల్పనకు మించి తమాషాగా వుంటాయి" అంది.

"నిజమే కొంతమంది కల్పనలను నిజాలుగా నమ్మించ గలరు" అని, "శోభా నువ్వు అదృష్టవంతురాలివి. అమ్మ చివరి క్షణాల్లో అక్కడ వున్నావు. నాకా అదృష్టం

దొరకలేదు. నిజంగా ఏదైనా నిధి నా వశమై నా చేతుల్లో హక్కు వుంటే నీకు అందులో సమభాగం ఇవ్వాలనుంది' అన్నాను.

"చాలా థాంక్స్. కానీ నిధి నీ వశం కావడానికి నువ్వు సరైన ప్రయత్నాలేమీ చేయడం లేదు" అంది శోభ ముక్తసరిగా.

"దొరకవలసిన నిధి మనకు దొరకనే దొరికింది. కానీ అందులో అన్నీ మనకు చిల్లపెంకుల్లా కనపడుతున్నాయి" అన్నాను.

"నాకు తెలుసు వసంతా నన్ను వేళాకోళం చేయడానికి నువ్వే అక్కడ అది పాతిపెట్టావని" అంది శోభ.

ఉలిక్కిపడ్డాను. శోభ మనసులోంచి నిధి గురించిన ఆశలను తొలగించడం కోసం నేనా పని చేసిన మాట వాస్తవం. కేవలం నిధి కోసమే ఆమె నాతో స్నేహం చేసి వున్నట్లయితే అంతటితో నన్ను వదిలిపెడుతుందనుకున్నాను. కానీ అలా జరగలేదు.

నా అభిప్రాయంలో సుజాత అన్న చాలా తెలివైన వాడు. అతనే ఈ విషయం వూహించి ఆమెకు చెప్పి వుండాలి. బహుశా నా ఇంట్లో జరిగే ఆసక్తికరమైన ప్రతి విషయం గురించీ ఇద్దరూ చర్చిస్తూ వుండివుండాలి.

నేను శోభ వంక చూసి "అయితే నీకు అన్నీ తెలిసి పోయాయన్న మాట. ఇంక మనం నిధి గురించి గట్టి ప్రయత్నాలు చెయ్యవలసి వుంది" అన్నాను.

## 12

మా ఇంటికి వెంకట్రావు తల్లి కాస్త తరుచుగానే రావడం జరుగుతోంటుంది.

ఆ రోజు మొదటిసారిగా పెరట్లో మేము తీసుకొచ్చిన మార్పులు చూడ్డానికి ఆవిడ కుతూహలపడింది. నేనూ శోభా ఆవిడను పెరట్లోకి తీసుకెళ్ళాం. మేము చాలా అందంగా దొడ్డిని తయారు చేశామని ఆవిడ మెచ్చుకుంది.

ఒకోసారి దొడ్డంతా కలయ తిరిగి హఠాత్తుగా "అమ్మా వసంతా దొడ్లో ఎక్కడా తులసి మొక్క కన పడదేం? మీ అమ్మ ఉన్నప్పుడు రోజూ భక్తిగా తులసికి పూజ చేసేదనుకుంటూను" అంది.

హఠాత్తుగా నాకు గుర్తుకొచ్చింది. అమ్మ స్నానం చేసి రోజూ పుదయం తులసి మొక్కకు పూజ చేసేది. ఏడాది క్రితం వరకూ దొడ్లో తులసి కోట మట్టితో మెత్తినది వుండేది. ఎందుకో అమ్మ ఆ కోటను ఎత్తేసి మొక్కను మామూలుగా భూమిలో పాతింది. రోజూ పూజలు మాత్రం మానలేదు.

మనకు నిధి నిక్షేపాలను ఈ తులసి మొక్కే దారి చూపిస్తుందమ్మా అంటూండేది. అప్పట్లో ఆ మాట అర్థం నేను సరిగా గ్రహించలేదు. ఇప్పుడు నాకు అందులో ఏదో అర్థముందనిపించసాగింది.

సరైన సంరక్షణ లేక అమ్మ పోయిన కొద్దివారాలకే ఆ మొక్క ఎండిపోతే నేను ఎన్నో పూజలు చేసిన అమ్మను అకాల మరణం నుంచి తప్పించలేక పోయిన ఆ మొక్కను పీకి అవతల పారేశాను. బహుశా ఆ మొక్క క్రింద నిధి వున్నదేమో! ఆ మొక్క వుండే స్థలం నాకు బాగానే గుర్తుంది.

"ఎండిపోతే పీకి అవతల పారేశానండీ" అని ఆవిడకు చెప్పినప్పటికీ నా మనసంతా ఏవేవో వూహల్లోకి జారి పోతోంది.

"ఎంత పని చేశావమ్మా తులసి అంటే ఇంటికి ఇలవేల్పు. రేపు నేను నీకో మొక్క పంపిస్తాను వేసుకో. పూజ చేసుకున్నా చేసుకోకపోయినా రోజూ కాసిని నీళ్ళు మాత్రం పోస్తూండు" అంది.

ఆవిడ వెళ్ళిపోయాక నేను శోభతో "నిధి అమాకీ దొరికింది" అన్నాను.

"బహుశా తులసి మొక్క కింద వుండి వుంటుందను కుంటున్నావు కదూ" అంది శోభ సాలోచనగా.

"కానీ ఆ మొక్క ఎక్కడుండేదీ ఇప్పుడు నాకు గుర్తు లేదు" అన్నాను.

శోభ ఒక్క నిముషంపాటు ఏమీ మాట్లాడలేదు. ఆ తర్వాత ఏదో గుర్తుకు వచ్చినదానిలా—"అన్నట్లు మరిచే పోయాను నా జాకెట్లు కుట్టేశాననీ ఈవేళ వచ్చి తీసుకు పోవచ్చుననీ బట్టలు కుట్టే జానకమ్మ తనకు చెప్పినట్లు ఆఫీసులో నా కొలీగ్ సుమిత్ర చెప్పింది. సాయంత్రం ఆఫీసునుంచి వచ్చేటప్పుడు తెచ్చుకుందామనుకుని మర్చి పోయాను. ఇప్పుడు వెళ్ళి తెచ్చుకుంటాను. నువ్వు కూడా వస్తావా?" అనడిగింది.

శోభ కావాలనే నాకా అవకాశం కల్పించిందో లేక నిజంగా తనకు పని వుందో తెలియదు కాని, నేనుమాత్రం ఈ అవకాశాన్ని జారవిడవదల్చుకోలేదు. "ఆఫీసు నుంచి వచ్చి మళ్ళీ బయటకు వెళ్ళాలంటే ఈ రోజెందుకనో బోరుగా వుంది" అన్నాను.

శోభ నన్ను బలవంతం పెట్టలేదు. ఆమె వెళ్ళిన తర్వాత అయిదు నిమిషాలు మాత్రం ఆగాను. ఆ తర్వాత చకచకా దొడ్లోకి వెళ్ళాను.

జాగ్రత్తగా పరిశీలిస్తూ ఒకప్పుడు అమ్మ పూజలు చేసే తులసి మొక్క పాతబడ్డ ప్రదేశాన్ని గుర్తించాను. అదృష్ట వశాత్తూ గునపం ఇంట్లోనే వుంది. తీసుకు వచ్చి త్రవ్వడం మొదలు పెట్టాను. చేతులు వణుకుతున్నాయి. ఆశ, ఉద్రేకమూ కలిసిన వింత సమ్మిళిత భావాలు మదిలో మెదులుతున్నాయి. నేను ఇంకా ఎంతో త్రవ్వకుండానే వీధి తలుపు తట్టిన చప్పుడయింది.

ఎవరై వుంటారు? శోభా! జానకమ్మ ఇంటికి వెళ్ళి రావడానికి కనీసం ముప్పావు గంట పడుతుంది. ఏమైతే నేం నేను త్వరగా మట్టి మళ్ళీ కప్పేసి గునపం లోపల పెట్టి చేతులు కడుక్కొని తలుపు తీయడానికి వెళ్ళాను.

వచ్చినది శోభే. "జానకమ్మ సినిమాకు వెడుతూ దారిలో ఎదురైంది" అంది శోభ.

శోభ పథకం నాకర్థమైంది. చాలా తెలివిగా ఆమె నిధి వున్న స్థలాన్ని తెలుసుకోగలిగింది? పెరటి వైపుకు వచ్చి నా చర్యలను ఆమె పెరటి తలుపు ద్వారా చూసి వుండే అవకాశముంది.

నాకు భయమూ, కోపమూ బెంగా వగైరా రకరకాల భావనలు కలిగాయి. కానీ నిస్సహాయురాలిని. ఆ పరిస్థితిలో శోభను చేయిదాటనిచ్చి ఆమె ప్రియుడితో సహా నిధి మీద దండయాత్ర చేయడానికి అవకాశమివ్వకూడదనిపించింది.

అందుకే ఆమెతో "మంచి పనే జరిగింది పద. నిధి కోసం ప్రయత్నిద్దాం" అని ఆమెను తీసుకుని దొడ్లోకి వెళ్ళాను. ఇద్దరం తవ్వకం మొదలు పెట్టాం—ఇందాక నేను తవ్విన చోటనే.

నిజానికి మేము ఏంతో లోతు తవ్వలేదు. ఖంగుమన్న

శబ్దం వినబడింది. మరికొంత ప్రయత్నం మీద ఒక చిన్న ఇత్తడి పెట్టెను బయటకు తీశాం.

మరుక్షణంలోనే నా తల మీద ఏదో వస్తువు బలంగా పడినట్లనిపించింది. నా తల బరువెక్కింది. ఆ తర్వాత స్పృహ తప్పిందనుకుంటాను.

స్పృహ తప్పే ముందు "దొంగ–దొంగ" అన్న శోభ కంఠం నెమ్మదిగా నా చెవుల బడింది.

# 13

నాకు ఎదురుగా శోభ కనపడింది. నేను కళ్ళు విప్ప గానే శోభ ముఖంలో ఆనందం కనబడింది. "ఎలా వుంది నీకు?" అనడిగింది.

నాకు ఇంకా తల కాస్త బరువుగా వుంది. జరిగినది గుర్తు చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాను. నెమ్మదిగా గుర్తుకు వస్తోంది. నేనూ శోభా పెరట్లో నిధి కోసం తవ్వడమూ, ఒక ఇత్తడి పెట్టెను వెలికి తీయడమూ, ఎన్నో ఆశలతో నేనా ఇత్తడి పెట్టె వంకే చూస్తూ ఉండటమూ. అంతే. ఆ తర్వాత మళ్ళీ యిప్పుడు నా ఎదుట శోభ!

"అసలేం జరిగింది? నేనిక్కడి కెలా వచ్చాను?" అనడిగాను.

"మనం నిధి కోసం ప్రయత్నించి విజయం పొందిన సందర్భంలో ఎలా వచ్చాడో ఒక దొంగ వెధవ నీ తల మీద బలంగా కొట్టి నేనాశ్చర్యంలోంచి తేరుకునేలోగా నిధి వున్న యిత్తడి పెట్టెను బట్టుకుని పారిపోయాడు. తక్షణ కర్తవ్యంగా నాకు నిన్ను హాస్పిటల్లో జేర్చడం తప్ప మరేమీ కనబడలేదు. అప్పట్నించీ నేను ఇక్కడే ఉండి నీకు స్పృహ రావడం కోసం ఎదురు చూస్తున్నాను.

అదృష్టవశాత్తూ నీకు తగిలిన దెబ్బ బలమైనది కాదట”
అంది శోభ నిట్టూరుస్తూ.

నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి “అయితే నిధి చేజారి పోయిందన్న మాట” అన్నాను బాధగా.

“అవును. నేను దగ్గిరుండి కూడా నీకు సహాయపడ లేకపోయాను” అంది శోభ దిగులుగా.

కానీ నాకు బాగా అనుమానంగా ఉంది. నా నిధి మాయం కావడంలో శోభది ప్రధానపాత్ర అని. కానీ ఆశ్చర్య మేమిటంటే నిజంగా ఇంటి పెరట్లో నిధి వుండ డమూ, అమ్మకు ఆ విషయం తెలిసి వుండడమూ, తులసి మొక్క కింద అమ్మ నిధిని వుంచిందని ఖచ్చితంగా తెలిస్తే నేను అంత తొందరపడి శోభకు దొరికిపోయేలా ఆ ప్రయత్నం చేసి వుండేదాన్ని కాదు.

నేనూ, శోభా కలిసి త్రవ్వి పెట్టెను ఒకదానిని వెలికి తీయగలిగినప్పుడు నాకు కలిగిన ఆనంద మింతా అంతా కాదు. అయితే ఆ సమయంలో మరొకరు మా ఇంట్లో జొరబడే అవకాశమూ లేదు.

సుజాత అన్నకు శోభ ఏ సమాచారమైనా అందచేసే అవకాశం సాయంత్రం వున్నదని నాకు తోచడంలేదు. శోభ బయటకు వెళ్ళే నెపంతో దొడ్లో నేను నిధి కోసం ప్రయత్నం చేసే అవకాశమిచ్చి తను పెరటి వైపుకు వచ్చి నా చర్యలను గమనించి నేను శాస్త్రవ్యాకం మొదలు పెట్టగానే వచ్చి తలుపు తట్టి వుంటుం దని నా వూహ. అయితే ఆ తర్వాత మరో వ్యక్తి వచ్చిన అలికిడి కాలేదు.

ఇప్పుడు నాలో మరో అనుమానం రేకెత్తుతోంది. నన్ను శోభే కొట్టి వుంటుంది. తర్వాత విషయం పోలీసుల

వరకూ పోకుండా వుండడం కోసం, పోయినా తన మీద అనుమానం రాకుండా వుండడం కోసం ఆమే నన్ను స్వయంగా హాస్పిటల్ లో జేర్చింది.

"శోభా, ఏమాత్రం వీలుపడ్డా నీకు నా విధిలో భాగమిస్తానని ఓసారి నీతో అన్నాను. కానీ నిధి నీ చేతుల్నించి నా చేతులదాకా రాలేదు. అమ్మకు నిధి పాతిపెట్టేటంత సంపద ఎక్కడిదో నాకు తెలియదు. కానీ అది ఆమె కేవలం నాకోసం సంపాదించింది. కేవలం నాకు మాత్రమే ఉపయోగపడాలనే అభిప్రాయంతో దాన్నామె భూస్థాపితం చేసింది. భూమాత ప్రభావం వల్ల అది ఏ నీబోటిగాళ్ళ చేతుల్లోనో పడి చిల్లపెంకుల కిందో, మరే విధంగానో కనపడితే తిరిగి దానిని నిధిగా మార్చడానికి నేనున్నానని గుర్తుంచుకొంటేచాలు. అది ఒకవేళ నీ చేతిలోనే ఇంకా వుండి వున్నట్లయితే ఏమాటా కోరకుండా నీకు నిధిగా మార్చి పెడతాను. అమ్మ కష్టార్జితం ఎవరికీ కాకుండా వృధాగా పోకూడదు" అన్నాను.

అప్పటికి నాకు దుఃఖం ముంచుకురాగా రెండు చేతులూ ముఖానికి కప్పుకొని ఏడ్చాను.

నాకు తెలుసు. నేనిప్పుడు పూర్తిగా నిస్సహాయురాలిని. తెలిసి కోరికతో తలగోక్కున్నాను. ఇంతకీ నా రాత అలావుంది. అమ్మే నాతో తను ఫలానా చోట నాగురించి నిధిని పాతానని చెప్పి వుంటే నాకీ కష్టాలే వుండి వుండేవికాదు.

## 14

మర్నాడుదయమే నేను తిరిగి ఇంటికి వచ్చేశాను.

తగిలిన దెబ్బ ఏమాత్రమూ ప్రమాదకరమైనది కాదని డాక్టరు అన్నప్పుడే అది శోభ లాంటి బలహీనురాలు

కారణంగా తగిలిన దెబ్బ అని ఊహించగలిగాను. నేనూ బలహీనురాలినే కావడం వల్ల నాకు ఆమాత్రం దెబ్బకే స్పృహతప్పి వుండాలి. నేను స్పృహతప్పి పడిపోతు న్నట్లు శోభ గుర్తించి వుంటుంది.

అందుకే ఎవరో ఇతరులు నన్ను కొట్టారన్న భ్రమ కలిగించడం కోసం నెమ్మదిగా దొంగ అనరిచి వుంటుంది.

ఆఫీసుకి సెలవు పెట్టి ఇంట్లోనే వుండి పోయాను. శోభ వుంటానన్నా వద్దని ఆఫీసుకి పంపించేశాను. ఒంట రిగా ఆలోచిస్తూ మంచం మీద పడుకుంటే ఎప్పుడో తెలియకుండా నిద్ర పట్టేసింది.

మెలకువ వచ్చేసరికి ఎవరో తలుపు తడుతున్నారో లేక ఎవరో తలుపు తట్టడంవల్ల మెలకువ వచ్చిందో ఖచ్చితంగా చెప్పలేను కానీ లేచి వెళ్ళి తలుపు తీశాను.

మొట్టమొదటిసారిగా నేను శోభనూ,సుజాత అన్ననూ కలిపి చూశాను. సుజాత అన్న చేతిలో ఒక సంచీ వుంది. ఇద్దరు మౌనంగా లోపలకు ప్రవేశించారు.

నేను తిరిగి తలుపు వేయడమేమిటి, శోభ నా కాళ్ళ మీద వాలిపోయి "ఒక వుత్తమ స్నేహితురాలిని మోసం చేయాలనుకున్నందుకు నన్ను క్షమించగలవా?" అంటూ ఏడ్చింది.

శోభ ఏడవడం నాకు విపరీతంగా ఆశ్చర్యాన్ని కలిగిం చింది. కారణం సరిగా ఊహించలేక పోయాను. రెండు చేతులతో ఆమెను పైకి లేవనెత్తుతూ మరో నాటకానికిది నాందీ ప్రస్తావన కాదుకదా, అనుకున్నాను.

ముగ్గురం మౌనంగా నా గదిలో ప్రవేశించి తలో కుర్చీలో కూర్చున్నాం. సుజాత అన్న మౌనంగా తనచేతి సంచి లోంచి ఏదో బయటకు తీసి మౌనంగా నాకు అందిం

చాడు. నా కళ్ళు మెరిశాయి. నా మదిలో ఎన్నో ఆలోచనల తరంగాలు వుప్పొంగుతున వుబికాయి.

అది నిన్న సాయంత్రం పెరట్లో నేనూ శోభా కలిసి కనుగొన్న పెట్టె. అంటే నే నూహించిన విధంగానే జరిగిందన్న మాట. శోభ ఈ దొంగతనంలో ప్రధాన పాత్ర వహించిందన్న మాట. అయితే ఆ పెట్టె తిరిగి నాదగ్గర కెందుకు తీసుకొచ్చేరు? పెట్టెలో ఏముంది చిల్ల పెంకులా, లేక తేళ్ళు పాములా, లేక...

వణుకుతున్న చేతులతో నేను పెట్టె తెరిచాను. పెట్టెలో కనపడ్డవి నన్ను అమితంగా ఆశ్చర్య పరిచాయి. అన్నిటి కంటె పైన వున్న కాగితం ఒక నవలలోంచి చింపబడ్డ మొదటి పేజీ. ఆతర్వాత....

# 15

"నేను, రుక్మిణిని ప్రేమ వివాహం చేసుకోవడం ఇంట్లో ఎవరికీ ఇష్టంలేదు. ఆకారణంగా నేను ఆ స్తికీ, రుక్మిణికీ - మనసులో పోటీ పెట్టవలసి వచ్చింది. రుక్మిణి నెగ్గింది. ఆస్తి వదులుకుని స్వతంత్ర జీవితం ప్రారంభించాను.

అదృష్టం కలసిరాగా రెండు సంవత్సరాలలో నే పైకి రాగలిగాను. రుక్మిణి అదృష్టంతో నన్ను గొప్పవాణ్ణి చేయసాగింది. నేను స్వయంకృషితో పైకి రావడం చూసి ఆ స్తి వదులుకోవడంతో అధోగతికి పోతాననుకున్న నమ్మకం నిజంకాని కారణం వల్ల నేమో, అమ్మా, నాన్న నన్ను తిరిగి ఆదరించారు.

ఆ ఆదరణలోని మర్మం నేను తెలుసుకోలేక పోయాను. రుక్మిణిమీద నా తలిదండ్రులకు పగ వుంటుందని ఊహించ లేక పోయాను. తలిదండ్రులు చెప్పిన అబద్ధపు మాట

లనూ, చూపిన తప్పుడు సాక్ష్యాలనూ నమ్మి నా జీవిత భాగ్యలక్ష్మి, అర్ధాంగీ అయిన రుక్మిణి శీలాన్ని అనుమానించ గలిగేటంత నీచపు స్థాయికి దిగజారిపోయాను.

రుక్మిణి అభిమానవతి. నా అనుమానాన్ని అతికష్టం మీద మొట్టమొదటిసారి ఆమె ముందు బయట పెట్టి నపుడు ఆమె దెబ్బతిన్న పులిలా నావంక చూసింది. ఆ సమయంలో ఆమె అన్నమాటలు నేను జీవితంలో మరచి పోలేను.

"మీకు సంబంధించి నంతవరకు ఈ రుక్మిణి చచ్చి పోయింది. ఇంత అసత్యకరమైన, అవమానకరమైన అను మానం మనసులో పెట్టుకున్న భర్తతో నేను కాపురం చేయలేను. కానీ ఈలోకానికి సంబంధించి నంత వరకు రుక్మిణి చావలేదూ, చావదు. భర్త పంచనలేకుండా స్వచ్ఛమైన జీవితాన్ని నడపగలనని ఋజువు చేస్తాను. కానీ మళ్ళీ మీకళ్ళ పడను."

అవే రుక్మిణి చివరి మాటలు. ఆమె ఇల్లు వదిలి వెళ్ళి పోయాక అతి స్వల్పవ్యధిలోనే నాతప్పూ, పొరపాటూ నాకు తెలిసి వచ్చాయి. అయితే అప్పటికే సమయం మించి పోయింది.

ఒక పర్యాయం పేపర్లో ప్రకటనవేస్తే సమాధానంగా రుక్మిణి వద్ద నుంచి, తనను వెదికే ప్రయత్నాలు చేస్తే చూడగలిగేది తన శవాన్ని మాత్రమేనని వుత్తరం వచ్చింది.

రుక్మిణి గురించి నేనేమీ తెలుసుకోలేక పోయినా నా గురించి ఆమె తెలుసుకుంటూనే వుంది. అడపాతడపా ఆమె నాకు త్తరాలు రాసేది.

ఒక సంవత్సరం క్రితం ఆమె నాతో ఫోన్‌లో కూడా మాట్లాడింది. ఇంతకాలం భార్యను మరచి పోకుండా వున్నందుకి, మరో వివాహం చేసుకోనందుకు నన్నభినందించింది. కన్న కూతురి భవిష్యత్ బంగారం చేయాలన్న బలహీనత తనను మళ్ళీ నా దగ్గరకు చేరుస్తుందేమోనని భయపడుతున్నానని చెప్పింది. తన సచ్ఛీలతకు ముమ్మూర్తులా తండ్రినే పోలివున్న తన బిడ్డే సాక్ష్యమని అంది.

తనకు అర్ధాంతరపు చావువస్తే మాత్రం తన కూతురిని ఆదరించమనీ, నా కూతుర్ని నేను గుర్తుపట్టడానికి కొన్ని సాక్ష్యాలను వుంచుతాననీ చెప్పింది. అయితే నువ్వు నా దగ్గరకు రావాలని నేను బాధగా అడగ్గా సమాధానంగా టెలిఫోన్ నిట్టూర్పూ ఆపైన క్లిక్ మన్నశబ్దమూ వినిపించాయి. ఆతర్వాత ఈ రోజు ఈ విధంగా నా చిట్టి పాపను చూడడం జరిగింది..."

ఆపైన ఆయనకు మాటలు పెగల్లేదనుకుంటాను, మరి మాట్లాడలేక పోయారు.

ఎవరూ లేరనుకుంటున్న నేను తండ్రి స్థానంలో నిలబడి వున్న ఆ అమృతమూర్తిని చూస్తూ సంతోషం, దుఃఖం వగైరా విచిత్ర సమ్మేళన భావాలతో సతమతమౌతున్నాను.

కానీ అమ్మకథ నాకు బాగా ఇప్పుడర్థమైంది. అభిమానంతో, పట్టుదలతో ఇల్లు వదిలి సంపదలకు దూరమైనా ఎన్నడూ వాటి గురించి బాధ చెందలేదు. ఏ పరిస్థితుల్లోనూ తన పట్టుదలను సడలించుకోలేదు. ఎదుగుతున్న కూతుర్ని చూసినప్పుడల్లా ఆమెకు బాధగా వుంటూండేది. నిధి పేరిట ఆమె భర్తకు, తనకూ సంబంధించిన ముఖ్య

గుర్తులూ, నాకు సంబంధించిన ముఖ్య గుర్తులూ, తన జీవితవివరాలూ, తను సంతకం చేసిన నా ఫోటోలూ ఒక పెట్టెలో భద్రంగా దాచి వుంచింది. ఆమె ఎంత పకడ్బం దీగా ఏర్పాట్లు చేసిందంటే వేరెవ్వరూ నా పేరుతో ఆ నిధిని వశం చేసుకోలేరు.

శోభా, సుజాత అన్నా పెట్టెలోని విశేషాలూ, వివరాలూ, చూసి అది నిధికాదనీ, కేవలం నాకు మాత్రమే ప్రయోజనకారి అనీ గ్రహించి, చేసిన తప్పుకు పశ్చాత్తాప పడి నా దగ్గరకు తిరిగి వచ్చారు. పెట్టెలో గత పది పదిహేను సంవత్సరాలుగా తనభర్త చిరునామా వివరాలు రాయబడి వున్నాయి. సుజాత అన్న ఆ చిరునామా వ్యక్తి వద్దకు నన్ను చేర్చడానికి సహాయపడ్డాడు.

అమ్మ మాటలూ నిజమయ్యాయి. ఆమె నాకోసం దాచి పెట్టిన నిధి నన్ను అపార సంపదలకు ఏకైక వారసురాల్ని చేసింది. అమ్మ దానిని ఏ ఉద్దేశ్యంతో నిధి అని పిలిచిందో నాకు తెలియదు కానీ నిజంగా దానికి నిధి అన్న పేరు తగును. ఎందుకంటే అది నా చేయి దాటి పోయినా చివరకు నాకు తప్ప మరెవ్వరకూ వుపయోగపడ లేక పోయింది.

కొత్త జీవితం ప్రారంభించేక నాకు అమ్మ చేసిన పెద్ద పొరబాటు అర్థమయింది.

అభిమానానికీ, పట్టుదలకూ ప్రాముఖ్యతనిచ్చి ఆమె జీవితంలో తనకూ తన భర్తకూ మనశ్శాంతి లేకుండా చేసింది. నాన్నగారి లాంటి ప్రేమమూర్తిని వదులుకుని ఆమె జీవితంలో ఏం సాధించిందో నా కర్థం కాకుండా వుంది.

కానీ నాన్నగారు మాత్రం అది అమ్మతప్పు కాదనీ, తను చేసిన తప్పుకు భగవంతుడు తననా విధంగా శిక్షించాడనీ అంటూంటారు.

ఇంతకాలం సంపదకు నన్ను దూరంగా వుంచినందుకు తన్ను క్షమించలేనని అమ్మ అనుకుంది. అయితే పిల్లలకు కావలసిన సంపద డబ్బు రూపంలో కాదు, ప్రేమరూపంలో! తను బ్రతికున్నంతకాలం నా కాలోటులేదు, తన మరణానంతరంకూడా నా కా లోటు లేకుండా చేసిన అమ్మకు నేను సర్వదా ఋణపడి వుంటాను.

కానీ నాన్నగారి వంటి వుత్తమ మానవుడి ప్రేమకు తను దూరంకావడమే కాక నన్నుకూడా దూరంచేసిన అమ్మ తప్పును క్షమించడం నావల్ల అవుతుందో కాదో నాకు తెలియదు.

"అంతా ఆపైవాడి లీల." అంటారు నాన్నగారు.

పైవాడి లీలసంగతి ఎలా వున్నా ప్రతి మనిషి, తన అభిమానానికీ, పట్టుదలకూ కాస్త హద్దులు ఏర్పరచుకోవాలన్న సత్యాన్ని మాత్రం నేను గుర్తించాను. అమ్మ కథ తెలిపే సత్యం నాకు తెలిసినంతవరకూ, ఇదే!

—: ఐపోయింది :—

# గంధం దొంగలు!!

## శ్యాంబాబు

శివపురి పెద్ద వూరేమీ కాదు. జనాభా సుమారుగా రెండు వేలు వుంటుంది. అయినా ఆ చుట్టుప్రక్కల వూళ్ళన్నిటికీ అదే పెద్ద వూరు. అడవి సరిహద్దులోనే వుండడం వలన, చుట్టు ప్రక్కల కాస్త పెద్ద వూరు కావడంవలన శివపురి ఫారెస్టు ఆఫీసు ఆ వూళ్ళోనే పెట్టారు.

శివపురికి నేను కొత్తగా ఫారెస్టు ఆఫీసరుగా అపాయింట్ చేయబడి ఆ రోజే వచ్చాను.

పెంకుటిళ్ళు, రాతి మిద్దెలు, పూరిపాకలకు ఎడంగా గోపీరంగు వేసిన మా కాంక్రీటు ఆఫీసు బిల్డింగు కొట్టొచ్చినట్లు కనిపిస్తూ వుంటుంది. ఆఫీసులోనే కాక, టైపిస్టు

ఆఫీసు బంట్రోతు, నా పర్సనల్ ప్యూను, క్లర్కు, నలుగురు ఫారెస్టు గార్డులు వున్నారు.

శివపురి అడవి చిన్నదయినా, ప్రభుత్వ దృష్టిలో చాలా విలువైన అడవి. అడవిలో కర్నాటక సరిహద్దులో వున్న భాగమంతా విలువైన పసుపు గంధం చెట్లతో నిండి వుంది. వాటితోపాటు కొంత భాగం అడవిలో పొట్టి రకం టేకు చెట్లు కూడా. మిగిలినవన్నీ మద్ది, తోగరు, రకరకాల చెట్లు...వీటితోపాటు ఈ అడవిలో ప్రభుత్వం పరిరక్షిస్తున్న జీవరాసి మరోటుంది. అదే 'సౌతిండియన్ లుగార్' అంటారు.

కోతి జాతికి చెందిన జంతువు. కొండముచ్చులాగా వుంటుంది. ఇండియాలో వున్న కోతుల్లోకల్లా అందమైనది, అపూర్వమైనది అని భావిస్తూ వుంటారు జంతు శాస్త్రజ్ఞులు. వీటన్నిటిని పరిరక్షించాల్సిన బాధ్యత నాది.

రావడంతోనే ఆఫీసులో ఓ వెనక గదిలో మకాం పెట్టాను. ఊరికి కాస్త ఎడంగా, చక్కని చెట్ల మధ్య ప్రశాంత వాతావరణంలో హాయిగా వుంది. మొదటి రోజంతా మేప్‌లు చూసుకోవడమూ, రికార్డులు చెక్ చేయడంలో సరిపోయింది. సాయంత్రం జీపేసుకొని ఊళ్లోకి వెళ్ళాను.

శివపురి పంచాయతి సర్పంచ్ రాఘవ యువకుడు. వయసు ముప్పై ఏళ్ళకన్నా ఎక్కువవుండదు. సాదరంగా ఆహ్వానించాడు నన్ను.

"నేను క్రొత్తగా వచ్చిన ఫారెస్టు ఆఫీసర్ని...నా పేరు రంగనాథ్" నన్ను నేను పరిచయం చేసుకున్నాను.

"నమస్తే! లోపలికి రండి!" అన్నాడు రాఘవ వరండాలో వేసివున్న కుర్చీ చూపెడుతూ.

"నిజానికి మీరింత చిన్నవయసువారని వూహించలేదు" అన్నాను సంభాషణ ప్రారంభించడానికి.

"మా వూళ్ళో చదువుకొన్నవాళ్ళంటే చాలా గౌరవం. ఈ వూళ్ళో బి. ఎ. పాసైన మొదటివాడ్ని నేను. ఒక్కడే కొడుకుని కావడంతో పట్నాల్లో వుద్యోగాలు చెయ్యడానికి వెళ్ళనివ్వలేదు నన్ను నాన్నగారు" అన్నాడతను సమాధానంగా.

తర్వాత మా సంభాషణ పెద్ద ఇబ్బంది లేకుండా సాగిపోయింది. చివరికి వచ్చిన విషయం బయట పెట్టాను, వూళ్లో వుండడానికి శుభ్రమైన ఇల్లు కోరుకుతుందేమోనని.

"ఈ వూళ్లో ఎవరూ అద్దెలకు ఇవ్వరు మాష్టారూ! ఎవరింట్లో వాళ్లే వుంటుంటారు. అంచేతే ఇదివరకు వున్న ఆఫీసరుగారు పారెస్టు బంగళాలోనే వుండేవారు. మీరంతగా కావాలంటే వాకబుచేసి మీకు కబురు పెడతాను" అన్నాడు రాఘవ.

అతనికి కృతజ్ఞతలు తెలిపి శెలవు తీసుకున్నాను. ఆఫీసుకు తిరిగి వచ్చేస్తోంటే మధ్యదాల్లో వూరి చివర శివాలయం కనిపించింది. జీపు ఆపి ఆలయంలోకి వెళ్ళాను.

చాలా పురాతనమైన ఆలయం. రాతి కట్టడం. చుట్టూ పెద్ద ప్రాంగణం వున్నా మనుషు లెవరూ కనిపించలేదు. మెల్లగా మెట్లెక్కి మంటపంలోకి వెళ్ళాను. గర్భగుడి గుమ్మం ఇవతలే ఆగి గంగా సమేతుడయిన శివుడికి తల వంచి భక్తిగా నమస్కరించి వెనుదిరిగాను.

"దైవ దర్శనానికి వచ్చేవాళ్ళు వుత్త చేతుల్తో రాకూడదు" అన్నారెవరో హఠాత్తుగా. చాలా కర్కశంగా పెద్దగా వుంది ఆ గొంతు.

ఒక్క క్షణం ఆ గొంతు తాలూకూ మనిషి నాకు కని

పించలేదు. మెల్లిగా మంటపం స్థంభాన వెనుక నుండి ఓ ఆకారం బయటికొచ్చింది. క్షణంపాటు కళ్ళప్పగించి చూస్తూ వుండిపోయాను.

బానలాంటి పొట్ట, దాదాపు ఆరడుగుల పొడవు, వదులుగా కండలు పెరిగిపోయి వూగులాడుతోన్న జబ్బలు, రొమ్ములు, గుండ్రటి పెద్ద ముఖం, నుదుట అడ్డంగా విభూతి రేఖలు, ఎర్రటి తీక్షణమైన కళ్ళు, మాసిన గడ్డం, జుట్టు ముడి, స్థూల శరీరం...ఎర్రటి పంచె, చేతిలో పూల పళ్లెం...ఎందుకో తెలియకుండానే గుండె జల్లుమంది. ఆలయపూజారి శాబోలు.

"ఎవరు నువ్వు? నిన్నెప్పుడూ చూసినట్టులేదు" అన్నాడు పూజారి అదే కర్కశమైన గొంతు.

"క్రొత్తగా వచ్చాను... ఫారెస్టు ఆఫీసర్ని" అన్నాను అతనిని మళ్ళీ నఖశిఖపర్యంతం చూస్తూ.

చేటల్లాంటి అతని చెవులకు బంగారు కుండలాలు వ్రేలాడుతున్నయ్. మెట్లు ఎక్కివచ్చి వుండాలి ఆయాసంతో రొమ్ములు, పొట్ట వూగుతున్నయ్.

"ఓహోఁ! ఇంకెప్పుడూ ఉత్తి చేతులో రాక..." అన్నాడతను భారంగా గర్భగుడిలోకి వెళ్ళిపోతూ.

నేనతన్నోసారి విచిత్రంగా చూసి వెనక్కి వచ్చేశాను. ఎందుకో మనసు వికలంగా అయినట్లనిపించింది. ఆఫీసు దగ్గర ఆగకుండా జీపును అడివికేసి పోనిచ్చాను.

దారిలో గార్డు ఒకడు రైఫిల్ భుజాన వేసుకొని నడుస్తూ కనిపించాడు. జీపు అతని ప్రక్కనే ఆపాను. నన్ను చూచి క్షణం ఆశ్చర్యపోయి సెల్యూట్ చేశాడతను.

"జీపెక్కు" అన్నాను. అతను వెనక్కి ఎక్కి కూర్చున్నాడు.

"నీ పేరేమిటి?"

"అబ్దుల్లా సార్" అన్నాడతను.

అడవి దగ్గర పడుతోంది.

"దేవాలయంలో ఆ పూజారి చాలా విచిత్రమైన వ్యక్తిలా వున్నాడు" అన్నాను రియర్‌వ్యూలో అతని ముఖం చూస్తూ.

పూజారి పేరు చెప్పగానే అతను వులిక్కిపడ్డాడని పించింది ఎందుకో.

"మీ కతడు...కనిపించాడా సార్?" అడిగాడు అబ్దుల్లా.

"అవును గుడిలోకి వెడితే మంటపంలో కనిపించాడు."

"ఇంకెప్పుడూ ఆ శివాలయంలోకి వెళ్ళకండి సార్! ఈ వూరి వాళ్ళెవరూ ఆ గుడిలోకి వెళ్ళరు" అన్నాడు అబ్దుల్లా ముందుకు వంగి.

"ఎందుకని?"

"ఆ గుడి నిండా దయ్యాలు, భూతాలు వున్నాయి సార్."

"వాట్?" అన్నాను ఆశ్చర్యంగా.

"అవును సార్! ఆ విషయం యిక్కడందరికీ తెలుసు. ఆ పూజారి మహాలింగం మంత్రిగాడు. చేతబళ్ళు అవీ చేస్తుంటాడు. అతనంటే ఈ చుట్టుపట్ల అందరికీ భయమే" అన్నాడు అబ్దుల్లా భయంగా.

## 2

వారంరోజులు గడిచి పోయాయి. మధ్యలో ఓసారి రాఘవ వచ్చి కనుపించాడు. ఊళ్లో తమ ఇంటికి దగ్గరిగానే రాములయ్యగారింట్లో ఓగది ఖాళీ చెయ్యించాననీ, వచ్చి చూసుకొని ఇష్టమయితే వుండమని చెప్పాడు.

రాములయ్య గారిల్లు రాఘవ ఇంటికి రెండిళ్ళవతల వున్నది. రెల్లు గడ్డితో కప్పిన ఇల్లు, భూమట్టానికి నాలుగడుగుల ఎత్తున గట్టారు. వసారాకి ఆనుకొనివున్న ముందువైపు గది నా కిచ్చారు. పెద్దగది. పట్టణాల్లో అయితే దాన్నే రెండుగాచేసి ఓపోర్షన్‌గా అద్దెకిస్తారు. అద్దేమీ ఇవ్వక్కరలేదని అన్నారు రాములయ్య. ఆరోజు వుదయమే నా సామానంతా అందులోకి మార్చేశాను.

మధ్యాహ్నం రెండు గంటలవేళ గార్డ్సును ఇద్దర్ని వెంట తీసుకొని అడివిలోకి వెళ్ళాను. ఫారెస్ట్ బంగళా దగ్గర జీపు ఆపాము. ఇంతకు ముందు వున్న ఆఫీసరు బంగళాలోనే వుండడం వలన బంగళా పరిసరాలన్నీ శుభ్రంగా వున్నాయి. వాచ్‌మెన్ ఒక్కడు బయట అవుటహావుస్‌లో వుంటాడు.

జీ పక్కడవదిలేసి కాలినడకన బయల్దేరాము. యాంకిల్ స్నబూట్సుల క్రింద పడి ఎండుటాకులు చప్పుడు చేస్తున్నాయి. 'హనుమాన్‌లుగార్' ఒకటి చెట్టు మీది నుండి మా వైపు తీక్షణంగా చూసి కిచకిచ అరుస్తూ అడవి లోపలికి పారిపోయింది.

అడవి సరిహద్దు వరకూ వెళ్ళాలని నా ఊహ. అడవిని కర్నాటక రాష్ట్రాన్ని విడదీస్తూ మధ్య సరిహద్దులా చిన్న సెలఏరు ఒకటి పారుతూ వుంటుంది. అడవిఏపుగా పెరిగి వుండడం వలన జీపులో సరిహద్దువరకూ వెళ్ళడం కుదరదు.

ముందు అబ్దుల్లా, మధ్య నేను, వెనక మరోగార్డు జానీ నడుస్తున్నాము.

సరిహద్దు దగ్గర పడే కొలదీ వరసనే గంధపుచెట్లు కనిపించసాగాయి. గమ్మత్తయిన పచ్చి గంధం వాసన ముక్కుల్ని నింపుతోంది.

ఉన్నట్లుండి పెద్ద చెట్లు తగ్గిపోయి, నాలుగయిదు వందల చదరపు గజాలమీద రెండు మూడు అడుగుల ఎత్తులో వున్న మొద్దులు కనిపించాయి. మళ్ళీ వాటి తర్వాత మామూలుగా పెద్ద చెట్లు వున్నాయి.

అంటే ఆ ప్రదేశంలో ఇదివరకు ఏపుగా పెరిగిన చెట్లని నరికేసి, కొత్తవి నాటారన్నమాట.

మామూలుగా నాలుగయిదు టన్నుల బరువు తూగే సైజుకు పెరగడానికి గంధపు మొక్కకి దాదాపు ఎనిమిదేళ్ళ వరకూ పడుతుంది. క్రొత్త మొక్కలయితే కొమ్మలు నరికి మాను వదిలేస్తారు. మళ్ళీ చిగిరించి పెద్ద దవడానికి రెండు మూడుసార్లు కొమ్మలు నరికిన చెట్లయితే పూర్తిగా వ్రేళ్ళతో సహా తీసేసి ఆర్నెల్ల తర్వాత క్రొత్త మొక్కలు నాటుతారు.

మొక్కల సైజును బట్టి అవి నాటి సంవత్సరం దాటి వుండదనిపిస్తోంది. నడుస్తూనే లెక్కపెట్టాను. పదిహేను మొక్కలున్నాయి. అంటే ఇదివరకు కొట్టేసినవి కనీసం పదిచెట్లయినా వుండాలి. అంటే దాదాపు ఇరవై టన్నుల మెచ్యూర్డ్ గంధం సంవత్సరం క్రితమే వేలంవేసి వుండాలి. రికార్డుల్లో ఎక్కడ ఆ విషయం నేను చూసినట్లు గుర్తు లేదు. ప్రక్కనే వున్న పెద్ద మొక్కలు మానులమీద నెంబర్లు గుర్తు పెట్టుకొన్నాను, తర్వాత రికార్డు చెక్ చెయ్యడానికి.

ఫారెస్టు బంగళా నుండి సరిహద్దు సెలయేరు దగ్గరికి వచ్చేప్పటికి దాదాపు రెండు గంటలు పట్టింది. దట్టంగా ఏపుగా పెరిగిన చెట్లు సెలయేరుకి రెండు ప్రక్కలా చల్లని నీడ కలుగ చేస్తున్నయ్. ఆగి అలసటగా ఒడ్డునే ఓ రాతిమీద కూర్చున్నాను.

అబ్దుల్లా, జానీలు కూడా బుజాలమీద రైఫిల్స్ దించి చెట్టుమానుకు చేరగిల బడ్డారు.

"ఈ ఏరు ఎక్కడి నుండి వస్తుంది?" అడిగాను.

"ఏమోసార్ పైన ఎక్కడో కొండల్లో పుడుతుంది. కర్నాటక వైపు వున్న అడవుల్లోంచి ప్రవహించి ఇక్కడ మన అడవిప్రక్కగా పోతుంది. దాదాపు పదిమైళ్ళ వరకూ ఈ ఏరే మనకు సరిహద్దు. మళ్ళీ అక్కడ నుండి లోపలికి తిరుగుతుంది" అన్నాడు అబ్దుల్లా.

"చూడ్డానికి పెద్దలోతు వున్నట్లు కనిపించడం లేదు. లోతుంటుందా?" అడిగాను.

"లేదుసార్" అదే ఆశ్చర్యం ఎంత దూరం వెళ్ళినా నడుములోతుకన్నా ఎక్కువ వుండదు. చల్లగా, తియ్యగా వుంటాయి నీళ్ళు" అన్నాడు జానీ బుజానవున్న ఫ్లాస్కులో టీ ప్లాస్టిక్ కప్పులో పోసి అందిస్తూ.

కప్పు అందుకొని మిగిలిన టీ వాళ్ళని త్రాగమని చెప్పాను. సాయంత్రం గావస్తున్నా. చాలా ప్రశాంతంగా హాయిగా వుంది అక్కడ. అప్పుడు గమనించాను నీటిలో తేలివస్తోన్న చిన్న చిన్న కర్ర తెప్పల్ని.

"ఏమిటవి?" అన్నాను వాటిని చూపెడుతూ.

"పైనెక్కడో కలప నరుకుతున్నాట్లున్నారు సార్. అడవిలో మొయ్యడం కష్టమని ఇలా కట్టలు కట్టి ఏట్లో వదిలేస్తారు. దిగువ లారీలు రాగలిగిన చోట ఒడ్డుకు లాగి లోడ్ చేస్తారు."

"మన కలప కాదుగదా?" అన్నాను వాటివైపే అనుమానంగా చూస్తూ.

"ప్రస్తుతం మనకి టెండర్లేమీ లేవు గదా సార్, అవతలివాళ్ళవి అయి వుంటాయి" అన్నాడు అబ్దుల్లా.

నల్లమద్దిచెట్లు కాబోలు, పెద్దపెద్ద దుంగలు నాలుగయిదు కట్టలు కట్టిన దుంగలు ఒకదాని వెనక ఒకటికొట్టుకొస్తున్నాయి. నేను టీ సిప్ చేస్తూ వాటివంకే చూస్తూ వుండి పోయాను. దూరంగా ఓ పెద్ద కట్ట కొట్టుకొస్తూ కనిపించింది. నల్లని దుంగల మధ్య పసుపురంగు దుంగ కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. మేమున్న ఒడ్డువేపే కొట్టుకొస్తోంది.

“వాటిమధ్యలో వున్నది ఏంకర్ర, పసుపుగా తెల్లగా వుంది” అన్నాను ఆ కట్ట చూపెడుతూ. వాళ్ళిద్దరూ ఓక్షణం ముఖాలు చూసుకొన్నారు.

“గంధంచెట్టుసార్! అడివి కొట్టుకోవడానికి టెండరు పాడినప్పుడు, కంట్రాక్టర్లు ఒకోసారి దొంగతనంగా గంధంచెట్లు కూడా మిగతావాటితోపాటు కొట్టుకు పోతుంటారు.” అన్నాడు అబ్దుల్లా.

విషయం అర్థమయింది నాకు. నల్ల మద్దిచెట్లు వేలంలో పాడుకొని కలప కంట్రాక్టరు వాటిపాటు దొంగతనంగా గంధంచెట్లు, ఇతర విలువైన చెట్లూ కొట్టుకు పోవడం మామూలే. ఆఫీసర్లు కూడా ఒక్కోసారి కాంట్రాక్టర్ల దగ్గర లంచం తీసుకొని చూసి చూడనట్లు వూరుకోవడమో, తర్వాత ఆ చెట్లని “డెడ్‌వుడ్”గా రైట్ ఆఫ్ చెయ్యడమూ జరుగుతుంటుంది.

ఇప్పుడా నల్లమద్ది దుంగల్లో వున్న గంధపుమాను బరువు అరటన్నుకు తక్కువ వుండదు. అంటే దానివిలువ దాదాపు రెండు వేలన్నమాట. దొంగతనాన్ని చూస్తూ వూరుకోవడానికి మనసొప్పలేదు. నీట్లోకి దిగి ఆ దుంగల్ని ఒడ్డుకు లాగమని చెప్పాను, అబ్దుల్లాతో.

అబ్దుల్లా సందేహిస్తూ నిలబడ్డాడు. “అవి మన అడవి

కలపకాదని తెలిసి..." అంటున్నాడు.

"గో ఆన్! స్టాపిట్!" అరిచాను కోపంగా.

ఆ దుంగల కట్టు మెల్లిగా ఒడ్డమ్మట ముందుకు కదుల్తోంది. అబ్దుల్లా చకచకా బట్టలు వూడదీసి డ్రాయర్తో నీళ్ళలోకి దిగాడు. ఈదుకొంటూ వెళ్ళి ఒడ్డుకు దగ్గరగా వస్తోన్న ఆ దుంగల్ని కట్టు దగ్గరపట్టుకొని ఒడ్డువైపు తిప్పాడు. ఎంత బరువైన వస్తువైనా నీటిలో తేలుతున్నప్పుడు పట్టుకోవడం బహు తేలిక. అదే ఒడ్డుమీద అయితే అబ్దుల్లా లాంటి వాళ్ళు పదిమందయినా దాన్ని ఎత్తగలిగి వుండే వాళ్ళు కారు.

జానీ గబగబ చెట్లకు చుట్టుకొని వున్న అడవితీగల్ని తెంపి తాడులాచేసి అబ్దుల్లావైపు విసిరాడు. అబ్దుల్లా దాన్ని దుంగలకు బిగించాడు. జాని ఆ తాడులాగుతోంటే ఆ దుంగలు గడ్డిపరకల్లా తేలుతూ వచ్చాయి ఒడ్డుకు. వాటిని నీటిలోనే వుంచి తీగల్ని ఓ చెట్టుకు కట్టేశాడు జాని.

నాలుగు నల్లటి మద్ది దుంగల మధ్య స్పష్టంగా కనిపిస్తోంది, లేత పసుపు రంగు గంధపు దుంగ. అబ్దుల్లా ఒళ్ళు ఆరబెట్టుకొంటూ నిలబడ్డాడు.

"ఇప్పుడేం చేద్దాం సార్?" అడిగాడు జాని.

"ప్రస్తుతం చేసేదీ ఏంలేదు. ఆఫీసుకు వెళ్ళగానే కర్నాటక అడవి ఆఫీసరుకు ఫోన్ చేస్తాను. వాళ్ళే వచ్చి రికవర్ చేసుకొంటారు. ఆఫీసరు కేసుపెడితే కంట్రాక్టరు టెండరు కాన్సిల్ అయిపోతుంది. డిపాజిట్ మనీ పోతుంది." అన్నాను సిగరెట్ వెలిగించి నిదానంగా పొగవదుల్తూ ఆ చందనం దుంగవంకే చూస్తూ. దుంగల మీద తారుతో ఏదో గుర్తులు వున్నాయి.

"సార్!"__అన్నాడు అబ్దుల్లా.

ఏమిటన్నట్లు చూశాను.

"ఆ దుంగలమీద గుర్తులు చూశారా? పి. జె. అనే అక్షరాలు"—అన్నాడు అబ్దుల్లా ఫాంటు తోముకొంటూ.

"అయితే?"

"అవి కలప కాంట్రాక్టరు గుర్తులు. చూస్తుంటే అది జాలయ్య కాంట్రాక్టులా వుంది.

"జాలయ్య కాంట్రాక్టా?"

"అవును సార్, పింజల జాలయ్య. పూజారి మహాలింగం తమ్ముడు" అన్నాడు అబ్దుల్లా భయం భయంగా.

"పాపం! వాడి కంట్రాక్టు పోవడం ఖాయం" అన్నాను వెనక్కి తిరుగుతూ. కాని, నా మాటలు అబద్ధమని ఋజువు కావడానికి ఎంతో కాలం పట్టలేదు.

# 3

"సార్!" అన్నాడు జానీ గదిలోకి దూసుకువస్తూనే. మధ్యాహ్నం పన్నిండు కావస్తోంది. ఆఫీసులో కరెంటు లేక ఫాన్ పనిచెయ్యక పోవడంవలన ఉక్కగా, చిరాగ్గా వుంది. బయటవరండాలో క్లర్కు, టైపిస్టు, గార్డులు చేసే పని లేక కబుర్లు చెప్పుకొంటున్నారు. నేను కూడా చేసేపని లేకపోయినా నా హోదా నిలబెట్టుకోవాలి కాబట్టి ఆఫీసుగదిలో కూర్చొని నిన్నటి దినపత్రిక తిరగేస్తున్నాను.

నేను పేపరు ప్రక్కకు పారేసి ఏమిటన్నట్లు చూశాను జానీ వంక. ఎండలో నడిచివచ్చేడేమో చెమటలు ముఖం మీదకు ధారగా కారుతున్నయ్. త్వరగా వచ్చి వుండాలి బాగా ఆయాసపడుతున్నాడు.

"సార్, ఉత్తరం వైపు అడివిలో రెండు గంధపు చెట్లు పట్టుకెళ్ళి పోయారుసార్ ఎవరో." అన్నాడు జానీ రొప్పుతో.

"వాట్!" అన్నాను చటుక్కున లేచి నిలబడుతూ.

"అవును సార్ ఇందాక రొటీన్‌గా అటువైపు చెకింగ్‌కు వెళ్ళాను సార్ ఏరు ఒడ్డునే. నిన్న మనం వెళ్ళిన చోటుకి చాలా ఎగువున, దాదాపు నాలుగు మైళ్ళపైన, రెండు చెట్లుకొట్టేసి వున్నాయి సార్. చిన్న కొమ్మ కూడా మిగల్చకుండా పట్టుకెళ్ళి పోయారు" అన్నాడు జానీ ఇంకా ఆయాసపడుతూనే.

"వివరంగా చెప్పు." అన్నాను రాక్‌లో నుండి యాంకిల్ బూడ్సులు తీసుకొని తొడుక్కుంటూ.

"ఉత్తరం వైపున నదిఒడ్డునే దాదాపు ఓ పాతిక చెట్లు మరో సంవత్సరంలో మెచ్యూర్ అయేవి వున్నయి సార్. వాటిలో రెండుచెట్లు ఎవరో కొట్టుకెళ్ళి పోయారు. పూర్తిగా మొదళ్ళలోకంతా రంపాలతో కోసి తీసుకు పోయారు. బహుశా రాత్రి చీకటి పడింతరువాత చేసుంటారు సార్!" అన్నాడు జాని.

నేను బూట్సులు వేసుకోవడం ముగించి ఫీల్డ్ ఓవరు కోటు తీసుకొని బయటకు నడిచాను. జానీ నా వెనకే బయటికి వచ్చాడు. వరండాలో వున్న మరో ఇద్దరు గార్డ్సును వెంట రమ్మని పిలిచాను, జీపు దగ్గరికి వెళుతూ.

"అక్కడికి జీపు తీసుకెళ్ళే అవకాశం వుందా?" అడిగాను ఎక్కి కూర్చుంటూ.

"ఉందిసార్! అడవిచుట్టూ తిరిగి వెళ్ళాలి" అన్నాడు జాని. వాళ్ళ ముగ్గుర్ని ఎక్కమన్నట్లు సైగచేసి జీపుస్టార్ట్ చేశాను. సూర్యుడు నడినెత్తిన తన ప్రతాపాన్ని చూపెడుతున్నాడు.

"ఎవరు కొట్టుకెళ్ళి వుంటారో నీకేమయినా ఐడియా

వుందా. రెండు చెట్లను రాత్రికి రాత్రి మొదళ్ళతో సహా నరికేసి మాయంచేసి తీసుకుపోవడం అంత తేలికైన పనికాదు.'' అన్నాను ఓ చేత్తో జీప్ వీల్ ని బాలన్స్ చేస్తూ రెండో చేత్తో సిగరెట్ వెలిగించుకొని.

''దానికేముంది సార్! ఏరుప్రక్కనే చెట్టే కాబట్టి, నరికి నీళ్ళలో కట్టకట్టి వదిలేస్తే దిగువ నెక్కడో వాళ్ళకు అనుకూలమైన ప్రదేశంలో ఒడ్డుకులాగి దాచేస్తారు'' అన్నాడు జీపులోవున్న మరో గార్డు మునిస్వామి.

హఠాత్తుగా నాకో ఆలోచన స్ఫురించింది. ''జాలయ్య మనుషులు అక్కడికి ఎంత దూరంలో వున్నారు'' అన్నాను ఎత్తుపల్లాలలో జీపు ఎగిరి పడకుండా స్టేరింగ్ కంట్రోలు చేస్తూ.

ఒక్కక్షణం ఎందుకో జీపులో నిశ్శబ్దం ఏర్పడినట్లనిపించింది. తల త్రిప్పి ముందుసీట్లో నా ప్రక్కనే కూర్చొన్న జానీ ముఖంలోకి చూశాను. ఎందుకో ఎర్రని ఎండలోనూ జానీ ముఖం పాలిపోయినట్లనిపించింది.

''వెల్! ఎంతదూరం?'' అన్నాను కాస్త గట్టిగా.

''ఏటి కవతల మన చెట్లు కొట్టేసిన ప్రదేశానికి ఎదురుగానే సార్. ఏటి కవతల నిలబడితే వాళ్ళ వర్క్ టెంట్లు అవీ కనబడుతునే వున్నాయి.'' అన్నాడు జానీ చివరికి.

జాలయ్య! అనుకొన్నాను మనసులోనే. నోట్లోవున్న సిగరెట్ పొగ కంట్లోకిపోయి నీళ్ళు ఉబుకుతున్నాయి. సిగరెట్ తీసి బయటకు విసిరేశాను. నిన్న వాడి దొంగతనాన్ని పట్టించినందుకు ప్రతీకారంగా ఈపని చేశాడా? ప్రభుత్వాన్ని మోసంచేసి ఎదిరించే మొనగాడా ఈ జాలయ్య?

"అవును సార్! ఇది ఆ జాలయ్య మనుషులపనే అయ్యుండాలి. మీరు నిన్న వాడి దుంగల్ని బయటికి లాగి వాళ్ళ ఆఫీసరు గారికి రిపోర్టు చేశారని కోపంతో ఈపని చేయించి వుండాలి వాడు" అన్నాడు మునుస్వామి.

నేను మాట్లాడలేదు. పెదిమలు బిగించి ముందు దారి మీదే దృష్టి వుంచాను.

"కుడి ప్రక్కకు తిప్పి ఏటిఒడ్డునే పోనివ్వండిసార్!" అన్నాడు జానీ. మరో పదినిముషాల్లో జీపు ఆపి క్రిందికి దిగాను. జానీ చెప్పనవసరం లేకుండానే చెట్లు కొట్టేసిన ప్రదేశం స్పష్టంగా కనిపిస్తోంది. భూమికి ఆరంగుళాలపైన లేత పసుపు పచ్చరంగు మొండాలు కొట్టొచ్చినట్లు కనిపిస్తోన్నాయి.

జీపుదిగి అవతలి ఒడ్డుకేసి చూశాను. జాలయ్య మనుషులు కట్టలుగా కట్టిన దుంగల్ని ఏట్లోకి దొర్లిస్తున్నారు. ఏటి ఒడ్డునే ఖాకీ కాన్వాసుతో వేసిన గుడారాలు నాలుగైదు వున్నాయి. వాటివెనుక చెట్లు నరికేసిన భాగమంతా మొండిగా, బోసిగా. విశాలంగా కనిపిస్తోంది.

అవును, ఇది జాలయ్య మనుషులపనే అయ్యుండాలి. రాత్రి పూట ఏరుదాటివచ్చి ఈ చెట్లు కొట్టేసి తమ దుంగలతోపాటు వాటిని ఏట్లోకి దొర్లించడం వాళ్ళకు కష్టమయిన పనేమీకాదు. వెనక్కు తిరిగి చెట్ల మొండాల దగ్గరికి వెళ్ళాను.

పచ్చగా, లేత పసుపు మాను కనిపిస్తూ, జాలిగా వున్నాయి ఆ రెండు గంధపు చెట్ల మొదళ్లు. నూట పన్నెండు, నూటపదమూడు అనుకొన్నాను మనసులోనే ప్రక్కనే వున్న చెట్ల నంబర్లు చూచుకొని. అన్ని మెచ్యూర్ చెట్లే. అంటే ఒకో చెట్టూ దాదాపు మూడు టన్నుల

పైన బరువుంటుంది. రెండు చెట్లకు ఎంత అధమంగా
లెక్క వేసినా ఇరవై వేల రూపాయల విలువకు తక్కువ
వుండదు.

'జాలయ్యా. నిన్నువదిలేది లేదు' అనుకొన్నాను
మనసులోనే కోపంగా. "సార్!" అన్నాడు. మును
స్వామి.

'ఏమిటన్నట్లు' చూశాను. అవతలిగట్టువైపు చూడ
మన్నట్లు సైగ చేశాడు.

భారీ విగ్రహం. పెద్దపొట్ట, మల్లు పంచె, మల్లులాల్చి,
బుజంమీద ఎర్రంచున్న కండువా, చుట్ట కాలుస్తూ,
ఒకచెయ్యి నడుంమీద పెట్టుకొని, దర్జాగా నిలబడి
మావైపే చూస్తున్నాడు వాడు. వాడి వెనక నలుగురయిదు
గురు మనుషులూ మావైపే చూస్తున్నారు.

"వాడే సార్ జాలయ్య" అన్నాడు జానీ గుసగుసలుగా,
గట్టిగా చెబితే వాడికి ఎక్కడ వినిపిస్తుందోనన్నట్లు.

నేను తీక్షణంగా వాడివైపే చూస్తూన్నాను. వాడేదో
అన్నాడు చుట్టపొగ వదులూ. పక్కనున్న వాళ్ళు నా
వైపే చూస్తూ పగలబడి నవ్వుతున్నారు. నాకు తలలోకి
రక్తం తన్నుకొస్తున్నట్లు కనిపించింది. గార్డ్సు ముగ్గురి
కళ్ళు నామీదే వున్నాయని తెలుసు. వాళ్ళపైకి మౌనంగా
వున్నా మనసుల్లో నన్నుచూసి నా నిస్సహాయత చూసి
జాలి పడుతున్నారని, నవ్వుకొంటున్నారని తెలుసు.

"లెటజ్ గో," అన్నాను వెనక్కి తిరిగి జీపులో
కూర్చొని స్టార్ట్ చేస్తూ.

## 4

ఆఫీసుదగ్గర ఇద్దరుగార్డుల్ని దింపేసి, మునుస్వామిని
మాత్రం వుంచుకొని తిన్నగా మీసాలపల్లె వెళ్ళాను.

మీసాలపల్లె, శివపురికి పదిమైళ్ళ దూరంలో వున్న ఓ మోస్తరు టౌను. శివపురికూడా మీసాలపల్లె సర్కిల్ లోకి వస్తుంది. జరిగిన దొంగతనాన్ని వెంటనే రిపోర్టు చేసి, తగిన చర్యలు తీసుకొనేలా చూడడం నా బాధ్యత.

మీసాలపల్లె టౌన్ ఇన్‌స్పెక్టర్‌కు నన్ను నేను పరిచయం చేసుకొని జరిగిన విషయాన్ని విపులంగా చెప్పాను.

“ఇలాంటి సంఘటనలు ఇక్కడ అడవుల్లో మామూలే కాని ఒక్కసారి ఇలా రెండు చెట్లు, ఫారెస్టు ఆఫీసరుకి తెలియకుండా కొట్టుకు పోవడం ఇదే మొదటిసారి” అన్నాడు మీసాలపల్లె ఇన్‌స్పెక్టరు అంతావిని.

“అవును, మీరు వెంటనే ఈ విషయంలో చర్య తీసుకోవాలి. చెట్లునరికిన ప్రదేశానికి ఎదురుగానే జాలయ్యా తాలూకు పనివాళ్ళు కర్నాటక అడవి నరుకుతున్నారు. రాత్రిపూట ఏరుదాటి చెట్లు నరికెళ్ళడం వాళ్ళ కేమంత కష్టమయిన పనికాదు.” అన్నాను.

ఇన్‌స్పెక్టర్ ముఖంలో ఒక్కక్షణం ఆశ్చర్యం కనిపించింది. “జాలయ్యా మనుషులా? అలా అయితే మేం చేయగలిగింది బహుతక్కువ” అన్నాడు.

“ఎందుకని?” నాలో కోపం మళ్ళీ రాజుకొంటోంది.

“వాళ్ళు ఏరుఅవతల పనిచేస్తున్నట్లయితే వాళ్ళని మేమేం చెయ్యలేము. ఆ ప్రదేశం మా జూరిస్‌డిక్షన్‌లోకి రాదు. ఈ విషయం కర్నాటక పోలీసులకు తెలిపి వాళ్ళను పట్టుకోమనో, హెచ్చరించమనో చెప్పగలం. అంతే” అన్నాడు ఇన్‌స్పెక్టర్, ఇహ అంతకు మించి ఆవిషయం మీద చర్చించటం కాలంవృధా చెయ్యడమే అనే అర్థాన్ని స్ఫురించేలా.

“ఇంక మనం చెయ్యగలిగింది ఏమీ లేదంటారా?”

అన్నాను లేచి నిలబడుతూ.

"ఎందుకు లేదు? వాళ్ళను రెడ్ హాండెడ్‌గా పట్టు కొంటే వాళ్ళ ఏరాష్ట్రానికి చెందిన వాళ్ళయినా కేసు పెట్టి శిక్ష వెయ్యించవచ్చు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నవ్వుతూ అదోలా.

"ఐసీ...మీరు దయచేసి వెంటనే కర్నాటక పోలీసులకు తెలియజేయండి. పోయిన కలప దొరుకుతుందని నమ్మకం లేకపోయినా, కనీసం పోలీసులోసారి ఈ విషయం కదిపిచూస్తే వాళ్ళకు కాస్త భయమన్నా వుంటుంది" అన్నాను.

"రైటో! ఐవిల్ డు దట్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ లేచి నన్ను జీపు వరకూ సాగనంపుతూ.

తిరిగి శివపురి తిరిగివచ్చేప్పటికి సాయంత్రం అయింది. ఆఫీసులో స్టాఫంతా వెళ్ళి పోయారు. అబ్దుల్లా, మరో గార్డు శంకర్ నైట్‌వాచ్‌కోసం అప్పుడే ఫారెస్టు బంగళాకు బయలుదేరుతున్నారు.

నిజానికి అంత పెద్ద అడవిలో ఎవరూ చెట్లూ అవీ కొట్టుకుపోకుండా కాపలా కాయడానికి నలుగురు గార్డ్సు చాలరు. వుండేవాళ్ళు పేరుకుమాత్రమే. పైగా నైట్‌వాచ్ కళ్ళే గార్డుపనికి అసలు అర్థంలేదు. ఫారెస్టు బంగళాలో మధ్య రాత్రివరకూ కబుర్లు చెప్పుకొని నిద్రపోతారు. అంతరాత్రిలో వాళ్ళను అడవంతా తిరుగుతూ కాపలా కాయమనడం, మేలుకొని వుండమనడంలో అర్థంలేదు. పగలే ఆ అడవిలో తిరగడం కష్టం. ఇక రాత్రుళ్ళు తిరగడంలో అర్థంలేదు.

"అబ్దుల్లా!" పిలిచాను. వాళ్ళిద్దరూ దగ్గరికి వచ్చారు.

"ఈరోజు మీరిద్దరూ ఓపని చెయ్యండి. ఆఫీసులో నుండి టెంట్, కాంప్ కాట్లు తీసుకెళ్ళండి. ఆ జాలయ్య

గాడి ముఠాను ఎదురుగా ఏటి ఒడ్డునే టెంటు వేసుకొని, రాత్రంతా టర్న్ డ్యూటీ చెయ్యండి" అన్నాను.

"ఇప్పుడు టెంట్ వెయ్యడమా? బంగళా కెళ్ళే టప్పటికే చీకటిపడిపోతుంది సార్. రేపు వేద్దాం లెండి" అన్నాడు అబ్దుల్లా.

"డోన్ట్ వర్రీ! నేను జీపులో డ్రాప్ చేస్తాను"— అన్నాను ఆఫీసులోకి నడుస్తూ.

ఏటి ఒడ్డు కెళ్ళి టెంట్ వేసేప్పటికి ఏడు దాటింది. మేం టెంటు వేస్తోంటే జాలయ్య ముఠా వాళ్ళంతా మమ్మల్ని వింతమృగాల్లా చూస్తూ నిలబడ్డారు.

## 5

తర్వాత మూడు రోజుల వరకూ ఏ సంఘటనా జరగ లేదు. గంధపుచెట్లు కొట్టుకుపోయిన వాళ్ళనుగురించి ఏ సమాచారం తెలియలేదు. మధ్యలో ఓసారి మీసాలపల్లె ఇన్ స్పెక్టర్ కు ఫోన్ చేశాను. దొంగల గురించి ఏమీ సమాచారం తెలియలేదన్నాడు.

టెంట్లో వుండి నైట్ డ్యూటీ చెయ్యడానికి గార్డులు అయిష్టత చూపిస్తున్నారు. ఏటిఅవతల జాలయ్య ముఠా పని ఆపేయడంతో మరో రెండు రోజులు చూసి టెంట్ తీసేసి, మామూలు ప్రకారం డ్యూటీ చెయ్యమని చెప్పాను.

మర్నాడే మునుస్వామి మళ్ళీ వార్త మోసుకొచ్చాడు మరో రెండు చెట్లు నరికి తీసుకుపోయారని. ఈసారి నిజంగా పిచ్చెక్కినట్లయింది నాకు. ఎలా అయినా కాపు కాసి వాళ్ళను పట్టుకోవాలని నిశ్చయం చేసుకొన్నాను. ఆరోజు రొటీన్ గా పోలీస్ రిపోర్టు ఇచ్చి ఏమీ పట్టనట్లు వూరుకొన్నాను. నేనేం చెయ్యదలచు కొన్నది చివరి క్షణం వరకూ ఎవరికీ చెప్పదలుచుకోలేదు.

రాత్రి ఎనిమిది గంటలకు భోజనం ముగించుకొని, పిస్తోలులోడ్ చేసుకొని జీపుతీసుకొని ఫారెస్టు బంగళాకు వెళ్ళాను.

మునుస్వామి, జానీ, బంగళా వాచ్ మెన్ ముగ్గురూ సిగరెట్లు కాలుస్తూ వరండాలో గాస్ లైటు వెలుతుర్లో పేకాడుకొంటున్నారు. జీపు ఆగగానే ముగ్గురూ హడావిడిగా లేచి జీపు దగ్గరికొచ్చారు.

"ఏమిటి సార్. ఈ వేళప్పుడొచ్చారు" అన్నాడు మునుస్వామి ఆశ్చర్యంగా. చిన్నగా నవ్వాను. "వెంటనే బూట్లు వేసుకొని, రైఫిల్స్ సరిగ్గా వున్నయ్యో లేదో చెక్ చేసుకోండి. ఈ రాత్రికి ఏటిఒడ్డున కాపలా వేసి ఎలా అయినా ఆ దొంగ వెధవల్ని పట్టుకోవాలి" - అన్నాను.

క్షణంపాటు నోటమాట రానట్లు నిలబడి పోయారు వాళ్ళు. "నువ్వుకూడా యూనిఫారం వేసుకో. మాతో రావాలి" అన్నాను బంగళా వాచ్ మెన్ తో.

చకచక తయారయి జీపులో ఎక్కి కూర్చొన్నారు ముగ్గురూ. "సారీ. నో వెహికల్. నడిచివెళదాం, మనం అక్కడికి వచ్చినట్టు తెలిస్తే వాళ్ళెవరూ దొరకరు" అన్నాను.

ముగ్గురూ మాట్లాడకుండా జీపు దిగారు. వాళ్ళు మనసులో నన్ను తిట్టుకొంటున్నారని తెలుసు. నాలుగు గంధంచెట్లు పోయినంత మాత్రాన, నాకు, ప్రభుత్వానికి వచ్చే నష్టమేమిటని వాళ్ళు అనుకుంటూ వుండొచ్చు. చట్టం యొక్క మంచిచెడ్డలు వాళ్ళు తర్కించలేరు మరి.

అడ్డతోవని వెళితే నాలుగు మైళ్ళంటుంది, నేను కాపుకాయ దలచుకొన్న ప్రదేశం. ఎంతనిశ్శబ్దంగా వున్నా

నడుస్తోంటే ఆకులు, ఎండిన కొమ్మలు బూట్సులక్రింద పడి నలిగి చప్పుడు చేస్తున్నాయి. ఫైవ్ సెల్స్ టార్చితో దారి చూపిస్తూ ముందు నడుస్తున్నాడు మునుస్వామి, అతని వెనకే ముగ్గురం నడుస్తున్నాం.

జీపులో నేను తీసుకొచ్చిన సామాను చూసి వాళ్ళు మొదట ఆశ్చర్యపోయారు. రెండు పెద్ద తాడుచుట్టలు, కాగడాలు, ఆముదం టిన్ను, పెద్ద ఫ్లాస్క్. అందరూ తలా ఒకటి తీసుకొన్నారు.

"చీకటి వేళ అడ్డం పడి వాళ్ళను ఆపలేం సార్. జాలయ్య మనుషులు ప్రాణాలకు తెగించిన దుర్మార్గులు. తామేం చేసినా జాలయ్య తర్వాత తనడబ్బుతో, పలుకుబడితో తమను కాపాడుతాడని వాళ్ళ నమ్మకం" అన్నాడు జాని.

"చూద్దాం! అదీ చూద్దాం. వాళ్ళు దొరకడం గాని జరిగితే ఒక్కొక్కడికి రెండేళ్ళకు తక్కువగా కుండా జైలు పడేట్లు చూస్తాను," అన్నాను కసిగా.

"ఏమోసార్! నాకు భయంగా వుంది. ఆ జాలయ్యా, వాడి అన్న మహాలింగం బహు దుర్మార్గులు. ఈ చుట్టు ప్రక్కల వాళ్ళకు ఎదురు చెప్పేవాళ్ళు లేరు. అయిదేళ్ళ క్రితం ఓ ఆఫీసరుగారిలాగే జాలయ్య దగ్గరుండి కోతుల్ని పడుతుంటె పట్టుకొని కేసుపెట్టాడు. చివరికి కోర్ట్లో కేసు కొట్టేశారనుకోండి. పాపం, ఆ ఆఫీసరుగారు మాత్రం మహాలింగం చేతబడివల్ల రెండు నెలల్లో చిక్కి శల్యమయ్యాడు. చివరికి ఊళ్లో వాళ్ళందరూ చెప్పగా, భార్య పోరుపడలేక జాలయ్య కాళ్ళమీద పడి క్షమాపణ చెప్పుకొని అడవిలో నాలుగు గంధం చెట్లు కొట్టుకో నిచ్చిన తరువాత గాని చేతబడి దిప్పలేదు" అన్నాడు జాని.

ఎందుకో ఒక్క క్షణం గుండె జల్లుమంది. "నాన్ సెన్స్!" అన్నాను కోపంగా.

ఏటి ఒడ్డుకు చేరేటప్పటికి పది దాటింది. ఏటి ఒడ్డునే నడుచుకొంటూ గంధపు చెట్లవైపు నడిచాము. హఠాత్తుగా దూరంలో వెలుగు కనిపించింది. లీలగా మిషన్ ఆడుతున్న చప్పుడు వినిపిస్తోంది.

గార్డ్స్ ఇద్దర్నీ రైఫిల్స్ లోడ్ చెయ్యమని చెప్పాను. 22 స్టాండర్డ్ ట్రైనింగ్ రైఫిల్స్ అవి. చూడ్డానికి కంటికి నిండుగా కనిపించినా పిట్టల్ని కాల్చడానికి తప్ప దేనికీ పనికిరావు. ఎఫెక్టివ్ రేంజి రెండు వందల మీటర్లు. మజిల్ వెలాసిటీ చాలా తక్కువ. ఎఫెక్టివ్ రేంజీలో మనిషికి గురిచూసి కాల్చినా, రొమ్ము భాగంలో తగలక పోతే ఏం ప్రమాదం జరగదు. అయినా సామాన్య ప్రజలకు రైఫుల్స్ గురించి పెద్దగా తెలియదు గనుక భయపడ్డం సహజం.

మునుస్వామి, జాని సందేహిస్తూనే రైఫిల్స్ లోడ్ చేసారు. సేఫ్టీ కాచ్ ఆన్ చేసి వుంచమని చెప్పాను. తుపాకి చేతిలో వున్నా నర్వస్ గా ఫీలవుతున్నారు వాళ్ళు- సేఫ్టీ కాచ్ ఆన్ అయివుంటే పొరపాటున ట్రిగ్గర్ కు వేలు తగిలి పేలవచ్చు.

"చప్పుడు చేయకుండా ముందుకు నడవండి. టార్చి లైటు వెలిగించకండి - వెధవలు అప్పుడే పని మొదలు పెట్టినట్లున్నారు" అన్నాను నడుముకున్న కేసునుండి పిస్తోలు తీసి పట్టుకొని ముందుకు నడుస్తూ.

నా వెనకే వాళ్ళు ముగ్గురూ అడుగులో అడుగు వేసుకొంటూ చప్పుడు చెయ్యకుండా నడుస్తున్నారు. వెలుతురుగా వున్న ప్రదేశం ఇంకా ఓ ఫర్లాంగు దూరంలో

వుంది. ఏటి ఒడ్డునే వెలుగుతోన్న రెండు పెట్రోమాక్సు లైట్లు కనిపిస్తోన్నయ్. మనుషులు అటూ ఇటూ తిరుగుతున్నట్లు లీలగా ఆకారాలు కనబడుతున్నయ్.

ముందుకు నడుస్తున్న వాణ్ణల్లా చటుక్కున ఆగిపోయాను. ఏటి ఒడ్డునే ఎదురుగా ఓ వందగజాల దూరంలో చటుక్కున ఓ అగ్గిపుల్ల వెలిగింది. అగ్గిపుల్ల వెలుతుర్లో బీడీ ముట్టించుకుంటున్న మనిషి ముఖం కనిపించింది.

మొత్తానికి వీళ్ళు అన్నీ పకడ్బందిగానే చేస్తున్నారు అనుకొన్నాను. పొరపాటున మేమెవరన్నా వస్తే చూచి హెచ్చరించడానికి సెంట్రీలా పెట్టారు కామాల్ను. నా వెనక వస్తున్న ముగ్గుర్నీ ఆగమన్నట్లు సైగచేశాను. దూరాన రంపం మిషను మోత తప్ప ఏమీ వినిపించడం లేదు.

ఎదురుగా వెళితే వాడు మమ్మల్ని గుర్తుపట్టి వాళ్ళను హెచ్చరించక మానడు. అగ్గిపుల్ల వెలుగునుబట్టి వాడు మా వైపే తిరిగి వున్నాడని గ్రహించాను. ఏదోరకంగా వాడి వెనకవైపుకు వెళ్ళి వాడిని అరవకుండా బంధించగలిగితే ప్రస్తుతానికి సమస్య తీరుతుంది.

మిగిల్న ముగ్గుర్నీ చెట్ల నీడల్లోకి జరగమని చెప్పి, నేను అడుగులో అడుగు వేసుకుంటూ చెట్ల వెనక్కి నడిచాను. చెట్ల వెనకనుండి నిశ్శబ్దంగా నడుచుకొంటూ వాణ్ణి దాటేటప్పటికి దాదాపు పావుగంట పట్టింది నాకు.

మెల్లిగా చెట్ల వెనకనుండి అడుగులో అడుగు వేసుకొంటూ పిల్లిలా వాడి వెనక్కి నడిచాను. చీకట్లో లీలగా నీడలా కనిపిస్తోంది సెంట్రీ ఆకారం. చెట్ల నీడల్లోంచి వాళ్లు ముగ్గురూ ఊపిరి బిగపట్టి చూస్తున్నారని

తెలుసు. సెంట్రీకి, నాకు మధ్య ఇంకా రెండడుగుల దూరమే వుంది. చేతిలో పిస్తోలు పిడివైపుకు తిప్పి పట్టుకొని వాడివైపు అడుగువేశాను.

ఓ రాతిమీద కూర్చొని విశ్రాంతిగా సిగరెట్ తాగుతున్నాడు వాడు. చివరి క్షణంలో పసిగట్టి వుండాలి వాడు వెనకెవరో వున్నట్టు. చటుక్కున వెనక్కి తిరిగాడు. ఆలస్యం చెయ్యలేదు నేను. పిస్తోలు పిడితో బలంగా నడినెత్తిన మోదాను.

స్పృహ పోలేదు వాడికి. కాని హఠాత్తుగా పడిన దెబ్బకు దిమ్మతిరిగి క్షణంపాటు మతి చెదరివుండాలి. నెత్తి మీద చేతులు పెట్టుకొని పెద్దగా మూలుగుతూ క్రింద కూలబడ్డాడు.

సందేహించలేదు నేను. పిస్తోలు వాడి కణతలో ఆనించి, మెడ చుట్టూ చేయివేసి బిగించి పట్టుకున్నాను.

"అరిచావా! ప్రాణాలు పోతయ్!" అన్నాను చెవి దగ్గరగా నోరు పెట్టి.

వాళ్ళు ముగ్గురూ పరిగెత్తుకొంటూ వచ్చారు. క్షణాల్లో వాడి నోట్లో గుడ్డలు కుక్కి వాణ్ణి చెట్టుకు కట్టేశారు.

స్పృహ పోకపోయినా గట్టిగానే తగిలి వుండాలి నేను కొట్టిన దెబ్బ...మూలగడం తప్ప ఎదురు తిరగడానికి ఏమాత్రం ప్రయత్నం చెయ్యలేదు. మాడు చిట్లి రక్తం కారుతోంది.

వాణ్ణక్కడ వదిలేసి మళ్ళీ ముందుకు కదిలాము.

## 6

జాలయ్య మనుషులు చేస్తున్న హడావిడి చూస్తే వాళ్లకన్నా బందిపోటు దొంగలు నయమనిపించారు నాకు. దేదీప్యమానంగా వెలుగుతోన్న నాలుగు పెట్రమాక్స్

లైట్ల వెలుతుర్లో మరో రెండు గంధపు చెట్లను మొదళ్ళ నుండి పెళ్ళగించే ప్రయత్నం జరుగుతోంది.

రెండు చెట్ల మానులకు అంగుళం లావు మోకులు బిగించి చెట్టు నరికినా పడిపోకుండా నాలుగు మూలలకూ పాతిన చెక్కముక్కలకు బలంగా కట్టారు. బ్యాటరీ సహాయంతో పనిచేసే 'ఎలక్ట్రిక్ సా' (మర రంపం) తో ముందుగా పెద్ద కొమ్మల్ని చెట్టునుండి కోసేస్తున్నారు.

మర రంపం కావడం వలన ఎంతలావు కొమ్మయినా నిముషాలలో తెగి క్రింద పడుతుంది. క్రిందపడిన కొమ్మల్ని కొందరు ప్రక్కకు లాగేసి మరో మర రంపంతో సైజుల వారీ ముక్కలుగా కోసి ఏట్లోకి దొర్లించడానికి సిద్ధం చేస్తున్నారు.

అంతా కలిసి పదిమంది వుంటారు. నల్లటి కోరమీసాల వాడొకడు ఓ గ్యాసులైటు ప్రక్కన నిలబడి మిగిలిన వాళ్ళందరికీ ఆర్డర్లు ఇస్తున్నాడు. బహుశా వాడు ముఠాకు నాయకుడై వుంటాడు. బాలయ్య మాత్రం పరిసర ప్రాంతాల్లో ఎక్కడా వున్నట్లు కనిపించలేదు. అఫ్‌కోర్స్. వుంటాడని నేను వూహించ లేదనుకోండి. అయినా ఎందుకో డిసప్పాయింట్ అయినట్లనిపించింది.

పదిమందిని పట్టుకోవడానికి నలుగురం. ఆయుధాలు వున్నా మంది ముందు ఆ చీకట్లో మా ఆయుధాల విలువ ఎంతుందో అంచనా వెయ్యడం కష్టం.

వాళ్ళకు దూరంగా చెట్లచాటున ఆగి ముందుగా కాగడాల్ని ఆముదంతో తడిపాను. రెండు కాగడాలు వాచ్‌మెన్ చేతి కిచ్చి పట్టుకోమన్నాను.

"జాగ్రత్తగా వినండి...హఠాత్తుగా వాళ్ళమీద దాడి చేసి నిరుత్తరుల్ని చెయ్యాలి మనం. తుపాకులు చూపించి

బెదిరించి ఎలా అయినా వాళ్ళను అదుపులోకి తేవాలి. మనల్ని చూసి పారిపోకుండా వుంచాలి వాళ్ళను...అంటే మునుస్వామి, వాచ్ మెన్ వాళ్ళకు వెనక వైపు గుండా రావాలి...ఏట్లోకి దూకి ఎవరూ పారిపోకుండా నేను చూసుకుంటాను.

"మునుస్వామీ! నువ్వు వాళ్ళ వెనక్కి వెళ్ళు. నీతో పాటు వాచ్ మెన్ వస్తాడు. నా పిస్తోలు ప్రేలిని శబ్దం వినబడగానే మరో క్షణం ఆగి నువ్వూ గాలిలోకి రైఫిల్ పేల్చు. వెంటనే వాచ్ మన్ కాగడాలు వెలిగిస్తాడు. హడావిడిలో వాళ్ళు లైట్లు ఆర్పేసినా కాగడాల వెలుతురుల్లో మన పని పూర్తి చెయ్యొచ్చు," అన్నాను గుసగుసలాడుతున్నట్లు.

మునుస్వామి, వాచ్ మెన్ లు తలవూపి చెట్ల చాటుకు మాయమయ్యారు. వాళ్ళు వెళ్ళిన పది నిముషాలకు నేను ముందుకు కదిలాను. జానీ నా ప్రక్కనే నడుస్తున్నాడు.

"జానీ! బి కేర్ ఫుల్! సెఫ్టీకాచ్ ఆన్ చెయ్యి. కాల్చవలసిన అవుసరం వస్తే మోకాళ్ళ క్రిందికి కాల్చు. ఎవరికీ ప్రమాదకరమైన గాయాలు తగలడం నా కిష్టం లేదు" అన్నాను సీరియస్ గా.

"అలాగే సార్!" అన్నాడు జాని, అతని గొంతులో ఎక్సయిట్ మెంట్ స్పష్టంగా కనిపిస్తోంది.

చెట్ల వెనకనుండి నీడల్లా ముందుకు కదులుతున్నాము. ఆ ప్రదేశాని కెళ్ళేవరకూ చాటున వుండి హఠాత్తుగా వాళ్ళను సర్ ప్రయిజ్ చెయ్యాలని నా ప్లాను. చివరిచెట్టు వెనక ఆగిపోయాము. మునుస్వామి, వాచ్ మెన్ అవతల సెటిల్ అయ్యారో లేదో తెలియదు. చూస్తోంటే ఇంత వరకూ వాళ్ళను ఎవ్వరూ కనుక్కోలేదనే అనిపిస్తోంది.

"రడీ జానీ?" అన్నాను చెట్టుచాటునుండి అవతల జరుగుత న్న కోలాహలం చూస్తూ.

"రడీ సార్" అన్నాడు జానీ రైఫిల్ మీద చెయ్యి వేసి.

నేను పిస్తోలు ముందుకు చాచి పట్టుకుని చెట్టుచాటు నుండి ఏటి ఒడ్డున వున్న ఖాళీ ప్రదేశంలోకి పరిగెత్తాను. నా వెనకే జానీ పరిగెత్తుకొచ్చాడు. ఎండుటాకులు, కొమ్మలు మా బూట్లక్రింద నలిగి పెద్దచప్పుడు చేసినయ్.

"ఏయ్! ఎవరద?" కోరమీసాలవాడు అరిచాడు.

రంపం మిషన్లు ఆగిపోయినయ్. పనిచేస్తున్నవాళ్ళంతా చటుక్కున మా వైపుకు తిరిగారు.

"ధాం!" మ్మంటూ గాల్లోకి పేల్చాను పిస్తోలు. ఒక్క క్షణం అంతా నిశ్శబ్దం. దూరంగా చెట్లమీద పక్షులు గోలగా అరిచాయి. జాలయ్య ముఠావాళ్ళు బిత్తర పోయి నిలబడ్డారు.

"కదిలారంటే కాల్చి పారేస్తాను." అరిచాను గట్టిగా పిస్తోలు గాల్లో వూపుతూ.

అదే క్షణంలో వాళ్ళ వెనుకవైపునుండి మునుస్వామి గాల్లోకి రైఫుల్ పేల్చాడు. వెంటనే గప్పుమని మంటతో రెండు కాగడాలు వెలిగినయ్.

"ప్రాణాలు పోగొట్టుకో దలచుకుంటే మీరున్న చోటునుండి కదలండి. మీ చుట్టూతా చెట్లచాటున రైఫుల్స్‌తో గార్డ్సు నిలబడి వున్నారు. పారిపోవాలని చూస్తే కుక్కల్ని కాల్చినట్లు కాలుస్తారు." అరిచాను పిస్తోలు కోరమీసాల వాడికేసి గురిచేసి.

"ఎవడ్రా నువ్వు? ఎన్ని గుండెల్రా నీకు తుపాకి చూపెట్టడానికి" అన్నాడు వాడు ఒకడుగు ముందుకు వేసి నా వైపు కదులుతూ.

వాడి ధైర్యానికి మనసులోనే అభినందించకుండా వుండలేకపోయాను, అయినా సందేహించలేదు. ట్రిగ్గర్ నొక్కాను.

'ఢాం!' మంది పిస్తోలు, కొరమీసాలవాడి కాళ్ళదగ్గర దుమ్ము మేఘంలా లేచింది. "మరో అడుగు ముందుకు పడితే ఈసారి గుండు మోకాల్లో దిగుతుంది ఖబడ్దార్" అరిచాను కోపంగా.

వాడు నమ్మలేనట్లు గుండు తగిలిన నేలవంకే చూస్తూ వుండిపోయాడు.

మునుస్వామి, వాచ్ మెన్ వాళ్ళకు వెనగ్గా వచ్చి నిలబడ్డారు.

"జానీ, గో ఎహేడ్. అందర్నీ చెట్లకు కట్టేయ్," అన్నాను.

జానీ తాడుచుట్ట తీసుకొని ముందుకు కదిలాడు. అప్పటి వరకూ అలా ప్రతిమల్లా నిలబడిన వాళ్ళల్లో ఒక్కసారి చైతన్యం వచ్చింది. ఒకణ్ణొకడు తోసుకొంటూ నలుగురు ఏటివైపు పరిగెత్తసాగారు.

చూస్తూ వూరుకొంటే పరిసితి చేయిదాటిపోతుం దని పించింది. పిస్తోలు గురిపెట్టి పరిగెత్తుతున్న వాళ్ళ కాళ్ళకు గురిచేసి చకచకా రెండు గుండ్లు కాల్చాను.

"అమ్మో!" అరిచా డెవడో.

"చచ్చాన్రోయ్! దేవుడోయ్" కేక పెట్టాడు మరొకడు.

పరిగెత్తిన నలుగుర్లో ఒకడు మాత్రం ఏట్లోకి వురికాడు, మిగిలిన ముగ్గురూ క్రిందపడి బాధతో మూల్గుతున్నారు, అరుస్తున్నారు.

జానీ ఏటివైపు పరిగెత్తబోయాడు. వద్దన్నట్లు వారిం చాను.

"ఇంకా ఎవరన్నా దూకదలచుకున్నవాళ్ళు ముందుకు రండి," అన్నాను కర్కశంగా దుమ్ములో పడి మూల్గు తున్న వాళ్ళను చూపెడుతూ. ఎవ్వరూ కదల్లేదు.

దూరంగా ఎక్కడో జీపులు వస్తున్న శబ్దం వినిపిం చింది. మరుక్షణం మొదటి జీపు హెడ్ లైట్ల కాంతి మా మీద బడింది.

"పోలీసులు" అరిచాడు మునుస్వామి.

"అవును. ఫారెస్ట్ బంగళాకి వచ్చేముందు సర్పంచ్ రాఘవను మీసాలపల్లె పంపించాను, రాత్రి పన్నెండు లోపల ఏదోరకంగా ఏటి ఒడ్డుకు పోలీసుల్ని తీసుకు రమ్మని."

# 7

మర్నాటి ఉదయానికి శివపురి, ఆ చుట్టుప్రక్కల పల్లె టూళ్ళన్నిటిలోనూ ఈ వార్త తెలిసిపోయింది. కుర్ర కారు, కాస్త చదువుకొన్నవాళ్ళు నన్నభినందిస్తూ మాట్లాడుతుంటే, మిగిలిన ప్రజ జాలయ్యతో వైరం పెట్టు కొని నేనెంతోకాలం ఈ ఊళ్లో బ్రతకలేనన్నే అభిప్రాయం వెలిబుచ్చారు.

ఉదయమే రాఘవ దగ్గరకు వెళ్ళి తను చేసిన సహాయా నికి కృతజ్ఞతలు చెప్పాను.

"మరేం ఘనవా లేదు రంగా! పోలీసులు కూడా ధైర్యం చేసి చెయ్యని పని మీరు చేశారు. ఈ ప్రాంతాల్లో ఈ జాలయ్య దుండగాలు మరీ మితిమీరుతున్నయ్. వాడి చేతికింద పనిచేసే మనుషులకు మరీ హద్దూ అయిపూ లేకుండా పోతున్నయ్. కాని మీరు మాత్రం కాస్త

జాగ్రత్తగా వుండండి. ఒంటరిగా తోడు ఎవరూ లేకుండా అడివికేసి వెళ్ళకండి.'' అన్నాడు రాఘవ.

అతని హెచ్చరికకు చిన్నగా నవ్వుకొన్నాను. జాలయ్యే తమని చెట్లు కొట్టమని పంపించినట్లు, ఆ రంపాలు, మిగతా పరికరాలు అతనివేననీ పట్టుబడిన పదిమంది దగ్గర స్టేట్ మెంట్ తీసుకొనే ప్రయత్నం జరుగుతోంది. గాయపడి హాస్పిటల్లో వున్నవాళ్ళు, జైల్లో కూర్చొన్నవాళ్ళు, ఎవరూ నోరు విప్పడం లేదు.

''రాత్రి మనం పోలీస్ స్టేషన్ నుండి వచ్చేసింతరువాత స్టేషనుకు వాళ్ళ తరఫున ఓ లాయరు వచ్చాడట. బహుశా తప్పించు కెళ్ళినవాడు వెళ్ళి చెప్పగానే జాలయ్యా పంపించి వుంటాడు.'' అన్నాను ఉదయమే మునుస్వామి వచ్చి చెప్పిన విషయం చెపుతూ.

''పోనీలెండి! జాలయ్యా దొరక్కపోయినా ఈ తొమ్మిది మందికీ జైలు పడటం ఖాయం,'' అన్నాడు రాఘవ సంతోషంగా.

కాని నా టార్గెట్ జాలయ్యా మనుషులు కారు. జాలయ్యా!! పదేళ్ళబట్టి శివపురి అడివిని, దేశ సంపదను దోచుకొని, ఎందరో ఆఫీసర్లను అవినీతిపరుల్ని చేసి, అవమానం పాలు చేసి, లక్షాధికారైన జాలయ్యాను చట్టం ముందు నిలబెట్టడం నా ధ్యేయం.

ఎందుకో జాలయ్యాకు, నాకు ఒకర్నొకరు తెలుసుకోకుండానే వ్యక్తిగత వైరం పెరిగిపోతుందనిపించింది.

ఉదయం అంతా ఆఫీసులో పై అధికారులకు రాత్రి జరిగిన సంఘటనల తాలూకు రిపోర్టులు పంపడంతో సరిపోయింది. మధ్యాహ్నం పన్నెండు గంటలకు మీసాల పల్లెనుండి ఓ పత్రికా విలేఖరి వచ్చాడు.

దొంగలను ఎలా పట్టుకొంది, ఏ రకంగా వాళ్ళను ఉచ్చుల్లో ఇరికించింది వివరంగా వ్రాసుకొన్నాడు ఆ విలేఖరి. మర్నాటికల్లా వివరాలన్నీ పేపర్లలో వస్తాయని తెలుసు నాకు. ఇలాంటి సంఘటనలకు పబ్లిసిటీ రావడం వల్ల, నా మీద అవినీతిపరులైన కొందరు పై అధికారులు, రాజకీయ వేత్తలు ప్రెషర్ తీసుకురాకుండా వుండే అవకాశం వుంది. అందుకే విలేఖరికి వివరాలన్నీ చెప్పాను.

చివర్లో జాలయ్యకు ఈ దొంగలతో ఏమన్నా సంబంధముందని తెలుసా అని చాలాసార్లు గుచ్చి గుచ్చి ప్రశ్నించాడు విలేఖరి. అవునని చెప్పడంవలన లీగల్ గా బదుడ్ని అవుతానని తెలుసు. అంచేత ఆ విషయం నాకేమీ తెలియదని, పోలీసులు దర్యాప్తు జరుపుతున్నారని సమాధానం చెప్పి పంపాను.

రెండు గంటల వేళ ఆఫీసు ముందు కారాగిన చప్పుడయింది. లేచి కిటికీలోనుండి చూశాను వచ్చిందెవరా అని. జాలయ్య లావుపాటి శరీరం కారులోనుండి బయటికొస్తూ కనిపించింది. చటుక్కున వెనక్కి తిరిగి నా కుర్చీలో కూలబడి చేతి కందిన ఫైలు తీసుకొని సీరియస్ గా చదవడం మొదలుపెట్టాను.

బయట నలుగు రైదుగురు హడావిడిగా నడుస్తున్న చప్పుళ్ళు, నేనున్నానా అని ఎవరో అడగడం వినిపిస్తున్నాయి. సిగరెట్ తీసి వెలిగించుకొని విశ్రాంతిగా కూర్చున్నాను. గదిలోకి నలుగు రైదుగురు వచ్చిన శబ్దం అయింది. తలెత్తి చూశాను.

జాలయ్య, జాలయ్య వెనక మరో ముగ్గురు వస్తాదుల్లాంటి మనుషులు గది గుమ్మం దగ్గర నిలబడి నా వైపు

తీక్షణంగా చూస్తున్నారు. దూరం నుండి చూసినప్పుడు తెలియలేదుగాని, దగ్గరగా ఆరడుగుల దూరంలో జాలయ్యా ముఖంలో క్రూరత్వం, దర్పం కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి.

వెడల్పయిన ముఖం, విబూదిబొట్టు, ఖద్దరు పంచె, లాల్చీ, భుజం మీద ఖద్దరు కండువా, ఎర్రంచు. మూడు మడతలు పడిన గవదలు, చిన్నకళ్లు, మొద్దు పెదిమలు, బానపొట్ట, దాదాపు ఆరడుగుల పొడవు, చేతి వేళ్ళనిండా వుంగరాలు. చూడ్డానికి చాలా అసహ్యంగా వున్నాడు జాలయ్యా. అక్కడే నిలబడి లేచి వచ్చి నన్ను ఆహ్వానించవేం...అన్నట్లు చూస్తున్నాడు.

బల్లమీది బెల్ నొక్కాను. ప్యూను వాళ్ళకు దూరంగా తాకకుండా లోపలికి వచ్చి నిలబడ్డాడు.

"చూడు వీరన్నా! ఈ వచ్చిన వాళ్ళకు ఏం కావాలో బయటికి తీసుకెళ్ళి కనుక్కో" అన్నాను ప్రశాంతంగా.

"సార్..." అన్నాడు ప్యూను వీరన్న మతిపోయినవాడికిమల్లే.

జాలయ్యాకు క్షణంసేపు నోట మాట రాలేదు. తనంతటి బందిపోటు స్వయంగా వస్తే నేను ఇలా ప్రవర్తిస్తానని వాడు కల్లో కూడా అనుకొని వుండడు.

"ఇదిగో చూడు రంగనాథం..." ఏదో అనబోతున్నాడు జాలయ్యా.

పట్టించుకోలేదు నేను. "వీరన్నా! చెప్పింది అర్థం కాలేదా? వచ్చినవారికి ఏం కావాలో బయటికి తీసుకెళ్ళి కనుక్కో" అన్నాను గట్టిగా.

ప్యూను వీరన్న సందిగ్ధంలోపడి వణికిపోతున్నాడు. జాలయ్యా తీక్షణంగా వాణ్ణే చూస్తున్నాడు. జాలయ్యా పలుకుబడికి, నా అధికారానికి ఇది ఓ రకంగా పరీక్ష.

చివరికి వీరన్న చేతులెత్తి దండం పెడుతూ "బాబుగారూ! బయటికి పదండి...పనేమిటో చెబితే అయ్యగారు తమర్ని లోపలికి పిలుస్తారు" అన్నాడు వణికే గొంతుతో దీనంగా.

ఆ క్షణంలో వీరన్న మీద జాలేసింది. పూర్ ఫెలో!

"ఎదురుగా వున్నప్పుడు మళ్ళీ నీకు చెప్పడ మెందుకురా...అతన్తో పనుండే వచ్చాను" అన్నాడు జాలయ్య గోడ పక్కనున్న కుర్చీలాగి నా టేబులు ముందు వేసుకూర్చుంటూ.

విషయాన్ని ఇంకా పొడిగించడం అనవసరమైన రభసకు దారి తీస్తుందనిపించింది.

"ఆల్ రైట్! ఎవరు మీరు? నాతో ఏం పని?" అన్నాను వాళ్ళ వంకే చూస్తూ.

"నే నెవరో తెలియకే అడుగుతున్నావా?" అన్నాడు జాలయ్య రెండు మోచేతులు ముందు టేబిల్ మీద ఆనించి ముందుకు వంగుతూ.

"ప్రతి మనిషీ కొన్ని ప్రాథమిక మర్యాదలు పాటించడం వివేకమైన విషయం. ముఖ్యంగా ఈ ఆఫీసులోకి అడుగు పెట్టిన మనుషులు—" అన్నాను జాలయ్య కళ్ళలోకే చూస్తూ.

ఉన్నట్టుండి పెద్ద పెట్టు గది ప్రతిధ్వనించేలా నవ్వాడు జాలయ్య. "అలా గేనండీ ఆఫీసరుగారూ! నన్ను జాలయ్య అంటారు. పింజల జాలయ్య అంటే ఈ చుట్టు ప్రక్కల తెలియనివాడెవడూ లేడు. ఈ ప్రాంతాల్లో కలప వ్యాపారమంతా నేనే చేస్తుంటాను" అన్నాడు జాలయ్య అదోలా నవ్వుతూ. వ్యంగ్యంగా...నువ్వు అడిగావు గాబట్టి నీకు మర్యాద ఇస్తున్నాను అనే ధోరణిలో.

నేనూ అదే ధోరణిలో సమాధానం చెప్పాను. "మంచిది జాలయ్యగారూ! మీరంతా వచ్చిన పనేమిటి? మీ వెనక వున్న ఆ ముగ్గురు మనుషులు ఎవరు?" అన్నాను.

"మావాళ్ళే!" అన్నాడు గర్వంగా జాలయ్య.

"నాతో మాట్లాడవలసింది మీ రొక్కరేనా వాళ్ళు కూడానా?"

"వాళ్లెప్పుడూ నాతో కూడా వుంటారు" అన్నాడు జాలయ్య తల త్రిప్పి గర్వంగా వాళ్ళను చూస్తూ.

"ఇక్కడలా వుండడానికి వీల్లేదు. వాళ్ళకు నాతో ఏం పని లేకపోతే వాళ్ళు బయట వుండడం మంచిది."

"ఉంటేయేం? నీకొచ్చే భయమేమిటి?" విసుగ్గా అరిచాడు జాలయ్య.

"చూడండి జాలయ్యగారూ! ఇదొక ఆఫీసు...ఆఫీసులో మీకు పనుండి వచ్చినప్పుడు ఆఫీసు పద్ధతుల్నిబట్టి నడుచుకోవాలి. వాళ్ళు బయటికి వెళ్ళకపోతే నేను మీతో మాట్లాడగలిగింది ఏమీ లేదు" అన్నాను ఒకటో క్లాసు పిల్లాడికి అఆలు నేర్పుతున్న టీచర్‌లా.

నిముషంపాటు నా వేపు తీక్షణంగా చూస్తూ వుండిపోయాడు జాలయ్య. చివరికి వెనక వున్న ముగ్గురి వైపు తిరిగి "వెళ్ళి గది బయట వుండండ్రా" అన్నాడు.

వాళ్ళు ముగ్గురూ అయిష్టంగానే బయటికి వెళ్ళారు.

"ఏమిటి మీరు వచ్చిన పని?" అన్నాను వాళ్ళు గది దాటిన తరువాత. బయట ఆఫీసు స్టాఫు, గార్డులు, అందరి చెవులూ మా సంభాషణ వింటున్నాయని తెలుసు.

జాలయ్య మాట్లాడలేదు. భారంగా లాల్చీ జేబులో చెయ్యి పెట్టి పది రూపాయల నోట్లకట్ట ఒకటి బయటకు తీసి శబ్దమయ్యేలా నా ముందు బల్లమీద పడేశాడు.

"దాని గురించేగా నువ్వింత రభస చేస్తున్నావు అదిగో తీసుకో మొత్తం రెండువేలు... వెంటనే నా మనుషుల మీద పెట్టిన కేసు విత్ డ్రా చెయ్యి. కావాలంటే ఆ కొట్టుకెళ్ళిన చెట్లు అమ్మేం తరువాత మూడో వంతు వాటా కూడా ఇస్తాను" అన్నాడు జాలయ్య.

క్షణంపాటు ఆ నోట్లవంకే చూస్తూ వుండిపోయాను. "చూడండి జాలయ్యగారూ! కేసు రాత్రి రిజిష్టరయింది. ఇప్పుడు విత్ డ్రా చేసుకోవడం వీలుపడదు" అన్నాను.

జాలయ్య మొద్దు పెదిమల మీద చిన్న నవ్వు కదిలింది విజయ గర్వంతో. "కేసు రిజిష్ట్రేషన్ సంగతి నే జూసుకొంటా లేవయ్యా! ఇన్‌స్పెక్టర్ గారూ...నీలాటోడేగా... మళ్ళీ నువ్వు మాత్రం మతలబు పెట్టక" అన్నాడు జాలయ్య కుర్చీలోంచి లేచే ప్రయత్నం చేస్తూ.

"కూర్చోండి జాలయ్యగారూ!" అన్నాను బల్లమీద బెల్ నొక్కుతూ.

ఇంకా ఏమిటన్నట్లు చూశాడు జాలయ్య తిరిగి కుర్చీలో సర్దుకుంటూ. ప్యూన్ వీరన్న లోపలికి వచ్చాడు.

"చూడు వీరన్నా! బయట వున్న క్లర్క్‌ని, టైపిస్టుని, గార్డ్స్‌ని ఓసారి లోపలకు రమ్మను" అన్నాను సిగరెట్ ఆర్పేసి మరోటి వెలిగిస్తూ.

"వాళ్ళెందుకు?" అన్నాడు జాలయ్య అనుమానంగా చూస్తూ.

క్లర్కు, టైపిస్టు, గార్డులు అబ్దుల్లా, జానీ, శంకర్ లోపలకు వచ్చారు. వాళ్ళందరి ముఖాల్లో ఆత్రుత, ఆశ్చర్యం కనిపిస్తున్నాయి.

"చూడండి జాలయ్యగారూ! ఇందాక మీరు చెప్పిన

విషయాలు వీళ్ళందరి సమక్షంలో తమరోసారి చెప్పండి'' అన్నాను ప్రశాంతంగా.

"అందరికీ చెప్పేదేమిటి? ఎవరికి తెలియని గొడవలని ఇవి? ఆ రెండు వేలూ తీసుకొని మా వాళ్ళ మీద రిపోర్టు విత్ డ్రా చేసుకోమంటున్నానంతే. ఇందులో పెద్ద విశేషమేముంది?'' అన్నాడు వాళ్ళ ముఖంవైపు చూస్తూ.

"మీరందరూ ఈ గదిలో జరుగుతున్న సంభాషణకు సాక్షులు'' అన్నాను నా స్టాఫ్ అయిదుగురివంక చూస్తూ. "జాలయ్యగారూ! ఓ బాధ్యతగల ప్రభుత్వ ఉద్యోగికి లంచం ఇవ్వడం నేరమని మీకు తెలియదా?'' అన్నాను జాలయ్యవైపు తిరిగి.

అప్పటికిగాని జాలయ్యకు నా వ్యూహమేమిటో తట్టినట్లు లేదు. "లంచమా? నీకు లంచమెవడిస్తున్నాడు? నువ్వు డబ్బు కావాలని కబురు పంపావు, తెచ్చిస్తున్నాను... ఇందులో లంచం ఇవ్వడం సమస్యేముంది'' అన్నాడు జాలయ్య తత్తరపాటు కప్పిపుచ్చుకుంటూ.

"సారీ మిస్టర్ జాలయ్యా! యూ ప్లీజ్ గెటవుట్! లంచం ఆశ చూపి నీ బందిపోటు అనుచరులపై రిపోర్టు ఉపసంహరించుకొంటాను అనుకోకు. నీ పదిమంది గుండాలకు శిక్ష పడడం ఖాయం. దాంతోపాటు ఇప్పుడు ప్రభుత్వోద్యోగికి లంచం ఇవ్వజూపావని నీ మీద వెంటనే రిపోర్టు ఇవ్వడమూ ఖాయమే. ఇక నీ డబ్బు తీసుకుని బయటికి నడు'' అన్నాను ఒక్కొక్క పదమే ఒత్తి పలుకుతూ.

మా ఇద్దరి సంభాషణ వింటున్న అయిదుగురూ స్థాణువుల్లా నిలబడి వింటున్నారు. జాలయ్య ముఖం కోపంతో వుక్రోషంతో ఎర్రబడింది. బుసలు కొడుతూ, ఆయాస

పడుతూ లేచి నిలబడ్డాడు.

"ఒరేయ్! రంగనాథం! నీలాంటి ఛోటా బచ్చా ఆఫీసర్లను లక్షమందిని చూశాన్రా! నాతో తలపడి నెగ్గుకొచ్చిన వెధవ ఈ పరగణాల్లో లేడురా... నా మీదే రిపోర్టిచ్చేన్నిగుండెల్రా నీకు... నా మీద రిపోర్టిచ్చిన మర్నాడు నీకు గోరీ కట్టించడం ఖాయం అని మరిచి పోకురా ఖబడ్దార్...సాయంత్రం వరకూ టైమిస్తున్నాను నీకు. ఈలోగా మావాళ్ళపై కేసు విత్ డ్రా చేసుకొన్నావా సరే లేకపోతే నీపాట్లు కుక్క కూడా పడదు" అన్నాడు బల్లమీద రెండు పిడికిళ్ళతో బాదుతూ.

"వీరన్నా!" అన్నాను నవ్వుతూ.

వీరన్న వచ్చేవరకు జాలయ్యా ఆగలేదు. పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ, అలిగిన పిల్లాడికి మల్లే నేలను తన్నుకుంటూ వెళ్ళిపోయాడు బల్లమీద డబ్బు జేబులో కూరుకొంటూ.

నా ఆఫీస్ స్టాపు ఈ సంఘటన షాకునుండి తేరుకొనేప్పటికి అయిదు నిముషాలు పట్టింది.

"వెల్! ఇప్పుడు జాలయ్యాతో నేను చేసిన సంభాషణ అంతా వివరంగా ఎవరికి వారు విడివిడిగా స్టేట్ మెంట్లు వ్రాసివ్వండి" అన్నా వాళ్ళ అయిదుగురివైపూ చూస్తూ.

"సార్!" అన్నాడు అబ్దుల్లా భయం భయంగా.

"గో అన్! వెళ్ళి అరగంట లోపున స్టేట్ మెంట్లు వ్రాసి తీసుకురండి" అన్నాను వాళ్ళ వంక చూస్తూ.

"సార్! మేము స్టేట్ మెంట్లు వ్రాసిచ్చామని తెలిస్తే మమ్మల్ని వాడు బ్రతకనివ్వడు సార్! పెళ్ళాం, పిల్లలు గల వాళ్ళం. ఈ గొడవల్లోకి మమ్మల్ని లాగకండి సార్!" అన్నాడు అబ్దుల్లా కళ్ళనీళ్ళ పర్యంతమవుతూ.

నిముషంపాటే వాళ్ళవైపు చూస్తూ వుండిపోయాను. నిజమే వాళ్ళ భయాలు వాళ్ళ కుంటాయి. కాని నేను వీళ్ళ దగ్గర స్టేట్ మెంట్లు తీసుకోలేదని తెలిస్తే జాలయ్య మరింత విజృంభిస్తాడు. పైగా నేనీ ఉద్యోగానికి, ప్రాంతానికి క్రొత్త. వాడి మాటలు వినలేదనే ఉక్రోషంతో జాలయ్య నా మీద లంచం తిన్నానని కేసు పెట్టొచ్చు. ఆఫీసు స్టాఫు ఎవరెలాంటివారో నాకింకా పూర్తిగా తెలియదు. వాళ్ళను భయపెట్టో, డబ్బిచ్చి లోబరచుకొనో నాకు వ్యతిరేకంగా కోర్టులో సాక్ష్యం పలికిస్తే నా పని ఖాళీ. నయానో, భయానో స్టేట్ మెంట్లు తీసుకోవడమే మంచిదనిపించింది.

"లాభం లేదు అబ్దుల్లా! నా మాట వినండి. జాలయ్య లాటి విషపు పురుగుల్ని ఏరి పారెయ్యకపోతే మనలాంటి ప్రభుత్వోద్యోగులు పని చెయ్యలేరు. జాలయ్య మన న్నేమీ చెయ్యలేడు. న్యాయం మన పక్షాన వుంది... ప్రభుత్వం మన వెనుక అండగా వుంటుంది. ఈ కేసు ఋజువైతే జాలయ్య జైలుకి పోవడం ఖాయం. ఒక ప్రభుత్వోద్యోగికి లంచం ఇవ్వపోవడం, కొడతానని బెదిరించడం చట్టరీత్యా నేరం" అన్నాను అనునయంగా.

ఎవ్వరూ కాసేపు మాట్లాడలేదు. ఇంతలో ఏం నిశ్చయించుకున్నాడో, జానీ ముందు కొచ్చాడు.

"ఆ వెధవ జాలయ్యకు భయపడేదేందిరా! పదండి స్టేట్ మెంట్లు వ్రాద్దాం. ఆఫీసులో కొచ్చి మనల్ని బెదిరించడానికెన్ని గుండెలు వాడికి" అన్నాడు మిగతా వాళ్ళతో.

ఆ తర్వాత స్టేట్ మెంట్లు వ్రాయడానికి ఎంతో సేపు పట్టలేదు.

అపూటే మీసాలపల్లె ఇన్‌స్పెక్టర్‌కి ఓ రిపోర్టు, యాంటీకరెప్షన్ బ్యూరో సూపరింటెండెంట్‌కి మరో రిపోర్టు, ఈ స్టేట్‌మెంట్ కాపీలు జతచేసి పంపించాను. ఇన్‌స్పెక్టర్‌కి వ్రాసిన రిపోర్టులోనే జాలయ్యా బెదిరింపుల దృష్ట్యా వెంటనే ఆఫీస్ స్టాఫ్ అంతటికీ పోలీసు రక్షణ కల్పించమని తెలియచేశాను.

# 8

సాయంత్రానికల్లా జాలయ్యకు జరిగిన పరాభవం గురించి తెలిసిపోయింది. నిజాయితీగా వుండే ఆఫీసర్లకు ప్రజల్లో నుండి మంచి ప్రోత్సాహం లభిస్తుందనే విషయం నిజం. మర్నాడు ప్రొద్దున్నే మాకు రక్షణగా ఇద్దరు పోలీసు కానిస్టేబుల్స్‌ని పంపిస్తున్నట్లు ఫోన్ చేశాడు మీసాలపల్లె ఇన్‌స్పెక్టర్.

"వాళ్ళ మీద రిపోర్టు ఏరకంగానూ విత్‌డ్రా చేసుకునే సమస్య లేదంటారా?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ఫోన్‌లో.

"సారీ ఇన్‌స్పెక్టర్! మీరు ఎంత త్వరగా వాళ్ళమీద కేస్ ఫైల్ చేస్తే అంత మంచిది" అన్నాను.

"ఓ. కె. ఐ అండర్‌స్టాండ్! నామీద పైనుండి చాలా ప్రెషర్ రావడం వలన అలా అన్నాను. అంతే. ఓ గజిటెడ్ ఆఫీసరు పెట్టిన కేసు కావడంచేత పైవాళ్ళు ప్రత్యక్షంగా కల్పించుకోవడానికి జంకుతున్నారు. ఈ పూటే వాళ్ళందర్నీ తాలూకా రిమాండ్‌లోకి పంపిస్తున్నాను. వాళ్ళు స్టేషన్ జైల్లో వున్నంతసేపూ నాకీ ప్రెషర్ తగ్గదు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ జాలిగా.

"థాంక్యూ ఇన్‌స్పెక్టర్!" అన్నాను ఫోన్ పెట్టేస్తూ.

కాసేపట్లో మళ్ళీ ఫోను మ్రోగింది.

"హలో!" అన్నాను విసుగ్గా.

"ఫారెస్ట్ ఆఫీసరు రంగనాథేనా?"

"అవును."

"ఉండండి... యమ్మెల్లే రాయుడుగారు మాట్లాడు తారు" అన్నది అవతలి గొంతు.

"రంగనాథ్ గారేనా?" అన్నది మరో గొంతు ఓ అర నిముషం తరువాత.

"అవును" అన్నాను.

"నేను ఈ ప్రాంతం యమ్మెల్లేనండీ! నా పేరు పోతు రాయుడు!!'

"అలాగా నమస్కారమండీ!"

"చూడండీ! ఏం లేదు, నిన్న మీరు మా జాలయ్య మనుషులు అడవిలో కలప కొట్టుకెళుతోంటే అరెస్టు చేశారటగా...పాపం! వాళ్ళంతా బీద వెధవలండీ! వాళ్ళు లేకపోతే కుటుంబాలు తిండిలేక అల్లాడిపోతాయి. ఫస్ట్ అఫెన్స్ క్రింద మన్నించి ఈసారికి రిపోర్టు విత్ డ్రా చేసు కోండి" అన్నాడు పోతురాయుడు హుందాగా.

"చూడండి రాయుడుగారూ! మీరే అలా మాట్లా డితే నేను చెప్పగలిగింది ఏమీ లేదు. కాని ఒకటి మాత్రం స్పష్టం...ఇది వాళ్ళ మొదటి నేరం మాత్రం కాదు. పైగా జాలయ్యలాంటి పెద్దమనిషి వచ్చి నాకు లంచం ఇవ్వబోయాడు. వద్దంటే నాకు గోరీ కడతానని బెదిరిం చాడు. చూడండి సార్! కాస్త మీలాంటి పెద్దలు ఆ జాలయ్యగారికి బుద్ధి చెప్పాలి. ప్రభుత్వోద్యోగుల్ని బెది రించడం తప్పని ఆయనకు తెలియ జెయ్యండి" అన్నాను రాయుడు మరి మాట్లాడ్డానికి సందివ్వకుండా.

"మంచిదండీ...పాపం వాళ్ళమీద దయ చూపిం చండి" అన్నాడు రాయుడు ఫోన్ పెట్టేస్తూ.

# 9

సామదాన ఉపాయాలు అయిపోయాయి. ఈ రోజు నుండి మిగిలిన రెండూ అమల్లోకి తెచ్చాడు జాలయ్య.

ఉదయమే రాములయ్యగారు గదిలోకి వచ్చారు.

"కూర్చోండి!" అన్నాను కుర్చీ చూపెడుతూ.

రాములయ్య కుర్చీలో కూర్చున్నా ఎంతో ఇబ్బందిగా చెప్పదలుచుకొన్నది చెప్పలేక పోతున్నట్లు గ్రహించాను.

"చెప్పండి! ఎందుకు సందేహిస్తున్నారు?" అన్నాను. ఆయన చెప్పబోయే విషయ మేమిటో నే నప్పుడే వూహించడం మొదలు పెట్టాను.

"ఏమి లేదండీ! చెప్పడానికి బాధగా వుంది గానీ, ఒంటరిగాళ్ళు ఇంట్లో వుండడంవలన ఇంట్లో ఆడవాళ్ళు కాస్త ఇబ్బంది పడుతున్నట్లున్నారు అంచేత..." అంటూ నసుగుతున్నా డాయన.

చిన్నగా నవ్వాను నేను. "దానికి మొహమాట పడతారేమండీ మీరు. మీ ఇల్లు...మీ ఇష్టం...మీ రెప్పుడు ఖాళీ చెయ్యమంటే అప్పుడు చేస్తాను. ఎలాగూ ప్రభుత్వమిచ్చిన ఆఫీసు బిల్డింగ్ వుందిగా...అదీ చాలకపోతే ఫారెస్టు బంగళాలో వుంటాలెండి" అన్నాను.

"మీరు మరేమీ అనుకోకండి" ఏదో అంటున్నా డాయన.

"చూడండి రాములయ్యగారూ! మీరింకేమీ చెప్పకండి. ఇప్పటికే నా గురించి మీరు చాలా ఇబ్బందికీ, వత్తిడికి లోనయ్యారని తెలుసు. కాని ఒక్క విషయం చెప్పండి. జాలయ్య మిమ్మల్ని బెదిరించి వుంటాడు నా చేత ఇల్లు ఖాళీ చెయ్యించమని. అవునా?" అన్నాను ఆయన కళ్ళలోకే సూటిగా చూస్తూ.

అవునన్నట్లు తలాడించారు ఆయన. నా వలన ఊళ్ళో ప్రజలెవరికీ కష్టం కలగడం ఇష్టం లేదు నాకు.

వెంటనే రెండు గంటల్లో నా మకాం మళ్ళీ ఆఫీసు లోకి మార్చేశాను. విషయం తెలిసి తన ఇంట్లో వచ్చి వుండమన్నాడు రాఘవ. ఇప్పటికే అతను తెగించి చాలా సహాయం చేశాడు. వద్దని మృదువుగా చెప్పాను.

జాలయ్య మళ్ళీ ఫోన్ చేశాడు. "ఆఖరిసారిగా చెబు తున్నాను. బంగారంలాంటి కుర్రాడివి. పిచ్చిపట్టుదలకు పోయి ప్రాణం మీదకు తెచ్చుకోక... వెంటనే రిపోర్టు విత్ డ్రా చేసుకో" అన్నాడు.

"గో టు హెల్!" అన్నాను ఫోన్ పెట్టేస్తూ.

వారం గడిచింది. పట్టుకొన్న పదిమందిమీదా డిస్ట్రిక్టు మున్సిఫ్ కోర్టులో కేసు విచారణ కొచ్చింది. ఆ రోజు కేసుకు అటెండయి తిరిగి వచ్చేప్పటికి రాత్రి పది దాటింది.

బంగళా వాచ్ మెన్ వంట తయారుచేసిపెట్టి వెళ్ళి పోయాడు నైట్ డ్యూటీకి. చల్లారిన పదార్థాలు కష్టంమీద తిని, గది గడియలు పెట్టుకొని, దిండుక్రింద పిస్తోలు పెట్టుకొని నిద్రపోయాను.

ఉదయమే జాలయ్య మీద పెట్టిన కేసు గురించి యాంటి కరెప్షన్‌కు రిమైండర్ వ్రాయాలని ఆలోచిస్తూ నిద్రపోయాను.

# 10

"సార్! సార్!" ఎక్కడో ఎవరో పిలుస్తున్నారు. చెవులు పగిలే శబ్దాలు అవుతున్నాయి. కనురెప్పలు తెరచుకోవడం లేదు.

బలవంతంగా, అతి ప్రయత్నం మీద కళ్ళు తెరిచాను.

గదిలో వెలుతురు భరించలేక చటుక్కున కళ్ళు మూసు కొన్నాను. తలనెప్పి. భరింపలేని తలనెప్పి. మళ్ళీ చప్పుడు, ఎవరిదో పిలుపు.

"స్టాప్ దట్ సౌండ్!"_అరిచాను గొంతు చించుకొని

మరో రెండు నిముషాలగ్గాని పూర్తి స్పృహలోకి రాలేదు నేను. బాగా తెల్లవారి పోయింది. గదిలో టేబిల్ మీద గడియారం తొమ్మిది చూపెడుతోంది. గదినిండా వెలుతురు. అప్పుడు తెలుసుకొన్నాను గది బయట ఎవరో తలుపు కొడుతున్నారని.

మంచం మీద నుండి క్రిందకుదిగాను. కాళ్ళు నేల మీద ఆనడంలేదు, శరీరమంతా పట్టు తప్పినట్టు రబ్బరుకు మల్లే వుంది. ఒకసారి వెలుతురంతా కళ్ళలోకి రావడం వలన కళ్ళు నొప్పులు పుడుతున్నాయి. భారంగా కళ్ళు మూసుకొన్నాను. కంటి రెప్పలక్రింది నుండి నీళ్ళు కారు తున్నాయి. తలలో ఎవరో సమ్మెట్లతో బాదుతున్నట్లు నెప్పిగా వుంది. మళ్ళీ మంచం మీద కూలబడ్డాను. ఒళ్ళంతా ఏదో మత్తుగా ఉంది.

"ఎవరది?"__పిలిచాను. మనసులో ఏదో గుర్తొచ్చి ఆగి పోతోంది. రాత్రి ఏవేవో పీడకలలు మనసులో మెదలసాగాయి.

"నేను సార్ వీరన్నని. తొమ్మిదయింది సార్. పది గంటలకు మనం కోర్టుకెళ్లాలి సార్" అన్నాడు ప్యూను వీరన్న.

బలవంతం మీద మళ్ళీ లేచాను. చాలా మత్తుగా, భారంగా, వుంది. టవలుభుజాన వేసుకొని ముఖం తుడుచు కొంటూ తలుపు తీశాను.

వీరన్న నా ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు "ఒంట్లో

బావుండలేదా సార్!" అన్నాడు. లేదన్నట్లు తలవూపాను.
"ముఖం కడుక్కొని వచ్చేలోపల స్టౌ వెలిగించి కాసిని వేన్నీళ్ళు కాయి," అన్నాను.

అలమరాలోనుండి టూత్ పేస్టు బ్రష్ తీసుకొని వెనక ఆవరణలో కెళ్ళాను. బావిలో నుండి నీళ్ళు రాత్రి వాచ్ మెన్ తోడి వుంచాలి తొట్లోకి. మొహం కడుక్కొని, తలస్నానం చేశాను. మత్తువదిలి నట్లనిపించింది. తలనొప్పి మాత్రం తగ్గలేదు.

కాగిననీళ్లలో కాఫీపొడి వేసి డికాషన్ తయారు చేశాను. బీరువాలో నుండి ఆస్ప్రిన్ మాత్రలు రెండు తీసి వేసుకొని డికాషన్ త్రాగాను.

తల దువ్వుకోడానికి అద్దం చూసుకొని క్షణంపాటు ఆశ్చర్యపోయాను. ఉదయమే నన్ను చూచి వీరన్న ఆశ్చర్య పోవడంలో తప్పులేదు. పీక్కు పోయిన బుగ్గలు లోతుకు పోయిన కళ్ళు మాసినగడ్డం, జబ్బు పడ్డవాడికి మల్లే వున్నాను. ఒక్క రాత్రిలో ఎందుకలా అయ్యానో అర్థం కాలేదు.

షేవ్ చేసుకొని డ్రస్ అయ్యేప్పటికి వీరన్న తిరి గొచ్చాడు. అప్పటికి జీప్ డ్రైవరు కూడా వచ్చేశాడు.

వెంటనే కోర్టుకు బయల్దేరాము. దారంతా పీడకలల గురించే ఆలోచిస్తున్నాను.

రోజంతా ఏదో మత్తుగా, భారంగా గడిచింది.... కోర్టులో కూర్చున్నా నన్నమాటే గాని నిద్రముంచు కొస్తున్నట్లనిపించింది.

సాయంత్రనికల్లా కేసు ముగిసింది. వారంరోజుల తర్వాతకు జడ్జిమెంట్ వాయిదా వేశాడు. రాత్రికి హొట్లోనే భోంచేసి తిరిగివచ్చాను.

# 11

మరో పదిరోజుల్లో నా పరిస్థితి మరింత దిగజారి పోయింది. ప్రతిరాత్రి భయంకరమైన కలలు, పగలు ఎప్పుడో పదకొండు గంటలవేళ మేల్కొనడం. నిద్ర లేచినా, మత్తు, భారంగా వుండడం, చెప్పలేనంత నీరసంగా వుంటోంది. కళ్ళ వెంట, ముక్కు రంధ్రాల వెంట ఎప్పుడూ ఆగకుండా నీళ్ళొస్తున్నయ్. ఆకలి కావడం లేదు.

వాచ్ మెన్ ఏదో వండిపెడుతున్నాడు. తినబుద్ధి కావడం లేదు. అటూఇటూ కెలికి రెండు ముద్దలు నోట్లో పెట్టుకొని వదిలేస్తున్నాను. రాత్రిపూట అసలు భోంచెయ్యడం లేదు. వాచ్ మెన్ తెచ్చేపాలు తాగి పడుకొంటున్నాను. ఆ పాలే తాగకపోతే ఈ పాటికి మంచం పట్టి వుండే వాణ్ని అనిపిస్తోంది.

సాయంత్రం అయ్యేప్పటికి మనసులో చెప్పలేని దిగులు· ఏదో కావాలని తపన, ఒళ్ళంతా ఒణుకు. భయం మెల్లి మెల్లిగా జ్ఞాపక శక్తి తగ్గి పోతుందనే భయం కలుగు తోంది.

పదిరోజుల్లో శవంలా అయిపోయాను. అద్దంలో చూసు కొంటే ముఖమంతా పీక్కుపోయి, కళ్ళు లోతుకుపోయి, నీళ్ళు కారుతూ చాలా అసహ్యంగా కనిపిస్తోన్నాను. చేతులు మీదా, కాళ్ళమీద నరాలు వుబ్బి అసహ్యంగా కనిపిస్తున్నాయి, పదిరోజుల్లో ఇరవైయ్యేళ్ళ వయసు పైబడి నట్లనిపిస్తోంది.

ఏది ఆలోచించలేను. ఒంటరిగా, మత్తుగా, ప్రపం చంతో సంబంధం లేకుండా ఇరవై నాలుగంటలూ అలా సుషుప్తిలోకి, తెలియని సమాధిలోకి వెళ్ళి పోవాలని

పిస్తోంది. ఏపని చెయ్యాలన్నా మనసు రావడం లేదు.

జాలయ్యా మనుషులు ఒక్కొక్కరికీ ఆర్నెల్లు కఠిన కారాగార శిక్ష విధించారు. ఊరంతా జాలయ్యా తన అన్న మహాలింగం చేత చేతబడి చెయ్యించాడని, నేనందుకే ఇలా అయిపోతున్నానని బహిరంగంగా చెప్పుకొంటున్నారు. ఏ విషయాన్ని పట్టించుకోవాలని అనిపించడం లేదు.

రాఘవ వచ్చి ఎవరైనా మంత్రవేత్త దగ్గరికెళ్దాం రమ్మన్నాడు. నవ్వి, నాన్సెన్స్ అన్నాను. అనేక విధాల బ్రతిమిలాడినా నేను ఒప్పుకోక పోవడం వలన విసుగు చెందాడు. కనీసం తన ఇంట్లోకి వచ్చి వుండమన్నాడు. రానని చెప్పాను. రాఘవ ఇంట్లో వుండే, రాఘవను కూడా వత్తిడికి గురి చెయ్యదలచుకోలేదు. ఈ ఒంటరి ప్రపంచంలో రాఘవ ఒక్కడే నాకూ మిగిలిన మిత్రుడు.

యాంటీ కరెప్షన్ బ్యూరో నుండి జవాబు వచ్చింది. జాలయ్యా మీద కేసుపెట్టడానికి గ్రౌండ్స్ చాలవనీ, సాక్షులంతా నా క్రింది ఉద్యోగులుకాబట్టి, కేసులో అట్టే బలంలేదనీ వ్రాశారు. అయినా ప్రాథమిక దర్యాప్తు కోసం వాళ్లమనిషి ఒకడు త్వరలో నా దగ్గరకు వస్తాడనీ వ్రాశారు. డామిట్!

మర్నాటి వుదయానికి నా పరిస్థితి మరింత దిగజారింది. మత్తు, నీరసం ... డిప్రెషన్, తలనొప్పితో పాటు విపరీతమైన కడుపునొప్పి, ఛాతిలో విపరీతమైన మంట మొదలయ్యాయి. ఉపేక్షించి లాభం లేదనిపించింది. డ్రైవర్ని తీసుకొని వెంటనే మీసాలపల్లె గవర్నమెంట్ హాస్పిటల్‌కి వెళ్లాను.

"ఇటీజీ రేదర్ ఫూలిష్! మీలో మార్పు గమనించిన రోజే మీరు మెడికల్ చెకప్ చేయించుకోవలసింది."

అన్నాడు డాక్టర్ – ఈపదిరోజుల్లో నాలో వచ్చిన మార్పు విని.

చాలా కష్టరాడు అతను. నాలాగే, అప్పాయింట్ అయి రెండు నెలలయిందట. య. మ్కెస్. వెంటనే రకరకాల పరీక్షలు చేశాడు. క్రొత్త మూలాన అనవసర మైనవన్ని చేస్తున్నాడనిపించింది.

బ్లడ్ప్రెషర్ చూశాడు. టెంపరేచర్ తీశాడు. రెండూ అబ్నార్మల్గానే వున్నాయి. బ్లడ్ప్రషర్ నూట డెభ్బైయ్, టెంపరేచరు తొంభై తొమ్మిది పాయింట్ నాలుగు వుంది.

''కనీసం మీరు టెంపరేచరన్నా చూసు కోవలసింది'' అన్నాడు చిక్కిపోయిన నాశరీరాన్ని జాలిగా చూస్తూ.

బల్లమీద పడుకోబెట్టి పొట్టంతా నొక్కిచూశాడు. పల్స్, హార్ట్ బీటింగ్ చూశాడు. నూటలు మీద కూర్చోబెట్టి చిన్న రబ్బరు సుత్తితో మోకాలు మీద కొట్టాడు. ఏమీ అవలేదు. కాలు కొద్దిగా కదిలింది. అంతే!

''అలాచేస్తే ఏమవుతుంది డాక్టర్?'' అడిగాను.

''అవయవాల మోటార్ రియాక్షన్ టెస్ట్ చెయ్యడం. నిజం చెప్పాలంటె మీ మోటార్ రియాక్షన్స్ చాలా స్లోగా వున్నాయి.'' అన్నాడు గబగబ చీటిమీద ఏదో వ్రాసి నర్సుకిస్తూ.

''వెల్ డాక్టర్? ఏమిటంటూరు నా జబ్బు?'' అన్నాను పరిహాసంగా.

''నేనింకా ఏమీ నిర్ణయం చేయలేదు. కాని నా స్ట్రాంగ్ బిలీఫ్, లేదా ఊహ అనండి, ఏమిటంటే, మీ బాడీలో కొన్ని అసాధారణమైన ఆల్కమిక్ (రసాయన

సంబంధమైన) మార్పులు రావడం వలన సైకోఫిజికల్ డిప్రెషన్ ఏర్పడింది అనుకొంటున్నాను.'' అన్నాడు డాక్టర్.

''వాట్? విపులంగా చెప్పండి డాక్టర్'' అన్నాను ఆశ్చర్యంగా.

''ప్రస్తుతాని కేమీ చెప్పలేను, మీ బ్లడ్, యూరిన్ టెస్ట్ చేస్తే వెంటనే రిజల్ట్ తెలుస్తుంది'' అన్నాడు నర్స్ ఇచ్చిన సిరంజ్ తీసుకొని దగ్గరికి వస్తూ. బ్లడ్ తీసుకోవడం అయింతరువాత ప్రిస్క్రిప్షన్ పాడ్ మీద ఏవోమందులు వ్రాశాడు.

''ఈ అల్కలైన్ సిట్రేట్ వెంటనే పూటకు, మూడు చెంచాలు తీసుకోండి. 'టిరిడిసాల్' ఇంజక్షన్ వ్రాస్తున్నాను. రోజుకు 200 య మ్మెల్ చొప్పున తీసుకోండి. ఈ 'సైకోజ్' టాబ్లెట్లు పూటకుఒకటి చొప్పున వేసుకోండి. రాత్రిపడుకొనేటప్పుడు మాత్రం రెండు వేసుకొని పడుకోండి'' అన్నాడు ప్రిస్క్రిప్షన్ చేతికిస్తూ.

ఒకటి టానిక్, మరొకటి ఇంజక్షన్, ఇంకొటి టాబ్లెట్స్...ఇవ్వవలసిన మందులన్ని ఇచ్చాడు.

''మరో విషయం మిష్టర్ రంగా! మీకింకా కడుపు నొప్పి వస్తోందా!'' అడిగాడు.

''నో! డాక్టర్! మీదగ్గరికి వద్దామని బయలేరిన కాసేపటికి పోయింది'' అన్నాను.

''రైటో! మీరు మాత్రం గుడ్ డయిట్ తీసుకోవాలి. యూజ్ లాటాఫ్ ఫ్రూట్! ఎనీఫ్రూట్!'' అన్నాడు డాక్టర్.

మర్నాడు ఉదయమే యూరిన్ టెస్ట్‌కు పంపించాను. మధ్యాహ్నం రెండు గంటలవేళ డాక్టర్ ఫోన్ చేశాడు,

"హలో డాక్టర్! ఏమిటి మా రిజల్టు!" అన్నాను ఆత్రుతగా.

చెప్పాడు డాక్టర్ చాలా విపులంగా, నిదానంగా.

ఫోన్‌లో వింటున్న నాకు రిసీవర్ మీద పిడికిలి బిగుసుకొంది. "ఆర్ యు ష్యూర్ డాక్టర్?" అన్నాను గుసగుసలాడుతున్నట్టు.

"అయామ్ డామ్ ష్యూర్! లేకపోతే మిమ్మల్నిలా ఫోన్‌లో పిలిచి చెప్పేవాణ్నే కాదు. మీరు ఇమ్మీడియట్‌గా హాస్పిటల్లో అడ్మిట్ అవ్వాలి."

నాలో కోపం సుళ్ళు తిరుగుతోంది. మెల్లిగా శరీరంలో వణుకు ప్రారంభమయింది. జాలయ్య మీద కోపం, కసి క్షణక్షణానికీ పెరిగిపోతోంది.

"సారీ డాక్టర్! నేను వెంటనే హాస్పిటల్‌లో అడ్మిట్ అవలేను" అన్నాను.

"మిస్టర్ రంగా! మొండితనంగా ప్రవర్తించకండి. ఆలస్యంచేస్తే మీ ప్రాణాలు పోయే అవకాశం వుంది." అన్నాడు డాక్టర్.

"అయామ్ ఎక్స్ట్రీమ్లీ సారీ డాక్టర్! నేనిక్కడ చెయ్యాల్సిన పనులు చాలా వున్నాయి. నాకు రేపు వుదయం వరకూ టైమివ్వండి"_ అన్నాను మొండిగా.

"డోన్ట్ సే ఐహావ్ నాట్ వార్న్డ్ యు! రేపటికి పరిస్థితి చేజారిపోవచ్చు" అన్నాడు డాక్టర్ కోపంగా.

"ఐయామ్ సారీటు డిస్ ఒబేయు డాక్టర్! తప్పదు! థాంక్యూ!"_ అన్నాను ఫోన్ పెట్టేస్తూ.

## 12

జీపును తిన్నగా మహాలింగం శివాలయానికి తీసుకెళ్ళమని చెప్పాను. డ్రైవర్ని వెళ్ళిపోమని చెప్పి నేనొక్కణ్ణే లోపలకి వెళ్ళాను. గుడివెనక పెంకుటిల్లు వరండాలో

మహాలింగం గోడ కానుకొని చదికిలబడి వున్నాడు.

నన్ను చూడగానే క్రూరంగా నవ్వాడు. "ఓహో ఫారెస్ట్ ఆఫీసరుగారా! ఏమిటి దారితప్పి వచ్చారు?" అన్నాడు వ్యంగ్యంగా.

నేనున్న స్థితిలో కళ్ళనీళ్లు రావడం ఏమంత కష్టం కాలేదు, ముందుకువెళ్ళి మహాలింగం కాళ్ళమీద పడ్డాను.

"క్షమించండి స్వామీ, గర్వంలో, అహంకారంతో మీతో వైరం పెట్టుకొన్నాను. నాకీబాధ నుండి విముక్తి కలిగించండి, ఈ నరకం నుండి నన్ను తప్పించండి" అన్నాను బిగ్గరగా ఏడుస్తూ.

"ఏమిటి? ఏమిటి నువ్వంటున్నది" అన్నాడు మహాలింగం ఆశ్చర్యంగా. ఇంకా బిగ్గరగా వెక్కిళ్ళతో ఏడ్చాను. "ఈపాపిని మన్నించి మీ మంత్రం ఉపసంహరించుకోండి స్వామీ! మీరేది చెపితే అది చేస్తాను. నన్ను మాత్రం వదలిపెట్టండి" అన్నా అతని కాళ్ళను వదలకుండా.

"మూరుడా! ముందు కాళ్ళు వదులు, ఈ జ్ఞానం ముందుంటే ఇంత బాధపడేవాడివి కాదు." అన్నాడు మహాలింగం చాపమీద నుండి లేచి దూరంగా జరుగుతూ.

మళ్ళీ ముందుకు జరిగి, ఈసారి అతని రెండు కాళ్ళు ఇంకా గట్టిగా పట్టుకొన్నాను.

"మీరు నన్ను రక్షిస్తానని అభయహస్తం ఇస్తే తప్ప మీ కాళ్లు వదిలేది లేదు." అన్నాను తలెత్తి అతని ముఖంలోకి చూస్తూ.

మహాలింగం ముఖంమీద నవ్వులాంటిదేదో కనిపించింది. "సరేలే! నీవలన పది కుటుంబాలు కష్టాలలో పడ్డాయి, వాళ్ళకు నష్టపరిహారం ఇచ్చుకొంటే నిన్నీబాధ నుండి విముక్తుణ్ని చేస్తా" అన్నాడు మహాలింగం విశ్వామిత్రుళ్ళా.

"అలాగే స్వామీ మీ ఇష్టం. మీరేం చెబితే అదిచేస్తా. నన్నుమాత్రం ఈ బాధ నుండి తొలగించండి" అన్నాను అతని పాదాలు కళ్ళ కద్దుకొంటూ.

"అవన్నీ జాలయ్యా చూసుకొంటాడు, ఇప్పుడే కబురు పెడతానుండు" అన్నాడు, మహాలింగం దేవాలయంవైపు వెళుతూ.

నేను నీరసంగా లేచి కూర్చొని అతను వెళ్ళిన వైపే చూస్తూ వున్నాను. మహాలింగం అతిప్రయాసగా గుడి మెట్లెక్కి అడవివైపు తిరిగి 'ఓహో!' అంటూ రెండు పొలికేకలు పెట్టాడు. అతనిస్వరం విని అదిరిపడ్డాను నేను. లౌడ్ స్పీకర్ లో అరిచినట్లుంది.

కాసేపట్లో బంగళా వాచ్ మెన్ పరిగెత్తుకొంటూ వచ్చాడు అడవిలో నుండి. అతన్తో ఏదో చెప్పి పంపించే శాడు మహాలింగం.

నాకు క్షణక్షణానికీ నీరసంవచ్చేస్తోంది. గోడకానుకొని అలానే కూర్చుండి పోయాను. "వాచ్ మెన్ కూడా మీ భక్తుడేనా స్వామీ?"_ అన్నాను నీరసంగా.

"తప్పు తప్పు శివసేవకులు" అన్నాడు మహాలింగం.

వరండా గోడ నానుకొని అలాగే నిద్రపోయాను. ఎవరో భుజంపట్టుకు కదుపుతోంటే మెలకువ వచ్చింది. భారంగా కళ్ళు తెరిచాను. ఎదురుగా నలుగురైదుగురు వ్యక్తులు నిలబడి వుండడం లీలగా కనిపిస్తోంది.

"దాహం" అన్నాను. కాసేపటికి ముఖం మీద నీళ్లు చల్లి, నోట్లో నీళ్ళు పోశారు.

ఎదురుగా జాలయ్య నిలబడివున్నాడు. వాడి ప్రక్కనే రామభక్తుల్లా ముగ్గురు వస్తాదులు, వాచ్ మెన్, మహాలింగం నిలబడి వున్నారు.

“ఏమోయ్ రంగనాథం, మేడ దిగావంటగా?” అన్నాడు జాలయ్య నవ్వుతూ. మిగిలిన అందరూ పగలబడి నవ్వారు.

బలహీనంగా నవ్వాను, రెండు చేతులూ ఎత్తి నమస్కారం చేస్తూ.

“అదృష్టవంతుడివి. ఈరోజుకైనా తెలివి తెచ్చుకొన్నావు, ఆ పది మంది కుటుంబాలకీ నష్ట పరిహారం ఇచ్చుకొంటావా?” అడిగాడు.

“నావద్ద ఇవ్వడానికి ఏమీ లేదు” అన్నాను నీరసంగా.

“ఓ పది గంధపుచెట్లు కొట్టుకొంటే పోలా” అన్నాడు వాచ్ మెన్. “మీ ఇష్టం” అన్నాను.

“సరే! దీనిమీద ఓ సంతకం పారేయ్. తర్వాత వ్యవహారం ఎటుపోయి ఎటొచ్చినా పని కొస్తుంది” అన్నాడు ఓ కాగితం పెన్ను నాకిస్తూ.

కాగితం వంక తేరిపార జూశాను. టెండరు గ్రాంట్ ఫారం అది. పది గంధపుచెట్లు కొట్టుకోమని ప్రభుత్వం తరుఫున నేను గ్రాంట్ చేసే ఫారం. ఆఫీసు ముద్రతో సహా అన్నీ పూర్తి చేసి వున్నాయి, నా సంతకం తప్ప. అంటే తర్వాత నేను ఎదురు తిరిగితే నేను ప్రభుత్వానికి తెలియకుండా టెండరు గ్రాంట్ చేసి, టెండరు డబ్బు తిన్నట్లు బుజువు చెయ్యడాని కది పనికొస్తుంది.

సంతకం పెట్టబోయి ఆగిపోయాను. మెల్లగా లేచి నిలబడ్డాను. “ఏమిటి?” అడిగాడు జాలయ్య.

కాండ్రించి అతని ముఖం మీద తుపుక్కున ఉమ్మాను. జాలయ్య ముఖంలో క్షణం ఆశ్చర్యం కనిపించింది. మరు క్షణం తేరుకొన్నాడు.

అరచెయ్యి తిప్పి ముఖంమీద బలంగా కొట్టాడు. కళ్ళు తిరిగినట్లనిపించింది. తూలి క్రింద పడ్డాను. బొడ్లో

పిస్తోలు పొట్టలో గుచ్చుకొంది. బాధగా మూల్గాను. జాలయ్య అనుచరుడొకడు నడుం మీద తన్నాడు. వెన్ను విరిగిందనిపించింది.

పైకి లేవడానికి ప్రయత్నిస్తూనే పిస్తోలు బయిటికి తీశాను. నామీద వస్తున్నవాడి కాళ్ళను చూసి కాల్చాను.

"అమ్మో" అని అరిచాడు వాడు ఎగిరి క్రిందపడుతూ.

మిగిలిన నలుగురు ఎక్కడి వాళ్ళక్కడే ఆగిపోయారు. జాలయ్య కోపంతో పళ్ళు పటపట కొరికాడు. పిస్తోలు మ్రోత వినగానే ఆ చుట్టు ప్రక్కల దాగిన పోలీసులు ఒక్కుమ్మడిగా మీదపడి జాలయ్య ముఠాని బంధించారు. నేను నీరసంతో కూలబడి పోయాను.

## 13

నేను కళ్ళు తెరిచేసరికి హాస్పిటల్లో వున్నాను.

కాళ్ళ దగ్గర నాన్న, అమ్మ, తమ్ముళ్ళు, చెల్లాయి కనుపించారు. అందరూ ఆత్రుతగా నా ముఖంలోకే చూస్తున్నారు. బలహీనంగా నవ్వాను. ఒళ్ళంతా నెప్పులు. కడుపులో సూదులు గుచ్చినట్లు వుంది.

"కదలకండి" అన్నారు ఎవరో. తల త్రిప్పాను. నెప్పిగా వుంది. డాక్టర్ నవ్వుతూ చూశాడు.

"కంగ్రాచ్యులేషన్ మిస్టర్ రంగా, ఆపరేషన్ నుండి చాలా త్వరగా తేరుకొన్నారు" అన్నాడు డాక్టర్.

"ఆపరేషన్ చేశారా డాక్టర్?" అన్నాను, గొంతు ఎక్కడో నూతిలో నుండి వచ్చినట్లుంది.

"యస్, క్వయిట్ సక్సెస్ ఫుల్! మీ కడుపులోంచి ఏంతీశానో చూస్తారా," అన్నాడు నర్సుకు సైగచేస్తూ.

ఏదో బాటిల్ లాంటిది పట్టుకొచ్చింది. బాటిల్ లోనిది నాకు కనబడేలా పట్టుకొన్నాడు డాక్టర్. నల్లగా, పీచులా, వుండలా వుంది.

"నల్లమందు, ఇంకా కొన్ని తెలియని వేళ్లూ కలిపి తయారుచేసింది. రోజూ మీకు వంటచేసే వాచ్ మెన్ సహాయంతో మీకు తినిపించాడు మహాలింగం. ఇదిలోపల కడుపులో జీర్ణకోశంలో స్థానంచేసుకొని నాచులా పెరగడం ప్రారంభించి మీరక్తాన్ని కలుషితం చేసింది. దీనిపేరేమిటో నాకు సరిగ్గా తెలియదు. పూర్తి ఫోరెన్సిక్ రిపోర్ట్ కోసం పోలీస్ లాబ్ కు పంపిస్తున్నాము. చాలావిష పదార్థం అయ్యుండాలి. పదిరోజుల్లో మీరక్తాని పూర్తిగా కలుషితం చేసింది. మొన్న ఆపరేట్ చేసి బ్లడ్ ట్రాన్ ఫ్యూజన్ చేసివుండకపోతే," ఆగిపోయాడు డాక్టర్.

అమ్మ, చెల్లాయి వెక్కి వెక్కి ఏడుస్తున్నారు, తల తిరుగుతున్నట్లుంది.

"జాలయ్య?" అన్నాను బలహీనంగా.

"జాలయ్యను, వాడిముఠాని జైల్లో వేశారు. వాచ్ మెన్ను పోలీసులు బెదిరించేప్పటికి జాలయ్య దగ్గర డబ్బు తీసుకొని మీకు రోజూ పాలల్లో ఈ మందు కలిపి నట్లు ఒప్పుకొన్నాడు. వాళ్ళు పట్టుపడే ముందు రోజు రాత్రి ఇచ్చిన పాలు మీ గదిలో చెంబులో అలానే వున్నాయి. దాన్ని పోలీసులు స్వాధీనం చేసుకొన్నారు. ఈ కడుపులో పదార్థం పాలల్లో పదార్థం ఒకటేనని ఋజువైంది. క్రిమినల్ కాన్స్పిరేషన్ క్రింద పదిహేనేళ్ళకు తగ్గకుండా జైలు పడుతుంది. గర్భగుడిలో దొరికిన కొన్ని గంధం చెక్కల మీది నంబర్లు పోయిన దుంగలవే అని ఋజువైనాయి. జాలయ్య, వాడిముఠా ఇక జైల్లోంచి బయిటికొచ్చే అవకాశంలేదు" అన్నాడు డాక్టర్.

నీరసంగా కళ్ళు మూసుకొన్నాను.

—: ఐపోయింది :—




## (17వ భాగము)

"ఆఁ" అంటూనే ఒక డింగీని, రెండు చేతుల్తో పట్టుకొని పైకెత్తి పట్టుకొన్నాను. ఇసుకలో బర బర ఈడ్చుకుంటూ నీళ్ళ దగ్గరకు లాక్కొచ్చాను. డెల్లా కూడా మా సంచులు మోసుకొని వచ్చేసింది.

సంచుల్ని డింగీలో పెట్టాం. ఇద్దరం డింగీని నీళ్ళలోకి త్రోసి, నడుం లోతుదాకా నీళ్ళల్లో నడుచుకుంటూ వెళ్ళాం. ఆ తర్వాత ముందామెను ఎక్కించి, తర్వాత నేను ఎక్కి కూర్చున్నాను.

డింగీ మెల్లగా ముందుకు కదిలింది.

చీకట్లో దారి చూసుకుంటూ, తెడ్లు వేస్తూ, అంతకు ముందు కొండ దగ్గరకు వెళ్ళిన త్రోవనే వెళ్ళసాగాను డింగీతో.

"రాజ్! మన ప్రయాణ మీ డింగీలో నేనా?" అడిగింది డెల్లా.

"దీంతో ఈ సముద్రంలో ప్రయాణం చెయ్యటం కష్టం. ముందా కొండ వద్దకు వెళ్దాం. ఆ తర్వాత ఆలోచిద్దాం" అన్నాను.

"ఏదైనా షిప్ వచ్చే అవకాశం వుందా?"

"తెలీదు. వస్తే అదృష్టవంతులమే!"

"పోనీ, ఆ కొండపైన వుండి రెండు దినాలు వెయిట్ చేద్దామా?" అడిగింది డెల్లా.

"వద్దు! ఆమె మన తుపాకీ గుండ్లనుండి తప్పించుకుని వెళ్ళింది. ఈపాటికి గూడెం చేరి వుంటుంది. నాయకుడికి మన పరారీ గురించి, ఆమెను మనం చంపబోయిన వైనం గురించీ చెప్పి వుంటుంది. మన కోసం వాళ్ళు వస్తారు. మనం కొండ దగ్గరే వుంటామని వాళ్ళు ఊహిస్తారు. అందువల్ల మనం ఎలాగైనా ఇంకా ముందుకు వెళ్ళిపోవాలి. ఈ రాత్రి, రేపు పగలూ సముద్రంలోనే గడపాలి" అన్నాను.

"సముద్రంలో తుఫానుగానీ, గాలివానగానీ, రాకుంటే ఈ డింగీలో ఎలాగోలా ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని కాలక్షేపం చెయ్యొచ్చు" అంది డెల్లా.

మా డింగీ కొండ ప్రాంతానికి వచ్చేసింది. రెండు కొండల మధ్య నుంచి ముందుకు కదలిపోయింది. అలాగే మైలుదూరం వెళ్ళిపోయాం. పెద్ద పెద్ద అలలతోపాటు వెడల్పాటి కెరటాలు కూడా మా డింగీని తల క్రిందులు చేసేందుకు ప్రయత్నించాయి.

బరువును మారుస్తూ, తెడ్లు జాగ్రత్తగా వేసుకుంటూ వాట్ని దాటాం. అవతలవేపు ప్రశాంతంగా వుంది.

జోరుగా సముద్రపు హోరు మాత్రం వినిపించసాగింది.

ఈ వాతావరణం మాకు క్రొత్తకాదు. అంతకు ముందు రెండు మూడుసార్లు ఇలాంటి పరిస్థితుల్లోనూ, వాతావరణం లోనూ చిక్కుకుని వున్న మాకు పెద్దగా భయంగానీ, ఆశ్చర్యంగానీ కలుగలేదు.

అప్పటికి మేము గూడెం నుండి తప్పుకొని వచ్చేసి నాలుగు గంటలకు పైనే అయివుండాలనిపించింది.

నేను తీరంకేసి చూడసాగాను.

"నిద్ర వస్తోంది కాసేపు పడుకొంటాను" అంది డెల్లా.

"పడుకో! సంచీపైన తల పెట్టుకొని కాళ్ళు డింగీ అంచు పైన, నీళ్ళలోకి జారేట్లుగా వుంచుకో" అని చెప్పాను.

ఆమె నేను చెప్పినట్లే చేసింది. డింగీ ఆమె కదలికలకు అటూ ఇటూ వూగింది. నా బరువు అవసరమైన పద్ధతిలోకి మార్చుకుంటూ, డింగీ తల్లక్రిందులుగాకుండా చూసుకు న్నాను.

డెల్లా హాయిగా పడుకుంది.

నేను సిగరెట్ వెలిగించాను. కొండపైన వెలుతురు కనిపించింది. కళ్ళు చిట్లించి చూశాను. బారులుగా మండు తున్న కాగడాలు కనిపించాయి. నాయకుడు అతని పటాలం వచ్చేశారని తెలుసుకున్నాను.

అక్కడ్నుంచి నేనుగానీ, డింగీ గానీ వాళ్ళకు కను పించే అవకాశం లేదు. వాళ్ళేం చేస్తారని ఆలోచించ సాగాను.

కాసేపు చుట్టూ చూసి వెళ్ళిపోతారు. అంతకన్నా మరేం చెయ్యగలరు? నన్ను నేను ప్రశ్నించుకున్నాను.

నాయకుడికి నాపైన వున్న ప్రేమ ఎంతో గుర్తొచ్చింది. అతన్ని మోసం చేశానని తెలియగానే అంతకు అంత ద్వేషం పుట్టి వుంటుంది. చిక్కితే చంపాలన్నంత కోపంతో వచ్చి వుంటుందనుకున్నాను.

నేను కొండ కేసి చూడసాగాను.

ఐదు నిముషాల తర్వాత, సముద్రంలో కాగడాలు అన్ని వేపులా వెళ్ళిపోతూ కనిపించాయి. అంటే తన జనాన్ని డింగీల్లోనే సాధ్యమైనంత దూరం వెళ్ళి వెతికి రమ్మని నాయకుడు పురమాయించి వుండాలి.

మేమున్న వేపు కూడా కొన్ని డింగీలు కదలిరావడం గమనించాను. నేను క్షణాలలో ఒక నిశ్చయానికొచ్చాను.

సిగరెట్ తాగుతూనే డింగీల వైపు తదేకంగా చూడసాగాను. డెల్లా మంచి నిద్రలో వుంది.

నా వైపు వస్తున్న కాగడాల్ని లెఖ్ఖ పెట్టాను. మొత్తం ఆరున్నాయి. అంటే ఆరుమందన్నా, లేక పన్నెండు మందన్నా వుండి వుండాలి. దగ్గరకొస్తేగానీ ఖచ్చితంగా తెలియదు. అంతకంతకూ అవి దగ్గరవుతున్నాయి.

డెల్లాను లేపాను చేత్తో మెల్లగా తొడపైన తట్టి.

ఉలిక్కిపడి లేచి "ఏమిటి?" అంది.

"వాళ్ళొస్తున్నారు!" అన్నాను.

"ఎవరు?" అంది నిద్రమత్తులో అర్థంగానట్టు.

"వాళ్ళే! మన గూడెంవాళ్ళు. దగ్గరకొచ్చేస్తున్నారు" అన్నాను.

"ఏం చేద్దాం?" అడిగింది లేచి కూర్చుని గాభరాగా.

"చేతులు ముడుచుకొని కూర్చుంటే లాక్కుపోతారు. మన దగ్గర తుపాకులున్నాయి. కాల్చిపారేద్దాం" అన్నాను.

"సరే!" అంటూ తన తుపాకీ చేతికి తీసుకుంది డెల్లా.

నేను కూడా తుపాకీని సరిచేసి పెట్టుకున్నాను.

వాళ్ళను కాల్చేముందు, మా డింగీని ఏ పరిస్థితుల్లోనూ వాళ్ళమధ్య వుండేట్లుగా చెయ్యకూడదని తీర్మానించుకున్నాను.

డింగీలు దగ్గరయినాయి. వందగజాల దూరంలో వుండి వుంటాయనుకున్నాను. అవి యీ కొండ దగ్గరకు వస్తేగాని కాల్చి ప్రయోజనం లేదు.

సముద్రపు హోరును మించి వినిపించాయి వాళ్ళ హాహాకారాలు.

మమ్మల్ని వాళ్ళు చూచినట్లున్నారని పసిగట్టాను. ఆ సంతోషంలోనే వాళ్ళలా అరుస్తున్నారని అర్థం చేసుకున్నాను.

డింగీలు బాగా దగ్గర కొచ్చాయి. మొత్తం ఆరున్నాయి. అంటే పన్నెండు మంది దాకా వచ్చారు మా వేపు.

"దగ్గరకు రావద్దు. మావద్ద తుపాకులున్నాయి. ముందిగా వచ్చారంటే కాల్చి పారేస్తాను." వాళ్ళ భాషలోనే హెచ్చరిస్తూ అరిచాను.

"మిమ్మల్ని పట్టుకుపోయేందుకు వచ్చాం. కాల్చినాసరే మా ప్రయత్నం మానము. మా నాయకుడి ఆజ్ఞ" అన్నారు వాళ్ళు ముక్తకంఠంతో.

"అయితే మీ ఖర్మ!" అంటూ మొదటి రౌండు గురిపెట్టి కాల్చాను. డెల్లా కూడా ఫస్ట్ రౌండు ఫైర్ చేసింది.

"అమ్మో!" అన్న అరుపులు చీకటిని పెగుల్చుకుని హృదయవిదారకంగా వినిపించాయి.

(ఇంకావుంది)

# సప్లిమెంట్ పోటీ - 13.

64, 65, 66, 67, 68 — అంకెలను తీసుకొని మీకు నచ్చిన వరుసక్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 70 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|

మా ఆఫీసులో సీలుచేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు నవంబర్ '75 నెల మాసపత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, చక్కటి వ్యాఖ్యలు ఒక పోస్టు కార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 10 వ తేదీలోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవాఖ్యలతో 30 పైసలు స్టాంపులుపంపాలి.

మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీలోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ కత్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి. —ఎడిటర్

